సూ. 'దేశీయమహాజనసభ దానికై దృఢప్రయత్నము చేయుచు నున్నదట! జస్టిస్‌వర్గమువారును చట్టకూటములలోఁ జేరుటకు గాఢ ప్రయత్నము లొనర్చుచు నున్నారట! ఈ రెండుకక్షులు గాక వేఱొకటి బయలువెడలినది.'

నటి. 'అ దేంది?'

సూ. 'ప్రజాకక్ష' అనునది.

నటి. 'అయితే దానికి సృష్టికర్త?'

సూ. 'పీఠికాపురసంస్థానాధీశ్వరుఁడు.'

నటి. 'ఆ భూస్వామికక్షకున్నూ తక్కినరెండు కక్షలకున్నూ భేదం వుందా?'

సూ. లేక యేమి? 'ప్రజాకక్షలో నెల్లజనులకును జేరనధికారము కలదఁట! జస్టిసువర్గమున బ్రాహ్మణులకుఁ దావులేదు. తక్కుంగల వారి కందుఁ జోటుండును.'

నటి. 'అదేమి ఆలా అంటూ వున్నారు? బాపలకున్నూ దానిలో చోటుండంచూ బొబ్బిలిసింగం గర్జించిందే.'

సూ. అయినను బ్రాహ్మణుల కందుఁ జేర నిచ్చలేదు. దానివలన నాకక్ష పూర్వ మెట్లుండెనో అట్లే ఉన్నది ఇప్పుడుకూడ.'

నటి. 'అయితే సరి. ఇంక దేశీ.........' (అనఁబోవుచుండ నడ్డుపడి, సూత్రధారుఁడు) 'బ్రిట్టిషుదొరతనముతోడి పొత్తే వల దనువారికే కాంగ్రెస్సులోఁ జేర వీలుండును.

నటి. 'ఈమూఁడుకక్షలున్నూ కాకుండా మఱేన్ని కక్షలేవైనా వుంటున్నవా?'

సూ. "కక్షలని చెప్పఁదగినవేవియు లేవు."

నటి. 'అయితే ఎన్నిక లెప్పుడు జరుగునో.'

సూ. 'అచిరకాలముననే.'

నటి. 'ఈ యెన్నికలం గూర్చిన నాటక మాతా మాడఁ గోరునది?'

సూ. 'అవునవును. ఊ నాటకమున కుపోద్ఘాత మనఁదగినదే మనయిరువురిసంభాషణ. 'వినుచున్నావా తెరలోఁగొంద ఱెవరో సంభాషించు టెఱుఁగు.'

నటి. 'నాకున్నూ వినబడుతూ వుంది.'

సూ. 'ఇఁక నిట నుండ మనకుఁ దగదు. పోవుదము.

క. వినఁ బడు చున్నది యిద్దఱు
మనుజులసంభాషణంబు ♦ మన కిట నుండన్
అనువుపడ దోలగంబును
గన నుబ్బున నాటకంబు ♦ క్షమవిడుఁగంటే!

పద. పద? (అని యిద్దఱును నిష్క్రమింతురు.)

ఇది ప్రస్తావన.

స్థలము. ఒకానొకపల్లియ. సముద్రతీరము.

కాలము. అస్తమయమునకు రమారమి జాముప్రొద్దుండును.

"రామచంద్రా! రాత్రి మాయింటివాకిటియరుఁగు మీఁదఁ గూర్చుండి ఎవరితో సంభాషిస్తూ వుంటివి?" (అని భువనగిరి శేషాద్రిశాస్త్రి లక్షావుల రామచంద్రారెడ్డి అనుపంటకాఁపుసంసారితో సంభాషించుచుఁ బ్రవేశించును.)

ల. రా. 'దేశీయమహాజనసభానాయకు లఁట!'

భు. శే. 'వారు ప్రసంగిస్తూ వుండినవిషయ మేందో కాస్త నా చెవుల్లో పడవేస్తావా?'

ల. రా. 'ఎన్నిక లఁట! అచిరకాలంలో నే జరుగుతవఁట! దేశీయమహాజనసభచే నియమితులైవుండే వరుల నే శాసనసభాద్వయమునకు వరించుకోవలసిందిగా నన్నుఁ గోరిరి.'

భు. శే. 'వారికి నీ వేమని బదులు చెప్పినావు?'

ల. రా. 'శాసనసభలమూలాన ప్రజాభిప్రాయాన్నే దొరతనంవారికి తెలియఁజేసేవాళ్ళ నే కోరుకొంటాం. తక్కినవాళ్ళెంతదొడ్డవాళ్ళై వున్నా మేము వాళ్ళను వరించుకో మంచూ బదులు చెప్పినాను.'

భు. శే. 'వాళ్ళు 'సరే' అంచూ పోయినారా?'

ల. రా. 'పోలేదు. ప్రజాభిప్రాయ మే చెప్పతాం. మా వ్యక్తిగతాభిప్రాయాలా శాసనసభలమూలాన దొరతనానికిఁ జెప్పం' అని అన్నారు.

భు. శే. 'దాని కే మంటివి?'

ల. రా. 'ఇక్కడ ప్రజాభిప్రాయాన్ని చెప్పతాననడం. శాసనసభలకడప లెక్కేటప్పటికి మాతో చేసిన ప్రమాణాలన్నింటిని మఱచి పోవడం. స్వర్గంలో నుండి వాళ్ళక్కడ వుట్టిపడ్డట్లు నటించడం. కావున ఈవిషయంలో మాగ్రామస్థులందఱితో ఆలోచనచేయకుండా వాళ్ళ కని కానీ, మీకని కానీ, ఇస్తాం అంచూకానీ, ఇయ్యడం లేదంచూ కానీ, చెప్పలేమంటిని.

భు. శే. 'వా ళ్ళే మన్నారు?'

ల. రా. 'గాంధి మహాత్ముఁడఁట. స్వార్థత్యాగి అఁట. అంటరానితనాన్ని తొలఁగించడానికై కంకణం చేత కట్టుకొని వున్నాఁడఁట! ఆతనియత్నంవల్లనే దేశీయమహాజనసభపే రొందిం దంట' అంచూ గాంధినిగూర్చిన్నీ దీర్ఘోపన్యాసం చేసి ప్రజాభిప్రాయాన్నే

భు. శే. (రెండవవ్యక్తిం గాంచి) 'దేవరా! తమకుఁ జెప్ప వలసి వుండే నాల్గుమాటలను వెడలగ్రక్కండి.'

రెం. వ్య. 'చిత్తం చిత్తం.' (అని లేచి) 'అగ్రాసనాధిపా! సభ్యులారా! ఆఁడుమానికములారా! చట్టకూటాల్లో ప్రవేశించ వలసిందంటూ, కాంగ్రెస్సుపార్లమెంటుబోర్డు నా కాజ్ఞ చేశింది. దానికి నేను వరుణ్ణి. సాలుకు దొరతనానికి వేయిరూపాయలరొక్కం పన్ను చెల్లిస్తూ వున్నాను. నాకున్నూ ఇంగ్లీషు తెలుసును. తెలుఁగు పెద్దపుస్తకాలు చదువుతాను. వీసం ముక్కకూడా తెలుసును. మావూళ్లో పంచాయతీ బోర్డు కధ్యక్షుణ్ణిగా వుండి ఆరేళ్ళకాలం పని చేశి వున్నా. దానివల్ల నాకున్నూ ప్రజాప్రభుత్వం నడిపే విధానం తెలుసును. గాంధిమహాత్ముఁడు మా గ్రామానికి వస్తూ వుండినప్పు డంతా మా కున్నంతలో ఆ మహాత్మునికి ముడుపులు చెల్లించుకొంటూ వచ్చినా. దానివల్ల ఆయన అనుగ్రహానికి పాత్రుణ్ణిగా అయి వుంటున్నాను. అప్పుడు జస్టిస్ వర్గంలో నేను వుండినా. వుండినప్పటికిన్నీ, ఆమహాత్మునియందు నా కుండేభక్తితాత్పర్యాలు వర్ణనాతీతం. దానివల్ల నే యిప్పు డిప్పుడే ఖద్దరు కట్టడానికి అలవాటు చేసుకొంటూ వున్నా. ముతక. (మనస్సులో 'అబ్బే') (ప్రకాశంగా) బిరుసు. బరువు. దానివల్ల మిల్లు ఖద్దరే ధరిస్తూ వుంటున్నా. గాంధిమహాత్ముని వుత్తర్వుకూడా దానికైదంట! గాంధిమహాత్ముని ఫోటో పెట్టుకొంచూ వుంటున్నాను. జస్టిస్ పార్టీ కాంగ్రెస్సుముందర డంగై పోయింది, బెబ్బులింగన్న జింకపిల్లలాగ. ఆపార్టీవాళ్ళ కింక వోటెందు రావడం, మీరంతా ఒక్కట్టిగా చేరి నన్నే వరించుకొన్నట్టయితే? వాళ్ళకు చట్టకూటాల్లో సభ్యత్వం రావడం కుందేటికొమ్మే. అసభ్యత్వం తప్పక వస్తుంది దొరతనంవారిపాదారవిందాలను వుడుములాగా పట్టుకొంచూ వున్నంతకాలం.

చట్టకూటాల్లో మీమీదయావల్ల ప్రవేశిస్తా. పార్లమెంటువాళ్ళు తమకు లాభకరంగా వుండేలాగ హిందూదేశానికి ఇచ్చి వుండేకొత్తచట్టాన్ని తలబద్దలయ్యేలాగ పగలగొట్టా; ఆయనక్క స్వరాజ్యం వస్తుంది. తెల్లవాళ్ళు ఈదేశాన్ని ఇడిశేశి తెల్లదీవిగడ్డ కెళ్తారు. పస్తులు తగ్గతవి. లంకషైరునోట మట్టే. రైళ్లు మనవి అవుతవి. ఈడ తెల్ల పురుగుంటే అప్పుడు నన్నడగండి. నన్నే మీరు వరించుకొనండి. మీకు శోభనాలవుతవి.' (అనఁగా సభలో గొల్లున నవ్వు పుట్టెను. రామచంద్రారెడ్డి పైకి చేయెత్తగా నానవ్వడఁగెను. వెంటనే యీల విన వచ్చెను. రెండవవ్యక్తి ఆసీనుఁడయ్యె)

(అన విని సభాధ్యక్షుఁడు మూఁడవ స్త్రీవ్యక్తినిఁ జూచి, 'ఓయోషిద్రత్నమా! మీకుఁ జెప్పఁ దలఁచి వుండే నాలుగైదుపలుకులు వెడలఁ గ్రక్కండి.' (అని యనియెను.)

స్త్రీ. వ్య. 'సభాధ్యక్షా! సభ్యులారా! గాంధిమహాత్ముఁడు కాంగ్రెస్సును తనఅధీనం చేసుకొన్నాఁడు. అన్యప్రభుత్వానికి చేతులు కట్టుకొంచూ జబాబు చెప్పేధోరణి కాంగ్రెసుకు లేదు. తన్ను తానే వుద్ధరించుకోవలసిందంచూ కాంగ్రెసు తీర్పు చేసింది. హైందవసంఘాన్ని కల్పాంతకళంకంగా వుండే అంటరానితనం మాయ మయ్యేలాగ కాంగ్రెస్సు తీర్పు చేశింది. వంటయింట్లో కుండలు తోముకొంచూ వుండే ఆడవాళ్ళం గుడిసెలమీద దెబ్బేసినాం. రాజకీయరంగంలో ప్రవేశించాం. ప్రవేశించి సమానాధికారాలకై పురుషులతో ఢీకొనడానికి ప్రారంభించాం. కాకినాడలో కాంగ్రెస్సు నడిచింది. గాంధిమహాత్ముఁడు చెఱలో అప్పు డుండినాఁడు. ఆంధ్రఆఁడమలయాళం అక్కడ చేరింది. మావంటి స్త్రీ పురుషులుకూడా నాలంటీయర గణంలో చేరారు. మా కక్కడ విశృంఖలవృత్తి. చెప్పను ఏముంది? హిందువులకున్నూ మహమ్మదీయులకున్నూ పొందభివృద్ధి చేయడానికై మహమ్మదాలి కాంగ్రెసు కధ్యక్షుఁడు. గాంధిమహాత్మునికి కుడిభుజం. అయితే తురకబీబీ లాడకి ఎవ్వరున్నూ రాలేదు. క్రైస్తవస్త్రీలున్నూ అంతే. ఒకహిందూస్త్రీగణాచారులుమాత్రం ఎగురుచూ దుముకుచూ వుండినాం. మహమ్మదాలి కాకినాడకు వచ్చినాఁడు. రైలుమకాంలో మా ఆఁడమలయాళం కవాతు నేర్పినందువల్ల చాలుగా నిలవబడ్డది. మమ్మల్ని అరగంట కాలం తదేకదృష్టితో చూచాఁడు ఆ మహమ్మదాలి. మేము బెంగై పోయినాం. మేము అతనికి సలాం చేశాం. మాకు అతఁడున్నూ సలాం చేశాడు. అయితే అతనితల్లిమాత్రం అతణ్ణి వెంబడించింది. బురకా వేసుకొంచూ వుండింది. మఱొక్కతురకబీబి రాలేదు. ఆడ వుండేమగవాళ్ళకంతా మీసాల్లేవు లెండి. తురకబీబీలొక్కరైనా లేరు. వాళ్ళకు మానంవుండడమున్నూ, హైందవస్త్రీల కామానం లేదా? ఆ హైందస్త్రీజనంలోను, ఎక్కువమంది బాఁపనక్కలే అయి వుంటిమి. నాకు సంతదుఃఖం కలిగింది బాఁపనదాన్ని అగుటవల్ల. కలిగి ఏంచేయను? గాంధిమహాత్మున్ని మనస్సులో

"మేమున్నూ చెప్తాం. మమ్మల్నే మీరు వరించుకో వలసింది" అని.

భు. శే. 'దానికేమనేది నీబదులు.'

ల. రా. 'ముందే మంచూ చెప్పినానో ఆపాఠాన్నే వాళ్ళకున్నూ రెండుమూఁడుసార్లు వప్పచెప్పినాను.'

భు. శే. 'దానికేమన్నారు వాళ్ళు.'

ల. రా. "'సెలవా' అంచూ పలికిరి. 'సరే' అంచంటిని. వాళ్ళు పోయేవాళ్ళై రేపుమధ్యాహ్నం పైటిపూట నాసమక్షంలో ఈమనగ్రామస్థులతో కాంగ్రెస్సుయొక్క వుద్దేశం చెప్పవలె అని అనుకొన్నాం. దానికి అవకాశం కలిగించమన్నారు. ఆలాగే కానియ్యండంటిని. అంత వాళ్ళు మొగం చిన్నచేసుకొని వెడలి పోయిరి.'

భు. శే. 'మొన్నవుదయాన జాముప్రొద్దెక్కినవెనుక క్రొత్తవ్యక్తులు నీతోమాట్లాడుచుండినలాగా నాకు తెల్సింది. వాళ్ళెవరో?'

ల. రా. 'అంతా ఆవోట్లభిక్షుకే.

భు. శే. 'ఏకక్షివారో?'

ల. రా. 'జస్టిస్ వర్గంవాళ్ళు.'

భు. శే. 'వాళ్ళకేమంటివి?'

ల. రా. 'వాళ్ళున్నూ తమకక్షకనుకూలపడేలాగున దీర్ఘోపన్యాసం చేశారు. ఆవుపన్యాసాంతం కాంగ్రెస్సుకక్షకు చెప్పినప్రత్యుత్తరాన్నే వాళ్ళకిన్నీ చెప్పి పంపినాను'.

## శాసనసభలప్రాముఖ్యము.

భు. శే. 'ఇద్దఱికిన్నీ నీవు చెప్పినబదులు సవ్యమైందే. అయినా వోటనేవస్తువు సామాన్యమైందికాదు.

ల. రా. 'బుద్ధి బుద్ధి.'

భు. శే. అనర్ఘమైంది. అందువల్ల వరులయొక్క వరణీయాలు జరిగేదానికి ముందుగా వరులయోగ్యతనున్నూ, శాసనసభలయొక్క ప్రాముఖ్యమునున్నూ వరించబోయేసకలవ్యక్తులకున్నూ, తెలుసుకోవలె.'

ల. రా. 'అవునవును. అవెట్టివో కాస్త చెప్పండి.'

భు. శే. 'చెప్తా. వినుకో. శాసనసభలవల్ల పాతరాజ్యాలు కూలిపడుతవి. వాటిస్థానంలో క్రొత్తవి మొలస్తవి. మొలకలెత్తి అచిరకాలంలోనే అన్నివైపుల నాగజెముడులాగా అవి అల్లుకొంటవి. అల్లుకొని తమఆధికారాన్ని చిన్నచిన్నరాజ్యాలమీఁద చెలాయించుకొంచూ వుంటవి. ఒక్కరాజును ఏడ్పిస్తవి. వేఱొకణ్ణి నవ్విస్తవి. వాటిని "పెండ్లాడే బీబినాంచారూ పెండ్లాడేబొమ్మా పెండ్లాడే రవికలకొలికా పెండ్లాడేబొమ్మా" అనేలాగా తనచేతిబొమ్మలాగా ఆడిస్తవి. తమకుండేరాజ్యాధికారంవల్ల వ్యాపారాన్ని తన అధీనంచేసుకొంటవి. ముడివస్తువులు చిక్కే రాజ్యాలనన్నింటినీ అన్యరాజ్యాలకు అందనీకుండా చేసుకొంటవి. దానివల్ల తనరాజ్యంలో బహువిధాలైవుండే కర్మాగారాలను పెంపఁజేస్తూ వుంటవి. ప్రపంచంలో యుద్ధాలకు ప్రసక్తి వుండఁగూడదంచూ చాటిస్తవి. అయితే తాముమాత్రం తమదండునంతా వృద్ధిచేసుకొంచూ వుంటవి. వీనికన్నింటికిన్నీ, ఈలాంటివన్నింటికిన్నీ, శాసనసభలు హేతుభూతాలు. ఈవగైరాకారణాలవల్ల శాసనసభలు బహుముఖ్యములు.' అని.

ల. రా. 'శాసనసభలతిముఖ్యములనే విషయం తమ అనుగ్రహంవల్ల తెలుసుకొన్నాను. అయితే హిందూదేశంలో వుండేశాసనసభలకంత అధికారం వుందా? దాన్ని కాస్త అనుగ్రహించండి.'

భు. శే. ఆలాగే చెప్తా. వినుకో. ఇంగ్లండులో ప్రజాప్రతినిధులకు రెండుసభలు కలవు.'

ల. రా. 'అవేవి?'

భు. శే. ఇంగ్లీషుభాషలో పార్లమెంటని అంటారు. అవి రెండు. ఒక్కటి శ్రీమంతులది. రెండవది జనసామాన్యంది. ఈరెండింటిలో జనసామాన్యానికి ప్రతినిధిగా వుండేసభకు వుండే అధికారం మొదటిదానికి లేదు. రెండవది చెప్పినదాన్ని మొదటిది 'సరే' అని తలనాడిస్తుంది. ఈరెంటిలో రెండవదే ముఖ్యం."

ల. రా. 'దానికి వుండే అధికారం ఎటువంటిది?

భు. శే. బ్రిటిషుప్రజాసమూహమే ఈసభాద్వయము. ఈసభాద్వయమే బ్రిటిషుప్రజాసమూహము.'

ల. రా. 'ఏలా?'

భు. శే. "బ్రిటిషుప్రజాసమూహానికి ఈసభాద్వయం ఏలాగైనాసరే, సర్వవిధాల లాభం కలిగించవలసింది. నష్టం కలిగించకూడదు. లాభం కలిగిస్తూ వున్నంతకాలం ఆసభాద్వయానికి చేటు లేదు. నష్టం కలిగించిందో, ఈరెంటికిన్నీ తలనొప్పి. కావున ప్రజాభీష్టప్రకారమే ఈసభాద్వయమున్నూ నడచుకోవలె.'

ల. రా. 'ఏలాగా?'

భు. శే. ఇంగ్లండులో లంకషైరు నేఁతకు హేగొందినదఁట.

ల. రా. 'ఆలాగే అని నేను పూర్వం విని వున్నాను.'

భు. శే. హిందూదేశస్థులకు లాభకరంగానున్నూ, ఆలంకషైరుకు నష్టం కలిగేలాగుననున్నూ, ఆసభాద్వయం

ప్రవర్తించిం దనుకో. వెంట నే ‘లంకషైరు’ అను జిల్లాకు ప్రతినిధులుగా వరించుకోఁబడి సభాద్వయం లో వుండేసభ్యులను, ‘మావ్యాపారానికి నష్టం కలిగించారు. మీ రాసభల్లో వుండడంవల్ల మాకేమిన్నీ లాభంలేదు. మీస్థానాలను వదలుకోనండి. మీ కక్కడ వుండఁ బనిలేదు. లే. లేండి.’ అంటూ లంకషైరుజిల్లాప్రజలు ఆక్షేపిస్తారు. వాళ్ళు అట్టితమ నడవడికను సమర్థించుకొన్నారా ? సరే. లేకపోతే వాళ్ళు తమతమస్థానాలను వదలుకొంటారు. వెంట నే లంకషైరు జనులు తమ కనుకూలంగా నడచుకొనేవాళ్ళను వరించుకొంటారు. ఇది ఇంగ్లండులో ప్రజాప్రభుత్వము నడిచేతీరు.

ల. రా. ‘ఇంగ్లండుప్రభుత్వం ప్రజల దెట్లా ?’

భు. శే. ‘బ్రిట్టిషు అయిల్సుకు రాజున్నాఁడు. ఆయనకు ప్రజాప్రతినిధులుగా వుండే పార్లమెంటుద్వయం లోబడినడచుకోదు. ఆయన ఆసభాద్వయానికి లోబడినడచుకొంటూ వుంటాఁడు.’

ల. రా. ‘అయితే మంత్రాంగ ముండే ?’

భు. శే. ‘మంత్రాంగం ఉంది. అది రాజునకున్నూ, సభాద్వయానికిన్ని మధ్య వుండేమంత్రులకూటము.’

ల. రా. ‘ఆమంత్రాంగముయొక్క ఉత్పత్తిక్రమ మే లాగా ?’

భు. శే. ‘బ్రిట్టిషుఅయిల్సులోఁ బ్రజలు కలరు. ప్రాచీనాచారపరాయణులంటూ కొంద ఱుందురు. వారికి “కంజర్వేటివ్” స్సనిపేరు. ‘లిబరల్స్’ అనేవా రొక కొంద ఱుందురు. కూలివాండ్రగమికిఁ జేరినవా రొక కొంద ఱుందురు. ఇట్లెన్ని తెగలప్రజ లుందు రో, అన్ని తెగలప్రజలకుఁ బ్రతినిధు లాసభాద్వయంలో వుంటారు. ఈతెగలలో నేతెగకు చేరినవారిసంఖ్య అధికంగా వుంటుందో, ఆ తెగకు సంబంధించినవాళ్ళ నుండియే మంత్రివర్గం ఏర్పడుతుంది. ఆప్రకారం ఏర్పడినమంత్రివర్గ మే పెట్టినది భిక్ష. దాని కే సర్వాధికారం వుంటుంది. రాజైనయతఁడు ఆమంత్రాంగంయొక్కచర్యను గమనిస్తూ వుండేకూటస్థబ్రహ్మం. ఇది బ్రిట్టిష్అయిల్సుయొక్కరాజ్యాంగం పద్ధతి.’

ల. రా. ఆమంత్రివర్గమునకున్నూ హిందూదేశానికిన్నీ సంబంధ మేంది ?’

భు. శే. ‘హిందూదేశాన్ని పాలించేదికూడా ఆమంత్రివర్గ మే.’

ల. రా. ‘ఏలాగా?’

భు. శే. ‘హిందూదేశముయొక్కప్రధానప్రభుత్వ మనే దాన్ని విని వున్నావా ?’

ల. రా. విని వున్నాను. దానికి మనవైస్రాయిప్రధాన ప్రభువు. అతనికిన్నీ మంత్రాంగ మున్నది. మంత్రాంగంతోఁ జేరి అతఁ డీదేశమును పాలిస్తాఁ డని విని వున్నాను.’

భు. శే. అతనిదొరతనముమీఁద కట్టుపారుపత్తెం చేసే అధికారవర్గం ఇంగ్లండులో వుంది. దానికే, ఇండియాకౌన్సిల్’ అని పేరు. దానికిఁ ‘కార్యదర్శి’ అను నొకఁ డుండును. అతఁడు బ్రిట్టిషుదొరతనముయొక్క మంత్రికూటంలో వొక్కఁడై వుంటున్నాఁడు. అతని కే, ‘సెక్రిటరీ ఆఫ్ స్టేటు ఫార్ ఇండియా’ అని ఇంగ్లీషులో పేరు. హిందూదేశంప్రధానప్రభుత్వము చేయుచూ వుండేలోపాలోపాలకు ఆహిందూదేశప్రధానకార్యదర్శి బ్రిట్టిష్మంత్రివర్గమునకు ఉత్తరవాది. అతఁడున్నూ ఆబ్రిట్టిషుమంత్రివర్గంలో వొక్కఁడై వుండడంవల్ల ఆబ్రిట్టిషుమంత్రివర్గ మే తనలో వొకఁడుగా వుండేహిందూదేశప్రధానకార్యదర్శిమూలాన హిందూదేశాన్ని పాలిస్తూ వుంది.’

ల. రా. ‘బ్రిట్టిషుప్రజ లేలాగా హిందూదేశాన్ని పాలిస్తారు ?’

భు. శే. ‘బ్రిట్టిషుప్రభుత్వ మే మంత్రివర్గము ; ఆమంత్రివర్గ మే బ్రిట్టిషుప్రభుత్వము.’ అనేవిషయం బోధపడ్డదా ?’

ల. రా. ‘బోధపడ్డది. ఆవెనుక ?’

భు. శే. ‘ఆమంత్రివర్గ మెక్కడ నుండి ఏర్పడెనో అది తెలుసునా ?’

ల. రా. ‘తెలుసును. పార్లమెంటుద్వయంలో బహుళసంఖ్యకలప్రజాప్రతినిధులసమూహమునుండి’ అని.

భు. శే. ‘బ్రిట్టిషుదొరతనము చేయు చుండులోపాలోపాలన్నింటికిన్నీ ఆమంత్రివర్గ మెవరికి ఉత్తరవాదియై వుంటుం దో తెలుసునా ?’

ల. రా. తెలుసును. బ్రిట్టిషుప్రజాసమూహముయొక్క ప్రతినిధులకు స్థాన మై వుండే పార్లమెంటుద్వయానికి ఆమంత్రివర్గము ఉత్తరవాదిగా వుంటుంది.’

భు. శే. ‘పార్లమెంటుద్వయ మెవరికి పూఁటపడి వుంటుంది ?’

ల. రా. ‘బ్రిట్టిషుఅయిల్సులో వుండేసకలప్రజలకున్నూ, ఆపార్లమెంటుద్వయం పూఁటబడి వుంటూ వుంది?’

భు. శే. ‘బ్రిట్టిషుప్రజాప్రభుత్వ మెట్టి దైందిన్నీ బోధపడ్డదా ?’

ల. రా. ‘బుద్ది బుద్ది, బోధపడ్డది.’

భు. శే. 'నాచెప్పినందువల్ల నీవు గ్రహించినసారాంశ మేంది?'

ల. రా. 'బ్రిట్టిషుఅయిల్సనేదీవిగడ్డలను పాలించేరాజొకఁడు కలఁడు. అతఁడు కూటస్థబ్రహ్మంలాగ వుంటాఁడు. బ్రిట్టిష్అయిల్సునందుండే ప్రజాసమూహానికిఁ బ్రతినిధి పార్లమెంటుద్వయం. అద్వయాన్ని వుండియే ఏఱుకోబడ్డది మంత్రాంగం. ఆమంత్రాంగమే బ్రిట్టిషుగవర్నమెంటు. ఆబ్రిట్టిషుగవర్నమేంటే ఆబ్రిట్టిషుమంత్రాంగము. ఆమంత్రాంగముతోడిసంబంధము తన కుండేలాగునను, లేని యట్లుగానూ, రాజున్నూ, మాయతోడిసంబంధము లేకపోయినను సంబంధము ఉండినట్లే సర్వప్రపంచమునకుఁ దోఁపఁజేయుచూ వుండే కూటస్థబ్రహ్మంలాగ, బ్రిట్టిషు ప్రభుత్వాన్నితానే నడపులాగా బ్రిట్టిష్ ప్రభుత్వం తానుగానున్నూ తానే ఆబ్రిటిషు ప్రభుత్వముగానున్నూ, వెలుఁగుచు నున్నాఁడు. ఇదే దేవరవారివల్ల నేను గ్రహించిన బ్రిటిష్ప్రభుత్వాంగముయొక్క సారం. అయితే హిందూదేశప్రభుత్వానికిన్నీ, పార్లమెంటు ద్వయానికిన్నీ, వుండేసంబంధ మెటువంటిది?'

భు. శే. 'అదిన్నీకాక వేఱొక్కవిషయం నీకు తెల్పుకోవలసింది వుంది. వినుకో.'

ల. రా. 'బుద్ధి బుద్ధి. వింటా దయచేసి అనుగ్రహించండి.'

శాసనసభలు నేటిబీఅకాయులు,

భు. శే. పార్లమెంటుద్వయం ప్రజాభిప్రాయప్రకారం ఎప్పుడు నడవలేదో అప్పుడే అది పనిచేయక నిలుస్తుంది. ప్రజాభిప్రాయప్రకారం నడిచేపార్లమెంటుద్వయం వెంటనే యేర్పడుతుంది. అట్టిఅనుకూలం హిందూదేశంలో వుండేశాసనసభలకు లేదు.'

ల. రా. 'ఎందువల్ల?'

భు. శే. హిందూదేశానికిఁ బ్రధానప్రభుత్వం చేస్తూ వుండేలోపాలోపాలకు బ్రిట్టిష్అయిల్సులో బ్రిట్టిష్మంత్రివర్గానికి ఆవర్గంలో వొక్కఁడుగా వుండేహిందూదేశప్రధానకార్యదర్శి పూఁటబడి వుంటాఁడనే విషయం ముందే పేర్కొని వున్నాను. అవునా? కాదా?'

ల. రా. 'అవునవును. పేర్కొనియే వున్నారు. ఆవిషయం గ్రహించి వున్నాను.'

భు. శే. 'అయితే హిందూదేశప్రధానప్రభుత్వం తాను చేస్తూవుండేలోపాలోపాలకు ఆహిందూదేశప్రధానకార్యదర్శికిన్నీ ఆతనికి మంత్రాలోచనం చెప్పే ఇండియాకౌన్సిలుకున్నూ వూచిపడి వుంటుంది.'

ల. రా. 'తెలిసింది. అయితే హిందూదేశప్రధానప్రభుత్వమంటే ఏంది?'

భు. శే. 'హిందూదేశాన్ని పాలించడానికి బ్రిట్టిషు అయిల్సునుండి అయిదేండ్లకొక్కతడవ పంపఁబడుచూ వుండే వైస్రాయిన్నీ, అతనికి మంత్రాలోచనం చెప్పేమంత్రాంగమున్నూ' చేరినపాలకవర్గమునకు ప్రధానదొరతనం అని పేరు. ఆపాలకవర్గమునకు వైస్రాయి అధ్యక్షుఁడు. అతఁడు ఉపాలకవర్గంలో తానున్నూ వొకడగుచూ హిందూదేశాన్ని పాలిస్తూ వుంటాఁడు.

ల. రా. 'అయితే బ్రిట్టిష్అయిల్సుకు రాజున్నాఁడు కాఁడా? అతనికిన్నీ, పాలకవర్గముతోఁ గూడిన వైస్రాయికిన్నీ సంబంధ మేంది?'

భు. శే. బ్రిట్టిషుఅయిల్సురాజు హిందూదేశానికిన్నీ ప్రభువే. దానికి సందియం లేదు. అతనికి నెలజీతా లేవిన్నీ లేవు. అతనికి సర్వాధికారం వున్నదని అంటారు. అయితే వైస్రాయి అట్టివాఁడు కాఁడు. వైస్రాయికి నెలజీతం కద్దు. ఆజీతాన్ని హిందూదేశస్థులే ఇస్తారు. కాని బ్రిట్టిష్ప్రజలుకానీ, వారికి ప్రతినిధిస్థానంలో వుండేపార్లమెంటు ద్వయంకానీ, ఆపార్లమెంటుద్వయంనుంచి ఏఱుకోబడ్డబ్రిట్టిషు మంత్రాంగంగానీ, బ్రిట్టిషుదొరతనంయొక్కధనాగారమునుండి (అనఁగా బ్రిటిషుప్రజలు తమదొరతనానికి చెల్లించేశిస్తునుండి) ఎత్తి హిందూదేశాన్ని పాలించేవైస్రాయికి నెలజీతం ఇచ్చేది లేదు.

ల. రా. 'అయితే ఎవరికొవైస్రాయి వుత్తరవాది?'

భు. శే. 'వైస్రాయికి నెలనెలజీతం ఇస్తూ వుండేహిందూదేశస్థులకొతఁడు తాఁ జేస్తూ వుండేదొరతనంలోనిలోపాలోపాలకు పూఁటఁపడి వుండడం లేదు. కాని బ్రిటిష్ప్రభుత్వంలో వొక్కఁడై వుండే హిందూదేశప్రధానకార్యదర్శికి అతఁడు పూఁటబడి వుంటున్నాఁడు.'

ల. రా. 'అయితే శాసనసభలకున్నూ, వైస్రాయికిన్నీ సంబంధం ఎటువంటిది?'

భు. శే. 'బ్రిట్టిష్అయిల్సు నేలురాజునకున్నూ పార్లమెంటుద్వయానికిన్నీ వుండేసంబంధంవంటిసంబంధమే కొంచెం హెచ్చుతక్కువగా హిందూదేశంలో వుండేశాసనసభలకున్నూ, వైస్రాయికిన్నీ, వుండే సంబంధం అయి వుంటుంది కాని పార్లమెంటు ద్వయానికిన్నీ, హిందూదేశంలో వుండే శాసనసభలకున్నూ, చాలవార వుంటూ వుంది.'

ల. రా. 'ఆ దేటువంటిది?'

భు. శే. 'పార్లమెంటుద్వయం సర్వతంత్రస్వతంత్ర మైంది. శాసనసభ లట్టివి కావు. అవి పరాధీనములు.'

ల. రా. 'ఏలా?'

భు. శే. పార్లమెంటుద్వయాన్ని ఆడించేవాఁ డెవ్వఁడున్నూ, పరదేశస్థుఁడు కాఁడు. అది స్వతంత్రంగానే ఆడుతూవుంఛుంది. దానివల్ల ఆ పార్లమెంటుద్వయాలు స్వయంభువులు.

ల. రా. 'అయితే శాసనసభ లేలా ఆడతవి?'

భు. శే. శాసనసభలు పరాధీనము లైనవి. స్వతంత్రము లైనవి కావు. పార్లమెంటుద్వయం వాటిని నిర్మించింది. దానివల్లనే తెరమఱుఁగున నే వుండి ఆ పార్లమెంటుద్వయం వాటిని ఆడిస్తూ వుంటవి. అవిన్నీ కొయ్యబొమ్మలలాగా సాదుచూఆడుచూ, 'తై తై తక్కతై ధింధిం తక్కతోం' అంచూ శివనారాయణతీర్థులచేతి శ్రీ ముద్దులబాలకృష్ణపరబ్రహ్మం నృత్యం చేసినప్రకారం, చిందులు తొక్కుచూ వుంటవి. రెడ్డమ్మలవంటివాళ్ళున్నూ, తాయారమ్మలవంటివాళ్ళున్నూ, ఆచంటమ్మవంటివాళ్ళున్నూ, అయి వుండే ఆడమలయాళం ఏం చెప్తావు వోయి! నాకేసిగ్గేస్తుంది గుడిసెలమీఁద దెబ్బవేసి, శాసనసభల్లో ప్రవేశిస్తారనుకో. అప్పుడు

పల్లి. చల్లనాయనా మనసు? చల్లనాయనా మనసు?

అను.ప. చల్లనాయప్రాణేశ సామిముద్దుగోపాల చల్ల

చర. నిద్దంపుఁ జెక్కిలి నొక్కి
ము ద్దిడుకొన్న దెవతోయి? చల్ల

అంచూ కిస్మస్ పండుగదినాల్లో కాంగ్రెస్సునాయకుల కప్పడుండే చలి పటాపంచ లయ్యేలాగా కాంగ్రెస్సుహౌసులో 'ఇండియన్ డాన్స్' ఏఁటా ఏఁటా చేస్తూ వుండే ప్రకారం ఆ చట్టకూటాలు ఇంగ్లీష్ నృత్యం చేస్తూ వుంటవి. ఓయి రామచంద్రా! మీ కాఁపు కుటుంబాల్లోనున్నూ, కమ్మసంసారాల్లోనున్నూ, వెలమసంసారాల్లోనున్నూ స్త్రీలకు ఘోషా వుండిందంట! ఆ దెప్పుడో! వోబుకాలాన. ఇప్పుడు పురుషులతోబాటు స్త్రీలకున్నూ సమానం అయి వుండే హక్కు అన్నిట్లో వుండవలసిం దనేభావోదయం ఎప్పుడైందో ఆఘోషా అంతా అప్పుడే జర్మనీకి వెళ్ళిందంట! అక్కడ హిట్లర్ జర్మని స్త్రీలకు ఘోషా వేశాఁడంట!''

ల. రా. 'ప్రస్తుతాంశం చెప్పండి. శాఖాచంక్రమణం చేయబాకండి. ఆవెనుక?'

భు. శే. 'స్వరాజ్యం సంపాద్యం నెపం బెట్టి గాంధీన్నీ, ఆతణ్ణి చూచి తక్కుంగలపార్టీలున్నూ, గుట్టుగా కాఁపురం చేస్తూ వుండే స్త్రీలను గణాచార్లనుగా చేసి రాజకీయరంగంలో దింపి వాళ్ళచే అయిరోపా డాన్స్ చేయిస్తూ, తాము తాళాలు వేస్తూ, వుండే విధం చూస్తే, నా కాలాగా చెప్పడం ధర్మం అని తోస్తుందోయి.'

ల. రా. 'కలిముదిరింది. ముగురుతూ వుంది. కల్లున్నూ, డబ్బున్నూ, స్త్రీలున్నూ, కలిపురుషునికి వునికిపట్లంటూ మన్వాదిస్మృతికర్తలు చెప్పినలాగా, నాకు దేవరవా రనుగ్రహించి వున్నారు. ఆప్రకారం కాంగ్రెస్సులో పూర్తిగా నీవుండున్నూ నిండుకొంచూ వుంటున్నవి. ఆడ కలిపురుషుండు గాంధిమహాత్మునియావేశ తాండవం ఆడుచూ వుంటున్నాఁడు. ఆలాగే తక్కిన రాజకీయకక్షులుకూడా. కానీయండి, మీసదుపదేశం 'హిందూదేశస్థు లాడిస్తే ఆశాసనసభ లాడలేవా?'

భు. శే. 'ఆడలేవు.'

ల. రా. 'ఎందు కని?'

భు. శే. 'వాటిని ఆడించేదానికి హిందూదేశస్థుల కధికారం లేదు. హిందూదేశాన్ని పాలించడానికి వచ్చి వుండే వైస్రాయివగైరాలఅధికారవర్గమే పార్లమెంటుద్వయం నేర్పి వుండే ప్రకారం వాట్ని ఆడిస్తూ వుంటవి.''

ల. రా. 'శాసనసభల నాడించేదానికి హిందూదేశస్థుల కధికారం లేదంటిరి. అ దేల?

భు. శే. 'హిందూదేశాన్ని పాలించేవాళ్లు హిందూదేశస్థులు కారు. దానివల్ల స్వయంభువు లైవుండే పార్లమెంటుద్వయంలాగా శాసనసభ లస్వతంత్రాలగుటవల్ల స్వయంభువులు కావు. వాట్ని పాలించే ప్రభుత్వం పరాయిదేశంది.'

ల. రా. 'స్వతంత్రం లేని యీశాసనసభల్లో ప్రవేశించి లాభ మేమి?'

భు. శే. శాసనసభలు వట్టి నేతిబీరకాయ లే! అయినా బ్రిటిషుప్రభుత్వం సకలవిధము లైనశాసనాలున్నూ వాని మూలాన నే, వేసుతారు. ఆలా వేసేశాసనాలు మనకు ప్రతికూలం లేకుండేలాగా వాట్ని వేసేటట్లు చేసుకోడానికై శాసనసభల్లో ప్రజాప్రతినిధులు కొంద ఉండడం మంచి దంచూ తలంచి కాఁబోలు పార్లమెంటుద్వయం క్రొత్తరాజ్యాంగ

చట్టం చేసింది. ఆచట్టప్రకారం ప్రజాప్రతినిధులను ప్రజలకే వరించుకోవలసి వుంటుంది.''

## వరులయోగ్యత.

ల. రా. వా ళ్ళెట్టివాళ్ళుగా వుండవలె ?'

భు. శే. 'ప్రజాప్రభుత్వమునకు విధులు కలవు. శాసనసభలలో ప్రవేశించడానికి యత్నించుచూ వుండే వరుల కంతా ఆవిధులు తెలిసి వుండవలె.

ల. రా. 'తెలిసి వుండవలె' అనేది విధియా ?'

భు. శే. 'విధియే. ఆవిధులప్రకారం ఆ సభల్లో వరింపఁబడినప్రజాప్రతినిధులకు నడచుకోవలె.'

ల. రా. 'ఇంకా వాళ్ళకు తెలిసికోవలసిన విషయా లేవి?

భు. శే. '' 'వాళ్ళ కది తెల్సును; ఇది తెలియదు' అనే అభిప్రాయం వాళ్ళు ప్రజాసమూహానికి కలిగించఁగూడదు.''

ల. రా. 'అంటే? ఆవరుల సమూహాలు సర్వజ్ఞు లనే భావం వాళ్ళను వరించేజనబృందానికి తెలిపించి వుండవలె.'

భు. శే. 'అవు నవును. అదే అదే సుమీ.'

ల. రా. 'అయితే సర్వజ్ఞులా ఆవరప్రకరాలు ?'

భు. శే. 'సర్వం వాళ్ళకు తెలిసి వుండనీ వుండకపోనీ, వాళ్ళకు సర్వవిషయాలున్నూ తెలిసి వుండవలయు ననేది విధి.'

ల. రా. 'సర్వవిషయా లంటే ?'

భు. శే. 'సమస్తదేశార్థికచరిత్రాలు వాళ్ళకు తెలిసి వుండవలె. ఇది సామాన్యవిధి. హిందూదేశార్థికచరిత్రం తెలిసి వుండవలె ననేది ముఖ్యం. తామేరాజ్యభాగానికి ప్రతినిధులై వరింపఁబడి వుంటారో ఆ రాజ్యభాగంయొక్క ఆర్థికస్థితిన్నీ, ఆర్థికచరిత్రమున్నూ, వాళ్ళకు తెలిసి వుండవలె ననడం ముఖ్యతరం. అదిన్నీగాక కుంభినీ బాహుటా, పలాశియుద్ధం అయింది మొదలుకొని సిపాయీలకలహం ముగిసే వఱకు జరిగించి వుండే ఆర్థికచరిత్ర మున్నూ, ఇంగ్లండు నేలురాజు హిందూదేశము పాలించడానికి ప్రారంభించింది మొదలు నేఁటిదాక జరిగి వుండే ఆర్థికవ్యవహార మంతానున్నూ, క్షుణ్ణంగా ఒక్కొక్క సభ్యునకూ తెలిసి వుండడం అన్నింటికంటె ముఖ్యతమం. ఇది తెలియనివాణ్ణి సభ్యునిగా వరించుకోవడం అవివేకం.

ల. రా. 'పరదేశార్థికచరిత్రం హిందూదేశార్థికస్థితికి వుపయోగపడుతుందా ?'

భు. శే. హిందూదేశం అన్యదేశస్థులదొరతనానికి లోబడి వుంది. ఆ అన్యదేశపండితులు తమదేశానికి హిందూదేశం అనుకూలపడేలాగా ఆర్థికచరిత్రాలు వ్రాసి వుంటారు. ఈకీ లెఱిఁగి ప్రతిశాసనసభ్యుఁడున్నూ, (అనఁగా ప్రజాప్రతినిధియై వుండే ప్రతిసభ్యుఁడున్నూ) అన్యదేశపండితులు వ్రాసి వుండేఆర్థికచరిత్రగ్రంథాలందు చెప్పఁబడివుండేవిధులు హిందూదేశార్థికస్థితులకు తగి వున్నవా? లేదా? అనే విషయం గ్రహించి దానికిఁ దగినవిధాన అందలి విధు లుపయోగించుకోవలె. దేశస్థితి కనుకూలపడని వాట్ని త్యజించవలె.

శాసనసభలలో దొరతనముది ప్రథమకక్ష.

ప్రజాప్రతినిధులందఱిది రెండవకక్ష.

ల. రా. 'కాంగ్రెస్సుకక్ష అయినా సరే; జస్టిస్‌వర్గం అయినా సరే; ప్రజాకక్ష అయినా సరే; ఈమూఁటితో చేరక వుండే మఱిన్ని ఏవ్యక్తి అయినా సరే; ఖండాంతరాల్లో వుండేరాజకీయసంస్థలే వాళ్ళకంతా మేలు బంతులుగానున్నూ, ప్రమాణాలుగానున్నూ వుంటున్నవఁట? అ దేలాగా?'

భు. శే. 'ఇంగ్లండులో వుండేపార్లమెంటుద్వయమున్నూ స్వతంత్రసంస్థ. పరతంత్రం కాదు, హిందూదేశంలో వుండే శాసనసభలలాగ. దానివల్ల పార్లమెంటుద్వయాన్ని నడిపేపద్ధతులు హిందూదేశశాసనసభలను నడపడానికి చెల్లవు.'

ల. రా. 'ఏలా చెల్లవు ?'

భు. శే. ఏలా చెల్లవో, చెప్తా వినుకో. చెన్నపురి రాజ్యభాగంలో వుండేయిప్పటిశాసనసభ దాదాపు ఎన్మిదేండ్లనుండి జీవంతో వుంది. మాంట్యాగు చెమ్సుఫోర్డు లనుగ్రహించి వుండేరాజ్యాంగప్రకారం దానికి జీవం పోయి వుండవలసిందే. అయితే దానిజీవం పోక అట్టే యీడ్చుకొంటూ వుండింది.'

ల. రా. 'ఎందు కని ?'

భు. శే. ''ఆరాజ్యాంగప్రకారం దానికి ప్రాణంతో వుండడానికి ఆధారం ఏమిన్నీ లేదు. మూఁడేండ్ల కొక్కతడవ ఎన్నికలు సాగుచూ వుండినపక్షంలో, ఈ శాసనసభ మాఱి మాఱి వుండి వుండును. అయితే గవర్నరుకు వుండే నిరంకుశాధికారం బురస్కరించుకొని అది ప్రాణంతో నిలవఁబడి ఉంది. లేకున్నచో తాలూకాబోర్డులు పోయి వుండవు. జిల్లాబోర్డులు రెండు రెండుగా చీలి వుండవు. ఇనాం

ఆక్టు అంకురించి వుండదు. తిరుపతిదేవస్థానం చట్టం మొలకెత్తినీన్ని వుండబోదు.''

ల. రా. ఇట్టిస్థితి బ్రిట్టిషుఅయిల్సులో వుండివుండిందంటే?

భు. శే. అక్కడ వుండునా? వుండదు. అది సొంత మేనమామ. మనది అత్తకు మీసాలు పెట్టి 'మేనమామ' అని పిలుచుకొనునట్టిది.

భు. శే. 'హిందూదేశశాసనసభలంతా స్వతంత్రసంస్థలు కావు. పార్లమెంటుద్వయంయొక్క చేతిబొంగరాలు. ఆపార్లమెంట్లు వేఱు; హిందూదేశశాసనసభలు వేఱు.'

ల. రా. 'ఏలాగా వేఱు?'

భు. శే. జనులకు లాభకరంగా వుండేవిషయాలు దొరతనానికి నష్టం కలిగిస్తూ వుంటవి. అట్టిపట్టులలో శాసనసభల్లో ప్రజాప్రతినిధులుగా వుండేసభ్యులందఱికిష్టమున్నా, లేకపోయినా, దొరతనంవాళ్ళు ఆ విషయాలన్నింటినీకానీ, వాటిలో కొంతగానీ, వొప్పుకోరు. కాఁబట్టి హిందూదేశస్థులస్వతంత్రులనే విషయాన్నే తమతమదృష్టిపథంలో వుంచుకొంచూ, సాధ్యమైనంతవఱకున్నూ దొరతనం చిత్తవృత్తిని జనుల కనుకూలపడేలాగా త్రిప్పుకోడం నీతిపథం. కాని దొరతనం'ఎడ్డెం' అంటే ప్రజాప్రతినిధులు 'తెడ్డెం' అనడం కాపథం. మఱీన్నీ అవివేకం. జనులకు దొరతనంవల్ల కాబోయేలాభంకూడా కలుగక పోతుంది.'

ల. రా. 'ఎందువల్ల?'

భు. శే. 'సామదానభేదదండాలనే నాలుగుపాయాల్లో మూఁడవదాన్నే ఆదినుండి నేఁటిదాక వుపయోగిస్తూ బ్రిట్టిషుప్రభుత్వం హిందూదేశంమీఁద కత్తి పారుపత్తెం చేస్తూ వుందంట!'

ల. రా. 'వాస్తవానికి దూరంగాదు మీరు చెప్పింది. కావున?'

భు. శే. 'ఆమర్మం తెలుసుకొని దొరతనం జనుల కుపయోగపడేలాగున వర్తించేటట్లు ప్రజాప్రతినిధులకు నడుచుకోవలెసుడీ.'

ల. రా. పరతంత్రమై వుండే హిందూదేశానికి వర్తించుకోవలసిన పథం ఇదే అనేది మీ భావమా?'

భు. శే. అవు నవును.

ల. రా. 'ఏల?'

భు. శే. ఏలుబడి కెదు రాడేపద్ధతివల్ల జనులకు క్షేమం కలుగదు. తప్పక అనర్థం కలుగుతుంది. ఏలుబడి చిత్తవృత్తి ఎఱిఁగి వర్తించడం లగ్గు. ''ఇది, పార్లమెంటు పద్ధతి. అది, కాదు.'' అంచూ ప్రజాప్రతినిధులకు ప్రతిపక్షులైనవాళ్ళకక్షను ఎదిరించడం అవివేకం.

ల. రా. 'ఏయేవిషయాల్లో దొరతనానికి ఎదు రొడ్డడం మేలవుతుంది?'

భు. శే. 'దానికొ క్గాను దృష్టాంతం చెప్తా. వినుకో. 'మింటో ప్రభువు హిందూదేశాన్ని పాలించేకాలంలో 'ప్రస్సుఆక్టు' చేయఁబడ్డది.'

ల. రా. 'అట్లని విని వున్నాను.'

భు. శే. మింటోప్రభువుకాలంలో వుండినశాసనసభల్లో సభ్యులుగా వుండేవాళ్ళు సర్వజ్ఞు లనియే చెప్పవచ్చును.'

ల. రా. 'వాళ్ళెవరు?'

భు. శే. 'ధీమంతుఁడైనగోకులగోపాలకృష్ణుఁడున్నూ.'

ల. రా. 'అంటే?'

భు. శే. 'గోఖ్లే' అని లోకులు సామాన్యంగా ఆదొడ్డ వ్యక్తిని అంటారు?

ల. రా. 'ఆమహనీయుఁడా? ఆవెనుక?'

భు. శే. సివిల్‌మారేజిచిత్తుచట్టం శాసింప తెచ్చిన వాసుదేవుఁడు. పురుషోత్తముఁడై సజీవుఁడై వుండే పండిట్ మదనమోహనమాళవ్యా, మున్నగువారు. 'ప్రస్ఆక్టు'ను శాసనంగా చేయవలసిం దనేది దొరతనంవారి దృఢాభిప్రాయం.'

ల. రా. 'శాసనసభ వొప్పుకోక పోతే?'

భు. శే. 'శాసనసభ వొప్పుకోనీ, వొప్పుకోకపోనీ.'

ల. రా. 'అప్పటికి బ్రిటిష్‌ప్రభుత్వం నిరంకుశం అయిందే!'

భు. శే. 'నిరంకుశం అయిం దనుకో కా దని అనుకో. ఆలా తలస్తూ వుంటే లాభం ఏ ముంది? కార్యభాగాన్నే, మన కాలోచింపవలసివుండేవిషయం. ఔనా కాదా?'

ల. రా. 'అవు నవును. ఆవెనుక.'

భు. శే. 'మింటోప్రభువు ప్రెస్సాక్టును ఒకచేతిలోఁ బెట్టుకొన్నాఁడు. వేఱొకచేతిలో 'అశ్వినీకుమారదత్తుని విడిచిపెట్టాము, మీరీప్రెస్సాక్టును ఒప్పుకొన్నారంటే, అనేత్రాఁత కల తనవుత్తరువున్నూ పట్టుకొన్నాఁడు.

ల. రా. 'పెట్టుకొంచూ యేం చేశాఁడు?'

భు. శే. 'చేసిం దే ముంది? శాసనసభ్యులతో ఇట్లన్నాఁడామింటోప్రభువు:—

'సభ్యులారా! ఈప్రెస్సాక్టును మీ రంగీకరిస్తే, కారాగృహంలో వుండేఅశ్వని కుమారదత్తును విడి

చెదము; అంగీకరించక పోతే అతణ్ణి విడిచి పెట్టము.'
(అనఁగా విని సివిల్ మారేజిచిత్తుచట్టం తెచ్చి వుండిన వాసుదేవుఁడున్నూ, పండిట్ మదనమోహనమాళవ్యా గారున్నూ, మింటోప్రభువుతో ఇట్లన్నారఁట:—)
'ఓ ప్రభువా! మా కా ప్రెస్నాక్టు వద్దు. అది మానవునిక వ్యక్తిగత మై వుండే స్వతంత్రానికి విషం. ఏలినవారు అశ్వనికుమారదత్తుని విడిచి పెట్టండీ; విడిచి పెట్టక వుండండీ. దానితో మాకు పనిలేదు. అశ్వనికుమారదత్తుని చెఱలో పెట్టడాని కని వుండేశిక్షాస్మృతిలోనివిధిప్రకారం అతనికి చెఱలో వుండడానికి కాలపరిమితి ఆఱునెల లే. ఆ ఆఱునెలల్లో నాల్గునెలలకాలం దాఁటింది. ఇంక రెండునెల లుంటవి అతణ్ణి విడుదల చేయుడానికి కాలం. నాల్గునెలలు చెఱలో వుండినమహనీయుఁడు రెండునెలలలోపల స్వేచ్ఛ కోరఁడు. ఆరెండు నెలలకాలం అతఁడు చెఱయం దే వుండడాని కిష్టపడుతాఁడు. హాలాహల మనందగిన ఈ ప్రెస్నాక్టు చట్టం అయ్యేదానికైనాను అశ్వనికుమారదత్తుఁడు స్వేచ్ఛ కోరఁడు. కాని మఱిన్ని వేఱొక్కఁడు కోరు నేమో. మేము ప్రభువుచిత్తానికి విరుద్ధంగా వర్తించడానికి దుఃఖిస్తున్నాం. అయితే ఏం చేయను? బంగారు కత్తి అని అంటూ దానితో గొంతు కోసుకోవడం సాధ్య మా? ప్రెస్నాక్టు వద్దు. అశ్వనికుమారదత్తునిస్వేచ్ఛకూడా మాకు వద్దు వద్దు వద్దు వద్దు." అన విని గోఖ్లే ఇట్లన్నాఁడఁట:—
"ఓప్రభూ! ప్రెస్నాక్టు చట్టంగా అయ్యేదానికి నేను అంగీకరిస్తూ వున్నాను, అశ్వనికుమారదత్తుని వెంట నే ఏలినవారు వదలివేసినా రంటే.'

అంత ప్రెస్నాక్టు చట్ట మైంది. హార్డింజుప్రభువు కాలంలో శ్రీపంచమజార్జిసార్వభౌమునకు ఢిల్లీలో పట్టాభిషేకోత్సవసందర్భాన్ని పురస్కరించుకొని విష మే అయి వుండేప్రెస్నాక్టునందలివిషము కొంతభాగం శుద్ధిచేయఁబడ్డది. శుద్ధి కాని భాగం అలాగే వుంది. అందువల్ల అది ఇంకా జనులకు పీడాకరంగా నే వుంది. అది అట్లుండ నిండు.

జనులకు బాధాకరములై వుండఁబోయేచట్టాలు దొరతనం చేనఁ బూనుతుంది. జనులయభిప్రాయప్రకారం ఆచట్టం వాళ్ళకు పీడాకర మే అవుతుంది. అయితే దొరతనంవారిహృదయంలో జనుల కాచట్టంవల్ల సేమ మే కలుగుతుం దనేభావం వుండవచ్చును. జనులఅభిప్రాయం అలా వుండదు. అట్టిపట్టులలో జనాభిప్రాయప్రకార మే సభ్యులకు వర్తించుకోవలె. ఇది వాళ్ళకు విధి.

కాఁబట్టి ఇట్టిసమయాల్లో జనాభిప్రాయప్రకారం నడవ నియ్యకొనేవాళ్ళ నే, మనకు వరించుకోవలె. పండితమదనమోహనమాళవ్యాగారున్నూ, వాసుదేవుఁడున్నూ, ప్రెస్నాక్టు చట్టంగా అయ్యేతరుణంలో ఏలా ప్రవర్తించారో అలాప్రవర్తించే ధీరులై వుండవలె, మనం వరించుకొనఁబోయ్యేసభ్యులు. అటువంటిసమయాల్లో దొరతనం బహువిధాల సభ్యులవీఁపు తట్టుతుంది. లాలన చేస్తుంది. చక్కిలిగిలి పెట్టి నవ్విస్తుంది. బుజ్జగిస్తుంది. బిరుదము లిస్తాం అంటూ ప్రేశ్య ముడిచి పూరిస్తుంది. సభ్యుల్లో వీటికన్నింటికిన్ని వంగనివాళ్ళపుత్రులకో అల్లుళ్ళకో మనుమలకో వుద్యోగా లిప్పిస్తా మంటుంది. కడపటదేనికిన్ని వంగనివాళ్ళు వుద్యోగా లనేముచ్చుపొడివల్ల మైమఱచిపోతారు. ప్రజలతో చెప్పినపలుకులు వాళ్ళస్మృతిపథంలో వుండవు. అట్టివాళ్ళు ఇప్పుడు బ్రతికి వున్నారు. దానివల్ల కలిగేదుష్ఫలం చచ్చేరోగరూపాననో, నోరు పడిపోయేకంఠవ్యాధిరూపాననో వాళ్ళను చెందుతూ వుంటుంది. తప్పించుకోడానికి సాధ్యంకాదు. బాలికావివాహనిషేధశాసనం ప్రజాభిప్రాయానికి విరుద్ధంగా ప్రవర్తించి కాపాడినకాంగ్రెస్సుస్వరాజ్యకక్షువాళ్లున్నూ, దానికిఁ గర్త అయి వుండేగౌడవాఁడున్నూ, ఈడ కాకపోయినా, యమలోకంలో అయినా, తప్పక నరకం అనుభవిస్తా రనడం సిద్ధాంతం.,

ల. రా. 'పార్లమెంటులలో రెండుమూఁడుకక్షులు వుంటవఁటే.'

భు. శే. 'వుంటవి. వాస్తవం. ఆకక్షులలో బహుజనాభిప్రాయప్రకారం రాజు నడుచుకొంటాఁడు. దొరతనం నడుచుకొంటుంది.'

ల. రా. 'ఆప్రకారం బహుజనాభిప్రాయప్రకార మే అక్కడ వుండేప్రభుత్వమున్నూ, రాజున్నూ, నడుచుకోవలె ననేది విధియా?'

భు. శే. 'విధి' అనేపదానికంటే మిక్కిలియుక్తమైంది 'ఆజ్ఞ' అని అనుకో.

ల. రా. 'ప్రజలయాజ్ఞాప్రకారంగా నే దొరతనమున్నూ నడుస్తూ వుందా? రాజున్నూ నడుచుకొంటూ వుంటున్నాఁడా?'

భు. శే. 'దానికి సందేహ మా? పార్లమెంటుద్వయము స్వతంత్ర మైంది. అందనేకకక్షు లుండడం వుచిత మే అవుతుంది. అయితే అస్వతంత్రాలై వుండేహిందూదేశశాసనసభాబహుళంలో బహుకక్షుల కెడ ముండరాదు. వుండినపంటే దేశాని కనర్థదాయకాలే ఆకక్షు లుండడం అవుతుంది.'

ల. రా. 'అయితే పార్లమెంటుద్వయం చేసి వుండేక్రొత్తరాజకీయాంగంలో రెండుమూఁడుకక్షులు తమ పార్లమెంటులో వుండేలాగా, వుండవలసిందంగూ విధు లేర్పఱచి వున్నారంటే?'

భు. శే. 'అటువంటివిధులు ఆపార్లమెంటుద్వయం చేసింది, చతురుపాయాల్లో మూఁడవదాన్ని అనుసరించే చేయడం అయి వుంటుందనేది నావూహ. అయితే వాస్తవం అవునో కాదో నాకు తెలియదు. పార్లమెంటుద్వయంమనోభావం వాస్తవమైంది ఈపట్టున తెలిసికోవడం కష్టం.'

ల. రా. 'అయితే శాసనసభల్లో ఒక్కకక్షు, అంటే ప్రజాకక్షు అనేది వొకటే వుండడానికి తెరు వేంది?'

భు. శే. 'హిందూదేశంలో హిందువులున్నూ, మహమ్మదీయులున్నూ, క్రైస్తవులున్నూ, ఆయిగ్లోసాఖండవాస్తవ్యులున్నూ, -ఈవగైరాభిన్నమతస్థు లుంటూ వున్నారు.'

ల. రా. 'అవును. ఆకారణంవల్ల నేకాఁబోలు శాసనసభలలో వొకకక్షు ఏర్పడడం సాధ్యం కాక వుందేమో?'

భు. శే. 'వాస్తవం. హిందూదేశం వాళ్ళది. వాళ్లే ప్రజలు. పరదేశస్థు లదికాదు.' అనేవాస్తవవిషయం వాళ్ళదృష్టిపథంలో పెట్టిపెట్టుకొంటూ వుండవలె.

ల. రా. 'సత్యమే గురువర్యా! ఆవెనుక?''

భు. శే. 'ఈలాంటిప్రజాసమూహంయొక్క ప్రతినిధులకు శాసనసభలు కలగూరగంపలు.

ల. రా. 'ఏవిధానా?'

భు. శే. 'హిందువులకు కొన్నిస్థానాలనిన్నీ, వాళ్ళల్లో వొక్కకొమ్మగా వుండేపంచమాగులకు కొన్ని స్థానా లనిన్నీ, మహమ్మదీయులకు కొన్నితావు లనిన్నీ, క్రైస్తవులలో రోమన్ కాథలిక్కులకు వొక కొన్ని అనిన్నీ, 'ప్రాటస్టెంట్స్' అనుక్రైస్తవ మతశాఖకు కొన్ని అనిన్నీ, శాసనసభలలోనిస్థానాలు ఆయామతస్థులజనసంఖ్యాన్ని అనుసరించి పార్లమెంటుద్వయం పంపకం పెట్టి వుంది. అపంపక ప్రకారం ఆయాయిమతస్థుల కేర్పడి వుండే స్థానాలయొక్క సంఖ్యకు హెచ్చుగా కుండునట్లున్నూ, తక్కువకాకుండులాగునన్నూ, వాళ్ళు వాళ్ళు తమతమమతస్థులలో బుద్ధిమంతులైనవరులనే వరించుకోవలె.'

ల. రా. ఈయేర్పాటువల్ల దేశానికి క్షేమం కలుగుతుందా?'

భు. శే. 'క్షేమం ఏమాత్రం కలుగదు. కాని అన్యోన్యమతద్వేషాలకు ఈయేర్పాటు హేతుభూతమై వుంటుంది. పిట్టతగవు ఏవేళా పిల్లే తీరుస్తూ వుంటుంది. దాని కంతం వుండదు.'

ల. రా. 'ఇంక నేలాగా ప్రజాబృందానికి వొద్దిక కలగడం?'

భు. శే. 'శాసనసభలవల్ల ప్రజాసముదాయానికి అంతా లాభం కలిగించే అంశాలు కొన్ని వుంటవి.'

ల. రా. 'అవేవి?'

భు. శే. ''ఎకరా ౧ కి - పదిరూపాయలతరంశిస్తువుంది అనుకో. ఆప్రకారం జనులు దొరతనానికి నేలపన్ను చెల్లిస్తూ వుంటున్నారు కాదా? మహమ్మదీయులకు ప్రతినిధి అయినసభ్యుఁడో, హైందవసభ్యుఁడో, ఎవఁడో వొక్కసభ్యుఁడు పదిరూపాయలవంతున వుండేతరంశిస్తును ఎన్మిదిరూపాయలకు తగ్గిస్తాఁడనుకో. దొరతనం దాన్ని ఆమోదిస్తుందనుకో. అది సిరపడుతుందనుకో. దొరతనంయొక్క కార్యనిర్వాహక వర్గంచేత ఆవెనుక అనుష్ఠానానికివస్తుందనుకో. ఆప్రకారం మహమ్మదీయసభ్యుఁడు చెప్పినందువల్లనో, మఱెవ్వరి హిందూసభ్యునిపలుకుచొప్పననో, పదిరూపాయలుగా వుండేశిస్తు ఎన్మిదిరూపాయలైందనేది ఒక్కమహమ్మదీయులకే లాభకరమైనఅంశం గాదు. అవునా? కాదా?'

ల. రా. 'అవునవును. హిందూదేశప్రజాసమూహానికి అతి లాభమే. దానికి సందేహం లేదు.'

భు. శే. ఈలాంటివే తక్కినఆర్థికవ్యాపారాదివిషయములున్నూ.'

ల. రా. 'ఆవెనుక.'

భు. శే. 'మతవిషయాలకీశాసనసభలు చోటులు కావు. బ్రిటిషుప్రభుత్వం ఈదేశంలో నాటుకొన్నప్పటినుండి నేటిదాక అదేం గ్రహచారమో కాని ధర్మబద్ధమై వుండేవొక్కహైందవసంఘాన్ని తాఱుమాఱుగ చేయడానికి సంఘసంస్కారులంతా ఈశాసనసభలనన్నింటిని తమతమమతప్రకారం సాధనంగా వుపయోగిస్తూ వస్తూ వున్నారు. ధర్మబద్ధమై వుండే హైందవసంఘాన్ని బహువిధాల రూపు లేకుండా చేయడానికి కంకణం కట్టుకొంటూ వుండేక్రైస్తవమతబోధకవర్గాలప్రతినిధులగుంపాశాసనసభల్లో సంఘసంస్కారులకు తోడుపడ్తూ వస్తూ వుంది. అది అధర్మం. ఆక్రైస్తవమతబోధకులమంద 'తమమతం వేఱు. హిందువులది వేఱు అంటూ తలచడం లేదు. ఆప్రకారం తలఁచకుండేదానివల్ల హైందవమత

విరుద్ధశాసనములు కొన్నియేర్పడి వుంటూ వున్నవి. ఆదినుండి నేఁటిదాఁక బ్రిటిషుగవర్నమెంటున్నూ వుదాసీనం వహించే వుండింది. బాలికావివాహనిషేధశాసనం చేయడానికి దొరతనం అనుకూలించింది. ఇంక నాలాగా వుదాసీనభావంతో దొరతనం వుంటుం దనడానికి చిన్నె లేవిన్నీ లేవు.

ల రా. అందువల్ల సంఘసంస్కారులుగా వుండేసభ్యులయొక్క యిట్టిఅధర్మప్రచారానికీ శాసనసభలు సాధనాలుగా వుండకుండా వుండేలాగున చేసుకోడానికి మార్గం ఏంది?’

. శే. ‘ధర్మబద్ధమై వుండేహైందవసంఘంయొక్క మతాచారములను శాసనసభలమూలాన మార్చడానికిఁ బ్రయత్నించడానికి వైస్రాయిగారియంగీకారం ముందుగా వాటిని మార్చఁబూనినసభ్యునకు పొందడం ప్రధానకార్యమై వుండింది. ఆప్రభువుయొక్క సమ్మతి లేనిది శాసనసభలమూలాన నామార్పు చేయడాని కప్పుడు సాధ్యం లేకుండింది. ఇప్పుడాలా కాదు. వైస్రాయియొక్కగాని గవర్నరుయొక్కగాని అంగీకారం లేక సభ్యుఁడెవఁడైనా సరే, ధర్మానికి గట్టుపడ్డహైందవసంఘాన్ని తల్లక్రిందులుగఁ జేయడానికి వీలుంది.’

ల. రా. ‘క్రొత్తరాజకీయాంగం అట్టిదానికి ఎడమిస్తుందా?’

భు. శే. ‘ఆహా. అట్టిదానికే కాదు. సనాతనధర్మపరులుగా వుండేవిప్రులు సకాలంలో అర్ఘ్యం విడుస్తూ వున్నారంటే, అట్టివిప్రబృందాన్ని చాలుగా నిలవఁబెట్టి గుండ్లతో ఆసమూహాన్ని చంపి గద్దలకున్నూ కాకులకున్నూ వేయవలసిందుందమా, స్వగౌరవరక్షకబృందంలో వుండేసభ్యుఁడెవఁడైనాసరే గాంధిశిష్యులలో సభ్యుఁడై వచ్చినవాఁడెవఁడైనా సరే, తీర్పొనొకదాన్ని శాసనసభలో చేసినాఁడంటే, వెంటనే ఆతీర్పుఅనుష్ఠించఁబడుతుంది. సంధ్య చేసుకొనే బ్రాహ్మణులను చాలుగా నిలవఁబెట్టెదరు. అంత వాళ్ళను జర్మని షెల్సుకు ఎఱగా వేస్తారు.’

ల. రా. ‘ఇంతదారుణకృత్యం జరుగుతుందా?’

భు. శే. ‘ప్రథమస్వరాజ్యకాంగ్రెస్సుకక్షి ఢిల్లీశాసనసభలో సభ్యత్వంవహించి చెలరేఁగి వుండే కాలంలో బాలికావివాహనిషేధశాసనం కాంగ్రెస్సుటిక్కెట్టుతో సభ్యులై వచ్చినహైందవస్వరాజ్యకక్షివాళ్ళే చేయించివుండలేదా?’

ల. రా. ‘అవు నవును. భు. శే. బాలికావివాహనిషేధశాసనము ‘‘జర్మన్‌షెద్దపిరంగికంటే మిక్కిలితీక్ష్ణమైంది. ఆపిరంగివల్ల బ్రాహ్మణులలో దాని కెదురుపడ్డవాళ్ళొకకొందరే చస్తారు. బ్రాహ్మణజాతి చావదు. అయితే ఈశాసనం అట్టిది కాదు. బ్రాహ్మణజాతి అనేపేరులేనట్లు ధ్వంసంచేసింది. ఇంకా చేస్తూ వుంది. కాఁబట్టి శాసనసభలకని పోటీ చేయఁబోయే వరగణాలలో ధర్మానికి బద్ధమైనవాళ్ళనే మనకంతా వరించుకోవలసి వుంటుం దబ్బీ.’

ల. రా. ‘వాస్తవం. ఆవెనుక? భు. శే. హైందవమతాన్నికానీ, మహమ్మదీయమతాన్నికానీ, మరేన్నియే మతాన్నికాని నవనాగరకులయిష్టప్రకారం మార్చడానికి శాసనసభలను సాధనంగా నుపయోగించుకొనే వుద్దేశంతో సభ్యులుగా రావడానికి వుద్యమంచేసే సంఘసంస్కారులుగా వుండేవరచయాన్ని వరించుకోఁగూడదు. ఆలా వరించుకొంటే, మతద్వేషాలుప్పతిల్లును. దానికి సందు దొరతనం కలిగించే వుంది. అట్లాకలహాలకు సందు కలిగించినా రనేది దొరతనంవారిమనోవ్యాపారం’’ అని తెలుసుకొని బుద్ధిమంతులై వుండేశాసనసభాసభ్యులకు దానికి సన్ధి విడవకుండేలాఁగ వర్తించుకోవలె.’

ల. రా. ‘ఇది యెవరికిఁ దెలిసి ప్రవర్తించుకోవలె?’

భు. శే. శాసనసభ్యులుగ రాను పోటీ చేయడానికి వుద్యమించే వాళ్ళ కంతా తెలుసుకోవలె.’

ల. రా. వా ళ్ళెవ్వరు?

భు. శే. ‘నీకుఁ దెలిసియే వుండి వుండవలెనే.’

ల. రా. ‘కాంగ్రెస్సున్నూ జస్టిస్‌వర్గమున్నూ ప్రజాకక్షియున్నూ, —ఈమూఁడే కాదా శాసనసభలకు రాను వుద్యమం చేస్తూ వుండేవి?’

భు. శే. ‘ఈమూఁటిలో ధర్మానికి కట్టుపడి వుండే హైందవసంఘాన్ని తాఱుమాఱుగ చేయడానికి కంకణం కట్టుకొని వుండేది కాంగ్రెస్సు. అందు చేరి వుండేగాంధికిన్నీ ఆతనిశిష్యులకున్నూ తెలిసికోవలె.’

ల. రా. ‘ఇంకా ఎవళ్ళకు తెలుసుకోవలె?’

భు. శే. ఒక్క కాంగ్రెస్‌నాయకులకే కాకుండా, తక్కింగలజస్టిస్‌వర్గమున్నూ, ప్రజాకక్షియున్నూ, జాతీయస్వతంత్రపక్షమున్నూ, —ఈలాంటికక్షులకు తెలుసుకోవలసిం దే యీరాజనీతిమర్మం.’

ల. రా. ‘ఆలా తెలుసుకోక పోతే?’

భు. శే. లెక్కలేనికక్షులు వానకాలంలో పుట్టగొడుగులో అనేలాగ పుట్టుచూ చస్తూ వుంటూ వుంటవి. దానివల్ల మతద్వేషాల కంత ముండదు. అవి అడఁగవు. జనులకు సుఖం వుండదు,

ల. రా. 'ఇట్టిస్థితి ఎప్పుడు కలిగింది?'

భు. శే. 'కలిగింది. కలుగుతూ వుంటుంది. కలుగఁబోవుచూ వుందికూడ.''

ల. రా. 'కారకు లెవరు?'

భు. శే. 'కాంగ్రెస్సును సాధనంగా గొన్న గాంధి.'

ల. రా. 'జస్టిస్‌వర్గంవాళ్లు కారకులు కారా?'

భు. శే. 'కొంతవఱకు వాళ్లున్నూ దానికి పాలికాఁపులే.'

ల. రా. 'కొంతవఱ కంటే?'

భు. శే. 'కాంగ్రెస్సును సాధనంగా ప్రయోగించి ధర్మబద్ధమై చలనం లేక వుండే హైందవసంఘాన్ని తన చిత్తవృత్తికి అనుకూలపడేలాగా గాంధి ఒక్క-పూఁపు పూఁచినాఁడు. గాంధిచిత్తంయొక్క-తత్త్వాన్ని బహు దీర్ఘదృష్టి కలిగి ఈదేశాన్ని పాలించేయేలుబడి గ్రహించింది. గ్రహించి, అతనియత్నంవల్ల తనస్థానానికి చ్యుతి కలుగుతుందేమో అంటూ దొరతనం సందేహించింది. సందేహించి, హైందవసంఘాన్ని గాంధి మార్చవలసిందంటూ చెప్పి వుండే దొప్పన జస్టిస్‌వర్గాన్ని తడకగా చేసుకొని దాన్ని అడ్డంగా వుంచుకొంటూ దొరతనమే చేసింది.'

ల. రా. 'ఏలాగా?'

భు. శే. జస్టిస్‌వర్గాన్నుంచి స్వగౌరవరక్షాసైన్యా న్నొకదాన్ని మొలకెత్తించిం.'

ల. రా. 'దొరతనమూ దానికి కారణం?'

భు. శే. 'కారణం అయి వుంటుంది. ఆస్వగౌరవరక్షాసైన్యం మొలకెత్తినపుడు జస్టిస్‌వర్గంలో వుండేవాళ్లే మంత్రులై వుండినారు.'

ల. రా. 'వాళ్ళల్లో ఒకఁడు బ్రాహ్మణుఁ డేమో.'

భు. శే. 'అయి వుంటాఁడు. అయితే నేమి? భ్రమరకీటన్యాయేన అబ్రాఁపడున్ను బ్రాహ్మణేతరుఁడయి వుంటాఁడు. కాఁబట్టి అప్పుడు మంత్రులుగా వుండే వాళ్లుముగ్గురున్ను బ్రాహ్మణేతరులు.'

ల. రా. 'అయి వుండినా, వాళ్లు స్వగౌరవరక్షాసైన్యోత్పత్తికి కారకు లెట్లా అయి వుంటారు?'

భు. శే. 'చెంగల్పట్టులో ఆ ముగ్గురియొక్క-ప్రాపున నే స్వగౌరవరక్షాసైన్యసభాసమావేశం అయింది.'

ల. రా. 'అయితే నేమి?'

భు. శే. ఆముగ్గురుమంత్రులు బ్రాహ్మణేతరులు. ధర్మమునకు కట్టువడిన హైందవసంఘం అంటే వాళ్లకు తలనొప్పి. దానివల్ల దాన్ని పెల్లగించి వేయడానికై యే స్వగౌరవరక్షాసైన్యంసమావేశం ఆముగ్గురున్ను చేయించారు. ఆముగ్గురియొక్క-ప్రాపకం లేకపోతే ఆసమావేశం అడ అయి వుండఁబోదు.

ల. రా. 'ఏల?'

భు. శే. 'వాళ్లు మంత్రులు. దొరతనంవారివల్ల హిందూదేశస్థులు చెల్లించి వుండేపన్నునుండి నెల ౧కి ౫౦౦౦ రూ. లు జీతం తీసుకొంటూ వుండేవాళ్లు. కావున దొరతనంవారికి వాళ్లు సేవకులు. ఆప్రకారం దొరతనంవారిసేవకు లగుటవల్ల మతద్వేషాల కాస్పదమై వుండేస్వగౌరవరక్షాసైన్యంసమావేశానికి చేయూత ఇచ్చింది వాళ్లకు ధర్మమా? దొరతనం వాళ్లకంత అసను ఇచ్చి వుండింది ధర్మమా? ఇట్టిదే సనాతనధర్మపరు లెవరైనా చేసి వుంటే, దొరతనం వాళ్లను శిక్షించకూరకుంటుందా? ఈమంత్రు లూరకుందురా?'

ల. రా. 'గాంధి చేయఁబూనినసంఘసంస్కా-రాన్ని ఈస్వగౌరవరక్షాసైన్యంచేత జస్టిస్‌వర్గమూలాన నే దొరతనం చేయిస్తూ వుందనేది మీభావమా?'

భు. శే. 'అవు నవును.'

ల. రా. 'ఆసంఘసంస్కా-రం ఎటువంటిదో.'

భు. శే. 'గాంధి కాంగ్రెస్సుమూలంగా హైందవసంఘాన్ని తాఱుమాఱుగా చేయడానికి వుద్యమించిన కార్యంవంటి జస్టిస్‌వర్గాన్ని తడకగా చేసుకొని స్వగౌరవరక్షాసైన్యంచేత దొరతనం చేయిస్తూ వస్తూ వుండే సంఘసంస్కా-రకార్యంగూడా. గాంధికి ఏడేళ్ల శనిస్థానంలో వుండినబ్రిటిష్‌గవర్నమెంటు గురుస్థానంలో ఇప్పుడు వుంది.''

ల. రా. ఇది మీయభిప్రాయమా?'

భు. శే. 'గాంధి ఆఫ్రికానుండి హిందూదేశానికి వచ్చినప్పటినుండి నేఁటిదాఁక అతఁడు కాంగ్రెస్సుద్వారితో స్వరాజ్యసంపాదనోద్యమవ్యవహారం అంతా ఆకళింతకు తెచ్చుకొంటూ, సహేతుకంగా నా వ్యవహారక్రమం నిష్పక్షపాతబుద్ధితో ఆలోచించే వాళ్లకందఱికున్నూ అట్టిఅభిప్రాయం తప్పక కలుగుతుంది.'

ల. రా. ఇట్టిస్థితిలో ఎవరిని వరించుకొంటే ధర్మగత్యం కలుగుతుంది? ఎవరిని వరించుకోవడంవల్ల అధర్మం హెచ్చుపెరుగుతుంది? అనేవిషయాన్ని ఆలోచించుకో పనిలేదా?

భు. శే. 'తెలుసుకో వలసిందే.

ల. రా. 'ఏలాగా?'

భు. శే. 'హైందవసభ్యులున్నూ, మహమ్మదీయప్రతినిధులున్నూ, క్రైస్తవమతసభ్యు లిరుతెగల వాళ్ళున్నూ, హైందవులై వుండేపంచమసభ్యులున్నూ వీళ్ళంతా చేరి మతద్వేషాల కాస్పదులై వుండేవిషయా

కీశాసనసభలు సాధనాలుగా వని ముందుగా తీర్పు చేసుకొంటూ తమలో నొకవిధమైనసమయాన్ని చేసుకోవలె. ఆలా చేస్తే అందఱిసున్నూ ఐకమత్యం కుదురుతుంది. మతద్వేషాలున్నూ పొడ సూపవు. జనసముదాయానికి లాభం కలిగించేఅంశాల్నే ఆలోచించేమార్గాల్లోనే వాళ్ళకు ప్రోద్బుచ్చుతూ వుండవచ్చును.""

ల. రా. ""గురువర్యా! తాము సెలవిచ్చినదంతయు వాస్తవం. హిందూదేవాదాయధర్మశాసనము జస్టిసువర్గము వారు ప్రేసఁబూనిరి. అప్పుడు క్రైస్తవమతస్థుఁడైనసభ్యుఁడు దానికిఁ జేయూత నొసఁగినాఁడఁట"" అయితే క్రైస్తవమతస్థున కేల ఈహిందూదేవాదాయధర్మశాసనమునకు ననుకూలంగాఁ బ్రవర్తింపవలె.'

భు. శే. 'మాలలకుఁ బ్రతినిధిగా శాసనసభలో వుండులాగున దొరతనమువారు క్రైస్తవుని నియమించిరఁట!'

ల. రా. 'దొరతనమువా రేల క్రైస్తవుని నియమించినారు? పంచములలో నట్టివా రెవ్వరున్నూ లేరా?'

భు. శే. ఉన్నారో లేరో, నా కావిషయంలోఁ బని లేదు. పంచములలో నక్షరాస్యులున్నవైనం ఏలినవారికిఁ దెలియునో తెలియదో! మాంట్యాగున్నూ, చెమ్సుఫోర్డున్నూ, చేరి అనుగ్రహించినరాజకీయప్రభుమాంగం అనుష్ఠానమునకు వచ్చింది. శాసనసభలలో పంచములకుఁ బ్రతినిధి ఒకఁడైనా వుండితీరవలయునేది విధి అట. ఆవిధప్రకారం పంచములలో ఆసభ్యత్వానికి తగినవానిని నియమించుకొనడానికి వివేకం లేదఁట. వాళ్ళల్లో చదువుకొన్నవాళ్ళున్నూ లేనే లేరఁట! పంచముఁడై వుండి క్రైస్తవమతస్వీకారము పొందినయొకఁడు దొరతనమువారిదృష్టిపథంలో కనుబడ్డాఁడు. వానికి బిఏపట్టభద్రం వుండింది. పూర్వస్థితిలో నాతఁడు పంచముఁడై వుండినాఁడఁట! ఇప్పు డాతఁడు క్రైస్తవమతస్థుఁడైనా పరవా లేదంటూ పంచములకుఁ బ్రతినిధిగా వుండేలాగున అతణ్ణి దొరతనం నియమించిందఁట.'

ల. రా. 'అప్పటికిన్నీ పంచము లే ఆతణ్ణి వరించలేదఁటే.'

భు. శే. 'అవు నఁట!'

ల. రా. 'అతఁ డేలాగా పంచములకుఁ బ్రతినిధి అవుతాఁడు!'

భు. శే. ప్రజాప్రభుత్వవిధులప్రకారం ఆతఁడు పంచములకుఁ బ్రతినిధి కాఁడు. దొరతనంవారిచేతిబొంగరాలలాగ అతఁడున్నూ అతనివంటివాళ్ళున్నూ వుండేదానికై 'ఆప్రభుత్వం ఆతఁడు పంచములకుఁ బ్రతినిధి.' అని పేరుపెట్టారే కాని ఆతఁడు పంచములకు ప్రతినిధి కాఁడు.'

ల. రా. 'ఇట్టిస్థితులలో ధర్మమునకుఁ గట్టుపడినహైందవులకుఁ గలుగుచూ వుండే అనర్థాలకు లెక్క వుండదు. 'క్రైస్తవుఁడు తాను పంచములకుఁ బ్రతినిధి, అను నెపము ముం దెట్టుకొని హిందూదేవాదాయధర్మశాసనమునకు ననుకూలుఁడుగా వర్తించినాఁడు. అది అధర్మం'

భు. శే. 'అప్పుడు హిందూదేవాలయములలోఁ బంచములకుఁ బ్రవేశము కలిగించవలసిందని యీక్రైస్తవుఁడు పట్టు పట్టినాఁడఁట! కాని ఆశాసనబ్రహ్మ ఒప్పుకోలేదు. దానివలన ఆతనిపక్షమున్నూ అంగీకరించినది కాదు. దొరతనంకూడా ఒప్పుకోలేదు. మఱిన్ని, ఆయిగోపాదేశస్థులప్రతినిధియైనసభ్యుఁడు, హిందూదేవాలయాలలో పంచములకుఁ బ్రవేశం అనాదినుండి లేదు. అందుఁ బ్రవేశింప నర్హత లేనివాళ్ళకుఁ బ్రవేశించడానికి హక్కు కలిగించడం అధర్మం. దానివల్లనే నొప్పుకోనన్నాఁడఁట!'

ల. రా. 'బాలికావివాహనిషేధశాసనం పుట్టినప్పుడు గూడా, ఈతీరుననే హిందూమతమునకు భిన్నమతస్థులలో నొకకొందఱు ప్రవేశించి హైందవుల కెనలేనియపకారం జేసినారఁట!

భు. శే. 'అవును నవును. మన కిల్లరకున్నూ గమనింపవలసినవిషయం అతిముఖ్యమైం దొక్కటి కలదు.'

ల. రా. 'అదేంది?'

భు. శే. 'వోటివ్వండైనా పేరగ బెట్టుకోవలె. అదే మాదిరి శాసనసభాధ్యయమునకు సభ్యులుగ రాఁగోరుచూ వుండేవాళ్ళను కొన్నిప్రశ్న లడుగుదాం. మనకు తృప్తికరంగ జవాబు చెప్పి ఆప్రకారము శాసనసభాధ్యయంలో నడుచుకొంటాము. మతవిరుద్ధంగా వర్తించం. మతవిరుద్ధముగ వర్తించేవాళ్ళ వెంటనే తమకుఁ గలిగినసభ్యత్వాన్ని వదలుకోవలసిం దని వాళ్ళచే స్టాంపుపేపరులో వ్రాయించుకొందాం. వాళ్ళ ఖర్చుల్లోనే ఆప్రకారం వ్రాయఁబడ్డ స్టాంపు రిజిస్టరు చేయవలసింది ముఖ్యం. ఒకవేళ మొండిబండగా శాసనసభలో సభ్యుఁడై వుండుచూ వుండినాఁ డంటే, వేయిరూపాయలకుఁ దక్కువగానిపైకం ముత్తాన్ని ఆలాగున మొండిబండగా వుండేసభ్యునివల్ల కోర్టుద్వారా వసూలు చేసుకోవలసిందిగా ఆస్టాంపులో వ్రాయించుకోవలసింది.'

ల. రా. 'ఇది సాగునట్టి ఆలోచనా దేవరా! అబ్బో!

మహాకష్టకాలం వచ్చింది. ఆడినచొప్పున నడిచే పురుషుఁ డొక్కఁడైనా మందుకుగ్గూడా లేఁడుగా.'

భు. శే. 'లేఁడు. లేఁడు. 'ప్రజాప్రభుత్వవిధులప్రకారం నడుస్తాం.' అని చెప్పేకాంగ్రెస్సువాళ్లు తా మాడిన పలుకాదరించకుండా వున్నారు.'

ల. రా. 'ఎలా?'

భు. శే. 'రెండేండ్లకుముందు డిల్లీ అసెంబ్లీలో సభ్యత్వం పొందడానికై వరులిద్దఱు తాము అభ్యర్థులమంచూ ప్రకటించుకొన్నారు.'

ల. రా. 'వాళ్లెవరు?'

భు. శే. 'జస్టిసువర్గానికి నాయకమణి అనం దగినశూద్రజాతివ్యక్తి, ఒకఁడు; కాంగ్రెస్సునాయకులలో గాలి ఏచాయకొట్టితే ఆచాయ తూర్పార పట్టేబ్రాహ్మణ వ్యక్తి ఒకఁడు.'

ల. రా. 'ఏస్థానానికి?'

భు. శే. 'చెన్నపట్టణంలో హైందవులస్థానానికి.'

ల. రా. 'ఆసభలో సభ్యత్వం పొందడానికిద్దఱున్నూ అర్హులే.'

భు. శే. 'గర్భాధానవయోనిర్ణయసంఘంలో సభ్యుఁడుగా వుండి బాలికావివాహనిషేధశాసనాని కనుకూలపడేలాగున సాక్షులవాఙ్మూలాన్ని సంగ్రహించింది ఆశూద్రవ్యక్తికి ప్రతిబంధకమైంది. అది గ్రహించిందావ్యక్తి. తాఁజేసింది తప్పే అని నమ్మిందంట. నమ్మిందో లేదోకాని 'సనాతనధర్మవిరుద్ధములైవుండేచట్టాలు చేయడంలేదు. ధర్మాన్ని రక్షిస్తాను. దానికి విరుద్ధంగా చట్టాలు చేయఁబూనేవాళ్ళకు నేను తోడుపడను.' అని వ్రాసి చేవ్రాలు చేసిందంట ఆవ్యక్తి. దానివలన సనాతనధర్మపరులొక్క బ్రాహ్మణులందే కాక వైశ్యశూద్రులలో ననేకులున్నారు. వారివోట్లన్నీ ఆవ్యక్తి కవగత మయ్యేలాగున పరిస్థితు లేర్పడ్డవి.'

ల. రా. 'ఆవ్యక్తికి సభ్యత్వము కట్టకడపట కలుగ లేదే పాపం. అ దెందులకు?'

భు. శే. 'విను మోర్పుతో, తొందరపడక. శూద్రవ్యక్తి తప్పక వరింపఁబడు ననేది వాస్తవం అనేవిషయం బ్రాహ్మణవ్యక్తికిఁ దోఁచింది. ఇఁక చేసిందేముంది? సనాతనధర్మపరులతో వెంటనే ఒప్పందం చేసుకొన్నదాబ్రాహ్మణవ్యక్తి.'

ల. రా. 'ఏ మంచూ?'

భు. శే. ''సనాతనధర్మవిరుద్ధశాసనం చేయను. చేసేవారికిఁ దోడుపడను. సనాతనధర్మ మన్నివిధాల రక్షిస్తాను' అని వ్రాసి చెన్నపురిలో సావుకారుపేటలో సనాతనధర్మశిరోమణి అనం దగినఘూర్జరవైశ్యసంసారి మ్రోల సంతకం బెట్టింది. సనాతనధర్మపరులగాలి వానిమీఁదఁ బాఱింది. ఆతణ్ణి జనులు వరించుకొన్నారు.''

ల. రా. 'ఆడినప్రకారం నడుచుకొన్నదా ఆవ్యక్తి?'

భు. శే. 'ఆడినప్రకారం నడుచుకొనే ఆచారం కాంగ్రెస్సువాళ్లకున్నూ లేదు. అందున్నూ ముఖ్యంగా ఆవ్యక్తికి అసలే లేదు.'

ల. రా. 'ఆవెనుక ఆబాఁపనవ్యక్తి తప్పి ప్రవర్తించినాఁడా?

భు. శే. ''అదే మని పలుకను? ఆవరవరణాలు జరిగిన కొంతకాలం చెల్లినవెనుక డిల్లీలో శాసనసభ సమావేశమైంది. ఈబ్రాహ్మణవ్యక్తి దానికిఁ బోయి వచ్చి రాకముందే, 'అస్పృశ్యతను తొలఁగించడానికి నేను తోడుపడను; అయితే పంచములకు దేవాలయప్రవేశం కలిగించేఅంశం నాకు సమ్మతమైనదే. దానికి నేను అనుకూలుఁడనే.' అంచూ తిరుచినాపల్లి వగైరాచోట్లల్లో వుపన్యాసం చేసిందాబ్రాహ్మణవ్యక్తి. వరవరణాలకుఁ బూర్వం 'నీవు చెప్పి చేసే దొకటి. నిన్ను జనులు వరించుకొన్న వెనుక నీవాడిమాటలధోరణి చూచి ఆలోచిస్తే వేఱొకటిగా వుంది.' అంచూ అడిగేవాళ్లకా బ్రాహ్మణవ్యక్తి ప్రత్యుత్తరం చెప్పడం లేదు.''

ల. రా. 'ఆప్రకారం ఆవ్యక్తి ఎందుకు వర్తించవలె?'

భు. శే. 'ఎన్నికలైనవి. జను లావ్యక్తిని వరించుకొన్నారు. ఆవెనుక డిల్లీ శాసనసభకావ్యక్తి వెళ్లింది. హిందూదేశంలో వరించుకోబడ్డకాంగ్రెస్సుస్వరాజ్యకక్షిసభ్యులందఱున్నూ ఆడ పోగైరి. ఆలా పోగైనవెనుక గాంధి ఆడకు వచ్చినాఁడంట!'

ల. రా. 'ఎందుకు వచ్చినాఁడు? ఊరక రాఁడే ఆకోమటిబిడ్డ?'

భు. శే. 'వచ్చి కాంగ్రెస్సుస్వరాజ్యకక్షిసభ్యులఁ బిలిచినాఁడంట.'

ల. రా. ''పిలిచిందెందులకో?''

భు. శే. 'మీరంతా డిల్లీ అసెంబ్లీలో చేరడానికి నాయనుమతిం గోరితిరి. జ్ఞాపకం వుందా?' అని వాళ్ళను అడిగినాఁడంట. 'దేవరా! మీ రేమాకంతా అనుజ్ఞ ఇచ్చారు. అది జ్ఞప్తిలో వుంది. ఈలోపల మఱచి పోతామా?' అని గాంధితో నన్నారంట వాళ్లు. దాని కాతఁడు, 'నాకు కృతజ్ఞతను చూపడానికై దినం ౧కి మీకు దొరతనంవాళ్లు ఇరవై రూపాయ లిస్తారుగాదా? ఆసొమ్ము మొత్తమైనా

కానీ, దానిలో సామైనా కా[illegible] ఇయ్యవల్సింది' అని అన్నాఁడఁట. అనఁగా విని వాళ్లు ఒకరిమొగాలు వేఒకరు చూచుకొన్నారఁట. కొందఱ తీస్తామన్నారఁట. సామిస్తామన్నారఁట! చెన్నపురిపట్టానికి ప్రతినిధియై వుండే బ్రాహ్మణవ్యక్తి స్వజాతివ్యక్తిగతమై వుండే స్వభావం గనుబఱచాఁడఁట. ఆవ్యక్తి ధైర్యం తెచ్చుకొని పదిరూపాయలు కాంగ్రెస్సు కిచ్చేదానికి మావల్ల కాదం చన్నదఁట! తక్కినవుదారగుణసంపన్నులంతా 'ఆయన మా కంతా నాయకుఁడు. ఆయన చెప్పేలాగా మేమున్నూ ఈవిషయంలోమాత్రం వర్తిస్తాం. తక్కినవిషయాల్లో మహాత్ములవారిఆజ్ఞను తలమోస్తాం.' అని అన్నారఁట.

'అలా అయిందంటే, మామాలబిడ్డలకు దేవాలయప్రవేశం కలిగించే అంశంలో మీరంతా వొక్కవుద్దిగా వుండి కష్టపడవల్సిందంటూ కన్నీళ్లు పెట్టుకొన్నాఁడఁట ఆమహాత్ముఁడు. దానికి చెన్నపట్టంప్రతినిధియై వుండే బ్రాహ్మణవ్యక్తి, మహాత్మునికన్నీళ్లు, కొనగోటితో తుడిచేశి, 'శింత పడబాకండి. మీశపక్షం గెలిచిందే' అని అనుకోండి. నోరు లేనిఆపెద్దమ్మలు, ఆసనాతనధర్మపర్లు, యేంచేయఁబోతారు? నల్ల కాకిని తెల్లదంచున్నా, తెల్లదాన్ని నల్ల దంచున్నా, వాగేదాంట్లో నాకుద్ది యెవ్వరున్నూ లేరు. జస్టిస్వర్గంలో నాకుజోడు కోడెవాఁ గేదినాతో పోటీచేశి వోడింది.' అని మహాత్ములవారికి ధైర్యం కలిగించాఁడఁట! ఆపిమ్మట మహాత్ముఁడీలా అన్నాఁడఁట! 'అర్థడాక్సుహిందువులకు ధర్మాన్ని రచ్చిస్తానన్నావంట! అస్పృశ్యత తొలగించడానికి తోడుపడ నన్నావఁట! దేవాలయప్రవేశానికి ప్రతికూలంగా వర్తిస్తా నన్నావఁట. ఈమాటలు ఇనేసరికి నావొళ్లిలో పానం యేలాగో యెగిరి యమలోకానికిపోయిందనుకొన్నా. అనుకొని నీకడ కొచ్చేశినా. వచ్చేశి మీతో నాశింతా అంతా వెళ్లకక్కినా. నోరుండేవాఁడవు నీవు. నాశింత పోగొట్టాల. నామానం కాపాడాల. అంతే సాలు. ఆ దే పదేలు.' అని.

(ఆత్మలో చెన్నపట్టంకాంగ్రెస్సుసభ్యుఁడు,) 'మహాత్ముఁడు మహాత్ముఁడుగాఁడు. బలే వేగుంది. ఆర్థడాక్సు పెద్దమ్మలకు చెప్పినపలు కేం చేస్తుంది? ద్విరసనుఁడను. మహాత్ముని కనుకూలంగా నే వర్తిస్తా. (అని ప్రకాంశగా) అంటరానితనం విషయం ఏలాగా?' అని మహాత్ములవారిని అడిగాఁడఁట! అడిగేసరికి 'దేవాలయప్రవేశంతోడ అంటరానితనం తనంతట జాఱుకొంటుంది. అది నశించిన ట్లే అనుకో. అంటరానితనం [illegible]అంటే [illegible]స్వామయ్య పెద్దగోల చేస్తారు. దానిజోలికి పోవద్దు. మీ కాంగ్రెస్సువృద్ధి మాత్రం దేవాలయప్రవేశంకలిగిస్తురు. అదిచాలు.' అని మహాత్ములవారన్నారఁట. అలా ఇద్దఱున్నూ 'భాయి భాయి' అనుకొన్నారఁట. ఢిల్లీలో సభ ముగిసింది. ఆవెనుక చెన్నపట్టంకాంగ్రెస్సుసభ్యుఁడు 'అంటరానితనాన్ని తొలఁగించడానికి నేను ప్రతికూలుఁడను. కాని మామహాత్ములవారిమాలబిడ్డలకు దేవాలయప్రవేశం కలిగించడంలో వంచన లేకుండా దానికి అనుకూలంగా నే ఢిల్లీ చట్టకూటంలో వర్తిస్తాను. ఇది నిక్కం.' అని తిరుచినాపల్లివగైరాస్థలాల్లో వుపన్యాసం చేశాఁడఁట! 'బ్రాహ్మణవ్యక్తిస్వభావం తెలిశిందా రామచంద్రా?'

ల. రా. 'తెలిసింది. తెలిసింది. సూర్యుఁ డస్తమించఁబోవుచున్నాఁడు. లెండి. పోవుదము. నేను వెంట రాలేదని కాఁబోలు ఆవులను మేఁపేపసులకాఁపరులకు అవి తిరుగఁబాటుమొగం పెట్టుకొని నాచాయనే చూస్తూ వుంటూ వున్నవి, కొట్టాలకుఁబోక. అనేకనమస్కారాలు.'

భు. శే. 'శ్రీరామార్పణమస్తు' (అని యిద్దఱును నిష్క్రమింతురు.)

స్థలము:— పూర్వోదాహృతమైన శ్రీలక్ష్మీనృసింహస్వామి దేవాలయము.

కాలము:—తూర్పుదెసఁ జుక్కపొడిచిన వెనుక నాలుగు గడియలకాల మయ్యె. అరుణోదయము కాఁబోవుచుండెను. స్నానము లొనర్చి వస్త్రము లుతుకుకొని మంచినీళ్ళబిందెలు తమతమయిండ్లకుఁ గొనిపోవ బ్రాహ్మణస్త్రీ లొకకొందఱు ప్రవేశింతురు. అప్పుడు తెరలో నాకోవెలవెనుకనుండువీథిలో వెట్టివాఁడు తప్పెట వాయింపుచు నిట్లు చాటించును:—

''ఓటు''జాతర రాబోతుందో! ఓటుజాతర రాబోతుందో! వూళ్లో వోట్లియ్యడానిక్కి అక్కుండేవోళ్ళందఱూ కాంగ్రెస్సువోళ్ళకే వోట్లియ్యాలంటా! (డం డం డం డం)

'ఓటుజాతర రావడానికి రెన్నెల్లుకాలంగూడా లేదో పజలారా! మీమీవోట్లన్నీ కాంగ్రెస్సోళ్ళకే యియ్యాలంటా! యియ్యాలంటా! అలా యిచ్చారంటే, తప్పకుండా సొరాజ్జం వస్తుందంటా! సొరాజ్జం వస్తుందంటా! యినండి కాంగ్రెస్సు సెప్పేమాట!' (డం డండం)

'ఓటుజాతరో వోటుజాతర! సొరాజ్జకచ్చీ రేపు సందాల నరసిమ్మసోమిగుడికాడ వుండేమామిడితోపులో శేర్తారంటో! ఆడ కీవూళ్ళోవాళ్ళంతా రావల్సిందే' (డం డం డం)

'ఓటుజాత రమ్మో ఓటుజాత రమ్మో! యేం అనుకొన్నారో ఓటుజాత రంటే వోటుజాతర! కాంగ్రెసోళ్ల పసంగం యినడానికి రండో వోపజలూ! రండో వోపజలూ! కాంగ్రెసోళ్లకి మీవోట్లిచ్చినారంటే, యినండి నామాట; సూడండి మేలోళ్లరికి పన్ను లెగ్గొయచ్చు. లేకపోయిందంటే పన్నులు తగ్గిస్తారు. తెల్లోళ్లకి జీతాలెగ దట్టేస్తారు. మనోళ్లు నేకపెట్టితే ఈదేశం వోళ్లంతా కట్టాల. అంకా నైరంటూ! నోళ్ల యూసారం కూలిపోతుందంట! తెల్లోళ్ల పెత్తం అద్బులో ఇంకా పడ్డట్టే అనుకోండి. వోళ్లు తెల్లదవిచాడుగడ్డకు పిల్లల్తోనూ యీదేశం యిడిసి పోడిల్లో యెక్కా కాలికి బుద్ధిచేప్పాల్సిందే. ఇంక మన కేం లెక్క. రెంటి కే. ఆ రేందని? సుద్ధకిన్ని కూటికిన్ని.' (అని తప్పెటవాయించుకొనుచు వేళాకచాయకు నాపెట్టివాడు పోయె.)

(పూర్వోదాహృతులైనయా బ్రాహ్మణస్త్రీలలో మొదటివ్యక్తి రెండవవ్యక్తిం గని) 'వేంకమ్మగారూ! వింటున్నారా, వెట్టివాడు చాటించిన చాటింపు.'

వేం. 'వినక ఏం? చెవుడా నాకు? వింటూనే వున్నా. ఆచాటింపు వినగానేగదా, నాకు వొళ్లు జలదరించింది, జంద్యాల శేషమ్మసోమిదేవమ్మగారూ!'

జం. శే. సో. 'ఎందుకండీ మీకొళ్లు జలదరించడం? గాలిచేష్టలు కావుగా?'

వేం. 'కావు కావు. గాలి నాదాకు దగ్గరికైనా రాదు.'

జం. శే. సో. 'అలాగా' (అని ఆశ్చర్యముతో) 'అయితే మీ కొళ్లెందుకు జలదరించింది?'

వేం. 'ఏమంటూ చెప్పను నాసోద? 'కాంగ్రెస్సు' 'స్వరాజ్యం' అనేరెండుపదాలు వినగానే తోడనే నాకు గుండెలు బ్రద్దలై చీలి రెండై పోయినవి. అయితే ప్రాణంమాత్రం పోయిందికాదండీ. ఇంకా ఎన్నెన్నికష్టాలనుభవిస్తూ వుండవలసి వుందో యీ ప్రాణికి (అని కన్నుల నీరు పెట్టుకొనెను.)

జం. శే. సో. 'కాంగ్రెస్సంటే మీ కంతభయం ఎందుకండీ?'

వేం. 'ఎందుకా? వినండి.'

జం. శే. సో. 'వింటూ చెప్పండి.'

వేం. 'ముందటపల్లెటూళ్లలో మనబ్రహ్మయ్యంగారింట్లో గాంధి, మహాత్ముడంటూ అతణ్ణి వూరేగించారు.'

జం. శే. సో. 'ఎందుకు?'

వేం. 'ఎందుకని అంటారా? మీకునున్నా తెలియదండీ. మీయింటాయన వెయ్యిరూపాయలు తిలక్కుస్వరాజ్యనిధికంటూ ఇయ్య లేదండీ.'

జం. శే. సో. "అవు నవును. ఇప్పుడు జ్ఞప్తికి వచ్చిందండి. నేలకున్నూ వడ్లకున్నూ అప్పుడు మంచివెలలు వుండినయి. దానివల్ల అప్పు డంతరొక్కం ఇయ్యగలిగినామండి. ఇప్పుడైతే ఇయ్యగలిగి వున్నామా చెప్పండి?"

వేం. 'అయితే ఇప్పుడు రొక్కం వుంటే, వానిస్వరాజ్యం కాలి పోను, మీ రంతసొమ్మిస్తారా?'

జం. శే. సో. 'వుంటేకదా అసలు పైకం? పిల్ల పెండ్లికి పైకం కావల్సుంటే ఎక్కడెక్కడా దేవులాడినా, గవ్వకాసు దొరకందికాదు. ఆవేయిరూపాయలుంటేంటే అప్పు తీయ్యకుండా పిల్లకి పెండ్లి చేసి వుందుము. అయితే మీకెందుకు కంతభయం?'

వేం. 'వినండి. గాంధి కాంగ్రెస్సుమూలంగా స్వరాజ్యాన్ని సంపాదిస్తాను. దానికి కోటిరూపాయలు కావలె నన్నాడు. దానికే కదండి మీయింటాయన వేయి రూపాయ లిచ్చింది?'

జం. శే. సో. 'అవు నవును. పైన చెప్పండి.'

వేం. 'అప్పుడు చదువుకొంటూ వుండే పట్టణవాళ్లందరూ చదువులు మానినారు.'

జం. శే. సో. 'మానినారు. అదిన్ని జ్ఞప్తి వుంది.'

వేం. 'అప్పు డందరికిన్ని పట్టినవెఱ్ఱి ఇప్పుడుకూడా మామేనల్లునికి పట్టుతుందో అనేది భయం.'

జం. శే. సో. 'అవునండీ అవును. ఇప్పు డప్పుడు జరిగిందంతా ఆకళింతకు వస్తూ వుంది. అప్పుడు మిమ్మల్ని మూడు చెలువులనీళ్లు త్రాగించినాడు కాదండీ, మీ మేనల్లుడు?'

వేం. "ఆవెఱ్ఱే నండీ, ఆవెఱ్ఱే."

జం. శే. సో. 'ఇప్పుడు వాణ్ణి పట్టిందా ఆవెఱ్ఱిదయ్యం?'

వేం. "'రే పీఠాపురంలో కాంగ్రెస్సుసభ్యులు సభ చేస్తారట. అందుచేరుదు నా?' అని అన్నాడు నిన్న."

జం. శే. సో. "ముందు చేరి అయిందె ఇల్లంతా సర్వమంగళంగాను."

వేం. 'ఆదినాలిప్పుడు తలచుకొంటే ఈ దేహంలో ప్రాణాలింక వుండవండీ.'

జం. శే. సో. 'మీపొరుగున నేకాదా మేమున్నా కాపురం వున్నాం. మీ మేనల్లునివల్ల మీరు పడినకష్టాలు తలచుకొంటే, నావొళ్లూ జలదరిస్తూ వుంది ఇప్పుడు కూడాను. (వే చోకచిన్నది,) "ఏమండీ అంతకుష్టుడా యీసువ్వగారి మేనల్లుడు?" (అని అనెను)

జం. శే. సో. 'అవునే తల్లీ! మాలవాళ్లను గౌగిలించకోవల్సింది అని గాంధి ఆజ్ఞ చేశాడంట! అతః

యాజ్ఞాప్రకారం అప్పుడు ఈ వేంకమ్మగారి మేనల్లుఁడు మాలవాళ్లను పిలుచుకొని రావడం. వాళ్లకు తన తోబాటు వంటయింటిలో ఒక్క పంక్తిలో వణ్ణం పెట్టమని మేనత్తను అడగడం. 'మాలవాళ్లురా. వాళ్లకేలాగా బ్రాహ్మణులం అయివుండేమనం మనయింట్లో వణ్ణం పెట్టడం? ఇదేం ఆగడంరా? వెఱ్ఱి పట్టిందంట్రా నీకు?' అంటూ యీ వేంకమ్మగా రఱవడం. ఆవెనక వాఁడు లేచి వంటికట్టెతో నీముసలా వెడను మోదడానికి రావడం. మాయింటాయన అడ్డపడడం. ఆవెన్క వాఁడాగడం. ఇదే గాంధి అహింసాస్వభావం.''

వేం. 'ఆసిఁతే వస్తుం దేమో అని గోడుగోడున దుఃఖించుకొంటూ కుళ్లి కుళ్లి మ్రగ్గి మ్రగ్గి చస్తున్నా' నండీ. వాఁ డెనిమిదినెలలబిడ్డగా వుండేటప్పుడు, వానితల్లిదండ్రులు స్వర్గస్థులైనారండి. అప్పటినుంచి నేఁటిదాక ఇంతవాణ్ణి అంతవాణ్ణిగా పెంచి పెద్దచేసినానండీ. చదువు చెప్పించినాను. లెక్కపక్క నేర్చుకొన్నాఁడు. 'ఇంగ్లీషుచదువు తా' నన్నాఁడు. 'దానికి బోలెడు ధనపిశాచం కావలెరా అబ్బీ!' అని వద్దన్నాను. సరే అంటన్నాఁడు. సర్వేపరీక్ష ఇచ్చినాఁడు. మునసబుపరీక్షకు పోయినాఁడు. ఆగెంటిలోను నెగ్గినాఁడు. దానివల్ల కలెక్టరీప్వారికి జమాబంది చేయడానికి వచ్చి మామేనల్లుణ్ణి పిలిపించి మునసబు కొలువిచ్చినాఁడు. వాఁ డాకొలువు పైనఅధికారులకు తృప్తికరంగానే చేస్తూ వచ్చినాడండి. వున్నట్టుండి యీ గాంధితోకచుక్క యెక్కడనుంచో దిగబడ్డది. అప్పుడు మామేనల్లునికి ఆవేశం వచ్చింది. ఏం దనుకొన్నారు? మునసబుకొలువుకు బిలోనకొలు విడవవలసిం దనే ఆవేశం.' (పూర్వోక్త స్త్రీ వ్యక్తి, చిన్నది.)

స్త్రీ. వ్య. 'ఎందు కావేశం వానికి వచ్చింది?'

వేం. 'చిన్నదానవు. నీకు దెలియదు. చెప్పుతా. వినుమమ్మా! తోకచుక్కవలె వచ్చినయా గాంధి ఇట్లన్నాఁడమ్మా:—'దేశీయమహాజనసభ అఁట.'

స్త్రీ. వ్య. 'అంటే.'

వేం. 'కాంగ్రెస్' అని అటాఁ రమ్మా. గాంధి దాన్ని తన అధీనం చేసుకొన్నాఁడఁట! 'స్వరాజ్య మియ్యండి ఇంగ్లీషుదొరలారా' అని ఏలినవారిని భిక్షం అడగవద్దు. యాచించడం దేశీయమహాజనసభకు అలవాటు కాదు. స్వరాజ్యం అన్యులసాహాయ్యం లేక మన మే సంపాదించుకొందాం.'

స్త్రీ. వ్య. 'అ దేలాగా? మనకు పైకం వుందా? దండు గిండు వస్తా? యుద్ధం చేయడానికి మనవాళ్లకు తెలుసునా?'

వేం. 'చిదవమ్మా తల్లీ! యెందుకే నీ కీతొందర? కాఫీకి గాను మాయింటాయన కాచుకొని వుంటాఁ డేమో. అయినా కొంచెం వోర్చుకొమ్మక్కో. అత్తగారు లేరుగా నీకు తప్పులు మోపడానికి? అత్త లేనికోడలు గుణవంతురాలు. విను.'

స్త్రీ. వ్య. 'అలాగే వింటా. బిన్నా చెప్పి ముగించండి, అవ్వగారూ.'

వేం. 'దానికి సాధనం కావలె. అది 'దేశీయమహాజనసభ' అని అన్నాఁడు. దానివల్లంగా కొన్ని తీర్పులు చేయించినాఁడు.'

స్త్రీ. వ్య. 'ఆవేవి?'

వేం. 'స్వరాజ్యం సంపాదించడానికి కోటిరూపాయలు కావలయును. దానికిగ్గాను హిందూదేశస్థులు గాంధి వశాన కోటిరూపాయలు తమకు తోఁచినంత ఇయ్యవలసింది. ఏపాటి అల్పవిద్యకుం అయినా దానికి రొక్కం వద్దండీ?'

స్త్రీ. వ్య. 'రొక్కం లేకపోతే ఏపనిన్ని సాగదు. వాస్తవం. దానివల్లనే కాఁబోలు కోటిరూపాయలు కావలె నన్నాఁడు.'

వేం. 'గాంధి రూపాయలు కావలెనని అనలేదు. దేశీయమహాజనసభ కావలె నని అన్నది. దానిమొత్తానికి ''తిలకుస్వరాజ్యనిధి'' అనే పేరు పెట్టించినాఁడు.'

స్త్రీ. వ్య. 'వెంటనే ధనం వసూలు చేయడానికి మొదలు పెట్టినాఁడా?'

వేం. 'లేదు. లేదు. వసూలు చేయఁ బోవుపైకానికి, వ్యయం చేసే మార్గం కలిగించినాఁడు.'

స్త్రీ. వ్య. 'అ దేంది?'

వేం. 'హిందూదేశాన్ని ఇంగ్లీషుదొరలు పాలిస్తూ వున్నారు.'

స్త్రీ. వ్య. 'అవును.'

వేం. 'వాళ్లను ఈదేశంనుండి తరిమి వేయవలె. ఇదిమూఁడవ తీర్పు.'

స్త్రీ. వ్య. 'మొదటిరెండు తీర్పు లేవి?'

వేం. ''చెప్పినాను గదే తల్లీ, 'స్వరాజ్యం అన్యసాహాయ్యం లేక సంపాదించుకోవలెను. ఇది మొదటిది. తిలకుస్వరాజ్యనిధికి కోటిరూపాయ లియ్యవలెను. ఇదిరెండవది.'' అని.'

స్త్రీ. వ్య. 'మఱచినానండీ.'

వేం. ''మాయింటాయనమీఁద తలపు పోయిందేమో!

చిన్నదానవు. నీ పెనిమిటీ పసివాఁడు. రాత్రిళ్లు ప్రొద్దే తెలియడం లేదఁటే నీకిద్దఱికిన్నీ'' (అని నవ్వెను.)

స్త్రీ. వ్యా. 'ఏమోలెండి. పసికాపురంగా వుండీ.'

వేం. 'అలా చెప్పకో.'

స్త్రీ. వ్యా. 'ఆ వెనుక.'

వేం. 'ఇంగ్లీషువాళ్లను దేశంనుండి తఱిమి వేయడానికి సాధనం, వాళ్ల దొరతనానికి, తోడుపడగూడదు. ఇది నాలవతీర్పు.'

స్త్రీ. వ్యా. 'ఇది ఏలా సాధ్యం అవ్వా?'

వేం. 'దానికై గాను దేశీయమహాజనసభయొక్క మూలాన అతఁడు చేసినసాధనా లివి. విను. 'మాలవాళ్లను గౌగిలించుకోవలెను. ఇది అయిదవది.'

స్త్రీ. వ్యా. 'ఇదేలాగా?'

వేం. 'ఏలాగో విను. బట్టతలకున్నూ మోకాళ్లకున్నూ ముడివేయడం ఇది తల్లీ.'

స్త్రీ. వ్యా. 'ఇది దేశంలో కలహాలకు హేతు వవుతుందేమో.'

వేం. 'దానికి నాం ప్రథం మాయింట్లోనే గణపతిప్రార్థనైం దమ్మో. దీనివల్ల ఒద్దిక కలుగుతుందంట. దానికి దేశీయమహాజనసభయే సాధనం' అని అన్నాఁడు.'

స్త్రీ. వ్యా. ''ఆఱవతీర్పేం దవ్వగారూ.''

వేం. ఇంగ్లీషుదొరలకు ఉద్యోగాలు చేయరాదు. చేస్తూ వుండేవాళ్లందఱూ తమతమవుద్యోగాలను తిలోదకాలు విడిచిపెట్టవలెను.'

స్త్రీ. వ్యా. 'ఈతీర్పు గాంధి చేసినాఁడా? దేశీయమహాజనసభ చేసిందా?'

వేం. 'తాను చేసినా నని చెప్పకొనే వెఱ్ఱివాఁడా అతఁడు? కాఁడు. కాఁడు. వానిచెవులను కంసాలివాఁడే కుట్టినాఁడు. దేశీయమహాజనసభే చేసిం''దని.

స్త్రీ. వ్యా. 'ఆ వెనుక.'

వేం. 'ఇంగ్లీషుభాషను నేర్పేబళ్లన్నింటినీ మూసి వేయవలెను.'

స్త్రీ. వ్యా. 'ఈతీర్పుచొప్పన కుఱ్ఱవాళ్లందఱూ ఇంగ్లీషుభాషను నేర్చుకొనడఁ వదలి పెట్టినారా?'

వేం. 'అందఱు విడిచి పెట్టుతారా? విడిచి పెట్టరు. ఎవరో వొకకొందఱు నిర్భాగ్యదామోదరులు విడిచినా రనుకో.'

స్త్రీ. వ్యా. 'ఆ వెనుక'

వేం. 'తమతమజగడాలు తీర్పు చేయించుకొడానికై జనుల కింకమీఁదట కోర్టుల కెక్కడం గూడదు. ఇదేడవది.'

స్త్రీ. వ్యా. 'అయితే వకీళ్లందఱున్నూ కోర్టులకు పోవడం మానినారా? జనులున్నూ ఆలాగే కోర్టులకు పోక వుండిరా?'

వేం. 'వకీళ్లవృత్తిని వదలినవా రొకకొందఱే వుంటారు. అందఱున్నూ తమకు బ్రతుకుతెరువుగా వుండేవృత్తిని విడుస్తారా? అది అసాధ్యం. జను లాక్రొత్తలో కోర్టుల కెక్కక వుండిరి. గొప్పదాఁటు. క్రొత్త వైష్ణవునియొక్క నామా లనుకొనండి.''

స్త్రీ. వ్యా. 'ఆపిమ్మట?'

వేం. 'కల్లంగళ్లన్నీ మూసి వేయడం.'

స్త్రీ. వ్యా. ''మూసి వేసి కల్లుత్రాగకుండా వుండిరా గాంధియొక్క ఆమాలబిడ్డలు?''

వేం. 'ఆచోద్యం ఏమంచూ చెప్పను? వేయితలలు కల ఆఅనంతునికైనా ఆవుత్సాహం పలుకడానికి సాధ్యమా?'

స్త్రీ. వ్యా. 'అబ్బో! అంతవుత్సాహ ముండిందండీ?'

వేం. 'ఏమనుకొన్నావ మ్మో? కల్లు త్రాగడానికి వచ్చేయేనాదోళ్లను, మాలోళ్లను, వడ్డోళ్లను, చాకలోళ్లను, వుప్పరోళ్లను, రానీకుండా కల్లంగళ్లకడ్డంగా గాంధియొక్క అనుచరులందఱున్నూ పంచకొన్నారు. కల్లమ్మే వ్యాపారులను కల్లమ్మ వద్దన్నారు. కల్లు గీచేగౌండ్లవాళ్లను కల్లు గీయవద్దన్నారు. కల్లు గీయడానికి తాటిచెట్లనున్నూ ఈతచెట్లనున్నూ కల్లు గీయడానికి విడవ వద్దనిన్నీ, గుత్తకు వదల వద్దనిన్నీ, ఆచెట్లయొక్క యజమానులను వేఁడుకొన్నారు.'

స్త్రీ. వ్యా. 'అవ్వా! వాళ్లందఱున్నూ గాంధిశిష్యులమాటవుపదేశం విని కల్లుత్రాగడమున్నూ, కల్లువ్యాపారమున్నూ కల్లుగీయడమున్నూ, వదలేశారా?'

వేం. 'ఏ మని చెప్పేదు తల్లీ! పాపం వాళ్లవుపదేశం కొంతదాక ఫలించింది. కల్లంగళ్లు మూతలు వడ్డవి. త్రాగడం మానేశారు. గీయడం వదలేశారు. ఆచోద్యం ఏ మని చెప్పను? ఏనాదోళ్లకున్నూ, గాంధి మాలబిడ్డలకున్నూ, చాకలోళ్లకున్నూ, వడ్డోళ్లకున్నూ, వుప్పరోళ్లకున్నూ. కల్లుత్రాగడం మానడంవల్ల రొక్కం మిగిలింది. దొరతనానికి గల్గినష్టం అపారం అంట. కల్లంగళ్లను గుత్తకు తీసికొన్నోళ్లకు కల్గినష్టం చెప్పతరంగాదంట; తల్లీ! ఇంకపైన కల్లంగళ్లను గుత్తకెత్తం అంచూ వొట్టు పెట్టుకొని చెంపలు వాయించుకొన్నా రంటమ్మ!

స్త్రీ. వ్యా. 'ఇది మంచిపనే. సాగించిందా కొనవఱకు ఆ గాంధికాకిగుంపు?'

వేం. 'ఆరంభశూరత్వం అమ్మా. కొన్నాళ్లే కది చల్ల బడ్డది.'

స్త్రీ. వ్యా. "ఎందు కండీ?"

వేం. "గాంధికి దానిమీదవుండేదృష్టి చలించిపోయిండి. అంటరానితనం తొలగించే ప్రయత్నంమీద బడ్డది. అది ఆఅడుసులో బడ్డపిల్లిఅయి పోయిం దమ్మా.'

స్త్రీ. వ్యా. 'ఏదిజనులకు లాభ మో దాన్ని చేయడాని కారంభించడం. ప్రజల కందు రుచి కల్గించడం. వెంటనే దాన్ని మానేయడం. ఇది గాంధికి, సాజంగా వుంది.

వేం. 'వాస్తవం ముమ్మాటికీవాస్తవంతల్లీ. ఖద్దరుకొగ్గూడా ఆతలనొప్పే పట్టింది. దేశానికి అధికలాభం కలిగించే యీరెండంశాలున్నూ ఆపివేశాండు. దేశానికేది అనర్థమో అది, ఆఅస్పృశ్యత గాంధికి ప్రధానం అయింది. దాన్నిపట్టుకొంఛూ గాంధిన్నీ అతని శిష్యులున్నూ గబ్బిలాలలాగ వ్రేలాడుచూ వున్నారు. అది పోయిందా, వీళ్లకుస్వరాజ్యం వచ్చినట్లే అనుకో అమ్మా. 'బ్రిటిషుదొరతనం మనకు పట్టినశని' అన్న గాంధియే, ఆఅంటరానితనాన్నిపొగొట్టేనిమిత్తం పూర్వం శనిగావుండినబ్రిటిషుప్రభుత్వంతో చెట్టాపట్టుకొంచూ రాసక్రీడ సల్పుచూ వున్నాండమ్మా.

స్త్రీ. వ్యా. 'ఆపైన?'

వేం. 'ఏలినవారికి పన్ను లేలాటి వైనా చెల్లించకూడదనడం.'

స్త్రీ. వ్యా. 'జను లీతీర్పుకు బద్ధులైనారా?'

వేం. 'ఎందు కండలూ బద్ధులవుతారమ్మా?'

స్త్రీ. వ్యా. 'అయితే కొందరైనా అయినారేమో!

వేం. 'కొందరే దీనికి బద్ధులైనట్లు తోస్తుంది.'

స్త్రీ. వ్యా. 'అయితే ఈతీర్పెందుకు, అందఱున్నూ బద్ధులు కానప్పుడు?'

వేం. "ఎందుకో? ఈలాటితీర్పులు దేశీయమహాజనసభ దీనికిముం దెప్పుడున్నూ చేసినపాపానపోయింది కాదు. గాంధి దానికి సర్వాధికారి (Dictator) అయినాండు. అప్పటినుంచి నేటిదాక అతనిమాట కెదురాడేమగబంటు ఆసభలో ఎవ్వండున్నూ లేండు. దానివల్ల కలిగేమంచిచెడ్డ లాలోచించడానికిగానీ అది వద్దని కానీ చెప్పడాని కెవ్వరికిన్నీ ధైర్యం లేదు."

స్త్రీ. వ్యా. 'అయితే ఈసభ ప్రజాసముదాయస్థానంలో వుంచున్న దంచూఆసభాసభ్యులు వాగుచూ వుంటారంటూ.'

వేం. 'మాటలపసేకాని కార్యంలో ఆపసలేనబడదమ్మా.'

స్త్రీ. వ్యా. 'అయితే క్రియాశూన్యులా వాళ్లు?'

వేం. 'క్రియాశూన్యు లవుతారో కారో నాకు తెలియదు. వొక్కటిమాత్రం వాస్తవం. ఈలాటితీర్పులు క్రియాకారం తాల్చినా తాల్చక పోయినా, ప్రజల కధికోత్సాహం కల్గించినవి. దానివల్ల మందబుద్ధులు పన్ను చెల్లింప లేరు. వారిభూము లేలాలు పడ్డవి. వారందువల్ల బీదలైరి. ఇప్పు 'డన్న మోరామచంద్రా' అని కొందఱున్నూ 'రామకృష్ణాభ్యాం నమః' అంచూ కొందఱున్నూ, 'తల్లీ సందకవళం వెట్టే' అంచూ ఇంకాకొందఱున్నూ ఇంటింటికిం బోవుచూ వుంచున్నారు. ఇదే ఆతీర్పువల్ల కలిగినఫలితం.'

స్త్రీ. వ్యా. 'అయితే ఆతీర్పుప్రకారం గాంధిఅనుచరులు వర్తించినారా?'

వేం. 'వర్తించినారో లేదో నాకు తెలియదు. అది చిదంబరరహస్యం. వాళ్లల్లో ముఖ్యులైనవాళ్లొక కొందఱు గుప్తమార్గాన తాము తమపొలాలకు చెల్లించవలసివుండేపన్ను మొత్తం మూండవవారైన తమతమసోదరులగూలాననో మేనత్తమేనమామ కొడుకులగూలానో, తమ కాపులై వుండి దొరతనం లోవుద్యోగాలు చేస్తూ వుండినమిత్రులగూలాననో దొరతనమువారిముడుపు వేళకుం జెల్లించారంట! దానికి రసీదులు దొరతనమువారు గుప్తమార్గాన నే వారి కందం జేశారంట?!

స్త్రీ. వ్యా. 'అట్టివారందఱున్నూ తమవిమవృత్తులు వదలు కొన్నారంట! అన్నోదకాలకు కష్టపడుకుండా, వున్నారంట! స్వరాజ్యం సంపాదించేప్రయత్నం ఏట్టిలో కలిశిపోయిందట. మాలవాళ్లను కౌగిలించుకొనే వ్యాపారంలో తమకాలాన్ని గడుపుచూ వున్నారంట! వాస్తవములా ఈమాటలు?'

వేం. 'వాస్తవము లౌనో కావో ఇప్పుడు వారుండేతీరు చూచి ఆలోచిస్తే అట్లే అనడం సత్యం.'

స్త్రీ. వ్యా. 'ఆలాగా? అటుపిమ్మట.'

వేం. 'ప్రజలందఱూ ఖద్దరే కట్టవలెను. అనేదే కడపటితీర్పు.'

స్త్రీ. వ్యా. 'ఇది లాభకరమైందే సుమీ. దీన్ని అవలంబించినారా జనులలో ఎవరైనా?'

వేం. 'ఓంప్రథమంలో కొంద అవలంబించినట్లు జనులు నటించారే. కాని అదంతా ఇప్పుడు చల్లబడ్డది. అస్పృశ్యత తొలగించడంలో దిగింది దేశీయమహాజనసభానాయకులయొక్క స్వరాజ్యసంపాద్యానికై వారు చేస్తూ వుండినవుద్యమం అంతా?'

స్త్రీ. వ్య. 'ఆలాగా? ఆలాగా?' (అని యచ్చెరువుతో నడుగును.)

వేం. ''ఏది వచ్చినా, ఏది రాక పోయినా, తిలక్కు స్వరాజ్యనిధికిమాత్రం కోటిరూపాయలు ఒక్కరువ్వకూడా తక్కువకాకుండా వసూలైం దంటూ, అమ్మా.''

స్త్రీ. వ్య. 'ఆదేలాగా అంత పెద్దమొత్తం వసూలైందవ్వా?'

వేం. 'ఆకోటిరూపాయలకొక్కం వసూ లయ్యేదాఁక ఆగాంధి రేచుపిట్టలాగ దేశమంతా తెగ తిరిగాఁ డమ్మా. అప్పు డాతని కెక్కడ చూచినా వూరేగింపు లే! మునిసిపాలిటీలున్నూ, జిల్లాబోర్డులున్నూ, తాలూకాబోర్డులున్నూ, ఆయనకు స్వాగతపత్రా లర్పించడా లే! ఏచాయ చూచినా, విన్నా, ఆతని ఛాయాపటాలవూరేగింపు లే! ఆతనిమాహాత్మ్యం వర్ణించే శతకాలకు లెక్క లేదు. రాత్రిళ్లలో ఆతని చరిత్రం కాలక్షేపాలు చేసేవాళ్లొందలు. ఆతని పేరిట నోట్లుత్పత్తి అయినావి. తపాలాబిళ్లలు ఆతనితలతో అచ్చుకొట్టించారు. అతఁడే ఆకాలం లో ఏలినవాఁడైనాఁడు. ఆతనిదర్శనం చేసుకొంటే, సకలపాపాలు పోతుం దనేభ్రమతో పట్టణాల కున్నూ, రైళ్ళకున్నూ, దగ్గరలో లేనివూళ్లనుండి లెక్కకు మిక్కిలియైనప్రజ వచ్చింది. అయితే దర్శనం చేసుకొన్నా రో లేదో. భగవంతునకే యెఱుక. అమాయకులైనయీప్రజవల్ల వాలంటీర్లంట, మహాత్మునిదర్శనం చేయిస్తా మంటూ తలా రెం డణాలవంతున పైకం తీసుకొని 'రండీ మా యెంట మహాత్ములవారిదర్శనానికి' అంటూ వాళ్ళను తోడ్కొని గుంపులో నదృశ్యులైనా రంట. ముసుకులు వేసుకొన్నమనబ్రాహ్మణపూర్వసువాసిను లాలాగా మోసపోయి తిన్నతిన్నగా వూళ్లు చేరుకొన్నా రంట!'

స్త్రీ. వ్య. 'ఎందు కండీ ఇంతవుత్సాహం?'

వేం. 'చెప్పతా వినవే తల్లీ. స్వరాజ్యం అదో వచ్చింది. ఇదో వచ్చింది. ఆఱునెలలలోపల వస్తుంది. అయిదు మాసాలలోపల వస్తుంది. జనులారా! వినండి నా పలుకు. దాన్ని ఆదరించండి. నాల్గునెలల్లో నే తప్పక వస్తుంది. దిగు లెందుకు మీకు. కాంగ్రెస్సుదే ఇంకరాజ్యం అవుతుంది. అయింది కూడా! మూఁడు మాసాల్లో స్వరాజ్యం చేరఁ బాఱుచూ వుంది.'

స్త్రీ. వ్య. 'అదే మండీ, ఈపలుకులు వింటే వెఱ్ఱివాని పలుక లనిపించుకొంటున్నవే. ఈపిచ్చపలుకు లెవ రవ్వా విన్నవాళ్లు?'

వేం. 'ఏంచెప్పను తల్లీ ఇంకా ఆమహాత్ముని చోద్యం, విను తల్లీ విను.'

స్త్రీ. వ్య. 'వింటా చెప్పండి.'

వేం. 'రెండుమాసాల్లో స్వరాజ్యం వస్తుంది. ఏలినవాఁ కింక పన్నులు కట్టవద్దు. పరదేశవస్త్రాలు కట్టవద్దు. ఆవస్త్రాలంతా తెండి. తగలబెడతా నన్నాఁ డామహాత్ముఁడు.'

స్త్రీ. వ్య. 'వస్త్రాలు తగలబెట్టా డండీ?'

వేం. 'ఆబట్టలు తగలబెట్టడం అప్పుడు చూచినట్టిన్ని విన్నట్టిన్నీ జనులందఱున్నూ, ఏ మని ఊహించు కొన్నారు తెలుసునా నీ కమ్మా?'

స్త్రీ. వ్య. 'నాకేం తెలుసును? మీ రీచిత్రాలు చెప్పిన మీఁద నేనున్నూ నాచిన్నతనంలో 'గాంధికి జై గాంధికీజై' అని కేక వేస్తూ వెఱ్ఱిపట్టినదానిలాగా ఎగిరినా నండీ. ఇప్పుడు నా కదంతా జ్ఞప్తికి వస్తూ వుంది. ఆవెనుక?'

వేం. 'అల్లప్పుడు లంకను తగలఁబెట్టిన ఆంజనేయస్వామి ఈ గాంధిగా అవతరించినాఁ డని అన్నా రమ్మా. 'తోఁకను రాక్షసులు తగలబెట్టారు. తోఁక అప్పుడు కాలిపోయింది. ఇప్పుడు తోఁక లేనిఆంజనేయుఁ డీ గాంధి' అంటూ ఆతనికి దండాలు పెట్టారు. తోఁక లేనిగాంధి ఆంజనేయుఁ డనేదండకం ఒకకవి చేశాఁడు. దాన్ని విన్న వీరాంజనేయోపాసకుఁ డొకఁడు లేచినాఁడు. ఎగిరినాఁడు. తోఁక లేనిఆంజనేయుణ్ణి నేనే అని అన్నాఁడు. ఆవేశం వచ్చింది. ఆవెనుక గాంధిఆజ్ఞాప్రకారం వేసినబట్టల మంటలో ఎగిరి వున్నట్టుండి దూకినాఁడు. వొళ్ళు కాలింది. 'తోఁక లేనిఆంజనేయస్వామీ నన్నేలుకో' అంటూ గాంధిని తలఁచుకొన్నాఁడు. మ్రొక్కినాఁడు. కాసు లేస్తా నన్నాఁడు. ఆలోపల ఆతని స్థితి చూచి మాదొడ్లో అరటిచెట్లుంటే నేను అరటిపచ్చిపట్టలు రోట్లో వేసి దంచి ఆరసం పిండి వానివొళ్ళికి అంతా పూశాను. ఆరసంతో స్నానం చేయించాను. అపట్టలంతా వానివొళ్ళిమీద కప్పినాను. ''మంట చల్లారిం'' దంటూ ''తోఁక లేనిఆంజనేయస్వామి అయి వుండేగాంధిమహాత్ముణ్ణి గన్న తోఁక లేనిఅంజనీదేవివి నీవే'' అంటూ నాకాళ్ళ మీఁదఁబడి మ్రొక్కులు పెట్టినాఁడమ్మా. ఏమిచెప్పను ఓతల్లీ ఆగాంధియొక్క మాయ.'

స్త్రీ. వ్య. 'ఇంకా ఏంచేశాఁ డీతోఁక లేనిఆంజనేయ స్వామి?'

వేం. 'జనవరిపండుగ లొచ్చాయి. అప్పుడు రీడింగు

ప్రభువు రాజప్రతినిధి అంట. అతఁడు కలకత్తా కాపందుగల కేగాఁ డఁట! ఆప్రభువుచిత్తాని కందే టట్లు ఈలాజాబులు వ్రాశాడంట.'

స్త్రీ. వ్య. 'ఏమంటూ వ్రాశాఁడో ఈతోఁక లేనిమన ఆంజనేయస్వామి, ఆప్రభువునకు ?'

వేం. 'ఓ.రీడింగూప్రభువా! నాపలుకు వినుకో. ఆప్రకారం నడుచుకో. లేకపోతే బ్రిట్టిషుదొరతనానికి తోఁక ఆడించడాని కీమాదేశంలో ఇంక వీలుండదు. నీ కెందుకోయి ఓ.ప్రభువా నెలనెలకు ఇరవై వేల రూపాయలజీతం ? మీరాణువు కింత ఖర్చెందు కెక్కడ ? చెన్నపురిరాజ్యభాగం, బొంబయిరాజ్యభాగం, కలకత్తారాజ్యభాగం, —ఈలాటిరాజ్యభాగాలు పాలించేగవర్నరులకు నెలనెలకు పదివేల రూపాయిలెందు కియ్యడం ? అయిదేండ్లకాలం మీరిక్కడ వుండడం. దానికిగాను మీకు నెలనెలకు అయిదువేలు, పదివేలు, రూపాయలు పెన్షను ఎందుకోయి? వోప్రభువా మీకింతజీతం మీకింత సిబ్బంది ఎందుకు? ప్రయివేటుసెక్రటరీలు—యైడికాంగులు-మిలిటరిసెక్రిటరీలు - ఇంతసిబ్బందెందుకు? వీళ్ళకు ఇచ్చేజీతం పద్దముత్తం ఎక్కడనుంచి తెచ్చి ఇస్తావోయి వోప్రభువూ! ఇంగ్లండులో ష్వంటే హోంగవర్నమెంటు 'నీముద్దుమొగం గరుడసేవ' అంటూ నీకు తా తెచ్చి వెంకటేశ్వర్ల ముడుపులాగా నెలనెలకు వేలకొలదిజీతా లిస్తూ వుండంటోయి వో ప్రభువా? మాసొమ్మేగాదా నీవు దిగ్రమింగడం? మీ వాళ్ళు కబళించడం. లాంకషైరు మావాళ్ళనోట్లో మట్టికొట్టి అరవై కోట్లరూకలు దిగ్రమింగడం, ఏటాయేఁటా. అవునా! కాదా? చెప్పవోయి? ఇకమీఁద మీ ఆట లిఁక సాగవు. బుద్ధికలవాడవైతే నీరాణువతో, నీసిబ్బందితో, నీవాళ్లైనగవర్నరులతో, వారి సిబ్బందితో, మీ అయి. సి. యస్సులగుంపుతో, మీ దొరతనానికి పట్టుకొమ్మలుగా వుండే క్రైస్తవ మతగురువులతో, వారిశిష్యులమందతో, ఆంగ్లోఇండియనులతో, లంకాషైరు వస్త్రాలమూటలతో, ఈ రాజ్యాన్ని మాకు వదలిపెట్టి మీచవిటిగడ్డ-ఊసరక్షేత్రం - చెట్టూచేమా లేనిసున్నపురాళ్ళగుట్ట - చవిటిగడ్డఅయిననీతెల్లదీవికి మాతో చెప్పకుండా వెళ్ళు. దీనికి గడువు (Ultimatum) పదిదినాలే. **ఈకాలవ్యవధిలోపల "నీవు పోవుచూ వున్నావుమండీ తోఁకలేనిఆంజనేయస్వామి ఓ గాంధిమహాత్ముఁడా" అంటూ మాకు ప్రత్యుత్తరం వ్రాయకపోతే అప్పుడు చూడు మాదెబ్బ. ఏంచేస్తామో" అని.**

స్త్రీ. వ్య. 'అయితే ఆప్రభువు గాంధికే మని బదులు వ్రాశాఁడు ?'

వేం. 'ఆప్రభువేం దీతనికి బదులు వ్రాయడం ? అతఁ డేడ ? ఈత డేఁడ ?'

స్త్రీ. వ్య. ప్రత్యుత్తరమేమిన్ని వ్రాయలేదా? వ్రాయక వుండరే ఇంగ్లీషుప్రభువులు. చల్లని మంగళికత్తె వారిది.'

వేం. 'వ్రాయడం ఏముంది ? గాంధి తాను వ్రాసినవుత్తరంలో ఇచ్చినాఁడే గడువు (Ultimatum) దాని యొక్క ఫలంగా 'నను నెవ్వతె గాఁ చూచితి' వని ఆ వెనుక సత్యభామ శ్రీకృష్ణునెదుట ఏంచేసిందో దాన్ని గాంధి చెరసాలలో చేశాఁడు. అదే ఆగడువుకు రీడింగు వైస్రాయిప్రభువు వ్రాసినప్రత్యుత్తరంతల్లీ."

స్త్రీ. వ్య. చెరసాలలో సత్యభామంబోలి వర్తిస్తూ వుండవలసిందిగా ఏలినవారినుండి వుత్తరవు వచ్చే కాలవ్యవధిలో గాంధి ఏమిచేస్తూ వుండినాఁడవ్వా?'

వేం. 'ఆలోపల ఆ గాంధి ఏమి చేస్తూవుండినా' డంటూ నివడుగుతూ వున్నావా తల్లి ?'

స్త్రీ. వ్య. 'అవు నవ్వా.'

వేం. 'రీడింగుకుగానీ మరేవైస్రాయిప్రభువుకుగానీ గాంధి వ్రాసినాఁటే ఆలాంటిజాబు దానికిఁ బూర్వం వ్రాసినమగధీరుఁ డెవ్వఁడున్నా లేఁడమ్మా. దాని వల్ల గాంధి కెంతధైర్యం! ఏంత వాక్పటుత్వం! ఎంతస్థైర్యం! చూడడానికి ఈగాంధి లాడిలేడం తగూడా లేఁడు! పుట్టచిన్నదైనా కూతలోతక్కువైంది కాదు. నిశ్చయంగా మహాత్ముఁడే. మహాత్ముఁడు కాబట్టియే ఆఫ్రికాలో వుండే తెల్లోళ్ళతో అసహాయోద్యమాయుధంతో యుద్ధంచేశాఁడు. జయభేరి ఆడ వేశాఁడు. అమేధ్యం ఎత్తాఁడాడ. ఇకనేం మనకు తక్కువ? ఈడాకూడా ఆలాగే అసహాయోద్యమాయుధంతో ఇంగ్లీషోళ్ళను తరిమేస్తాఁడు. స్వరాజ్యం తప్పక వస్తుంది' అంటూ ఆగాంధికి బొగిడింపులు వేశారు. గోఖ్లేశిష్యులు గాంధికి వెఱ్ఱి పట్టిందన్నారు. వీళ్ళను గాంధిశిష్యులు తెంపులేని పందలని నిందించారు. అప్పుడు ఇంగ్లీషుచదువుకొన్నవిద్వాంసులకు కలక దేఱింది. "వైస్రాయిగారి ప్రత్యుత్తరం ఇంకా రాలేదా? ఇంకా రాలేదా? గడువు పదిదినాలైందే. ఇంక గాంధి ఏంచేస్తాడో మనకు చూడవలసివుంది. రీడింగుకు భయపడి గాంధి ఆప్రభువుతో రాజీ చేసుకొంటాఁడా? ఛీ! చేసికోఁడు. అంతపిఱికికాఁడు.'

అంటూ బహువిధాల ఆవకీల్లపండితులు సాయంకా లాల్లో కాఫీక్లబ్బులలో తలపోసుకొంటూ వుండిరంట!'

'గాంధి తనజండా ఎత్తినాఁడు. రాట్నాలు వడ్లంగులు చేశారు. నూలు వడికారు. ఆరాట్నాలు మూలల్లో యిప్పుడు చేరి లాంకషైరుధాటికి జడిసి దాగి వున్నవి తల్లీ!

'వైస్రాయి బదులు వ్రాయ లేదు. నేనుపెట్టినగడువు కాలంగూడా దాటింది. కాంగ్రెస్సుజండా ఎత్తినా. స్వరాజ్యం వచ్చింది. చూడండి నాదెబ్బ. వైస్రాయి దేశీయమహాజనసభ కోడినాఁడో. ఆసభ వోడిందో. ఆకాశం చూడం డన్నాఁడు. 'స్వరాజ్యనిధికి కోటిరూపాయలియ్యడ మే కోఱవ. ఆసొమ్మిచ్చారంటే స్వరాజ్యం వచ్చిం దనుకోండి.' అంటూ అరచేతిలో వైకుంఠం గాంధి చూపించాడు. అప్పుడే అమ్మో ఏంచెప్పను. మా మేనల్లునిచే నాకు పిడివాటైనవి తల్లీ.'

స్త్రీ. వ్య. 'అయ్యోపాపం! ఆవెనుక ?'

వేం. 'మాయింట్లో రెండుమంచిగిత్తలుండేవి. అమ్మకుండా వుంటే బండికి వుపయోగించి వుండేవి. వాటిని వాఁడమ్మి తిలకుస్వరాజ్యనిధికి రెండు వందలరూపాయ లిచ్చినాఁడు. మావంటిబీదకుటుంబాల కారెండువందలరూపాయలు రెండుకోట్లరూపాయ లే సుమీ. కష్టసుఖా లెఱుఁగకుండా ఆపెద్దమొత్తం ఇచ్చినాఁడు తల్లీ. పొలం నాలుగెకరా లుంటే, ఆపొలాన్నీ కూడా అమ్మచూపాడు. అయితే వానిమేనమామ కొనేవాళ్ళను దాన్ని కొనకుండా చేశాడు. దానివల్ల ఆపొలం ఇప్పుడు పుచ్చుకాస్తూ వున్నది. లేకుంటే చెంబుతెల్లగా తోముకోవలసినవాఁడే అమ్మో! (అను చుండఁగాఁ దత్పూర్వము మాటలాడు చుండినజంధ్యాలశేషమ్మసోమిదేవమ్మ వారిమాటల నందుకొని) వాస్తవ మమ్మో వాస్తవం. నాతమ్ముడు కూడా ఆ అగ్గిలోఁ బడ్డాఁడు. మిడుతయినాఁడండి. రివిన్యూ ఇన్స్పెక్టరుద్యోగం చేస్తూ వుండేవాఁడండి. గంపెడు పిల్లలు కలవాఁడే తల్లీ. పెద్దలు సంపాదించి పెట్టిన ఆస్తిపాస్తీ లేదు. లంచాలగొండికాఁడు. అందువల్ల ఏపై అధికారి వచ్చినా మాతమ్ముఁ డంటే ప్రాణం విడిచేవాఁడు. రైతుల నోట్లో నాలుకగా వుండేవాఁడు. పెద్దపిల్ల పెండ్లికెదిగి ఇంట్లో వుండెను. దానికి పెండ్లి చేయవలెనని వరుణ్ణి అన్వేషిస్తూ వుండినాఁడు. వుద్యోగాలు విడిచిపెట్టితే హిందూదేశానికి స్వరాజ్యం వస్తుం దని గాంధి దేశీయమహాజన సభచేత అనిపించే అన్నమాట అతఁడు విన్నాఁడో లేదో వానిదేహం వానికిఁ దెలిసిందికాదు. స్వరాజ్యం వచ్చినలాగే భావించాఁడు. మాతో ఎవ్వరితోను చెప్పకుండా, కన్నబిడ్డల రక్షించేభారం తలచకుండా, పెండ్లి కీడైన పిల్ల వివాహం చేయవలె నన్నపూఁట తనకు లేనట్లుగాను, తన్ను నమ్మి పొరుగింటినుంచి వచ్చిన యిల్లాలిని కాపాడేబాధ్యత తనకు లేనే లేనిలాగునను నెలపుట్టేసరికి అరవైరూపాయలరొక్కం చేతిలో పడవేసే వుద్యోగ మనే కామధేనవును తఱిమివేసినాఁడండి. వద్దని తహల్‌శీర్‌దారుఁ డన్నాఁడు అతఁడాలా అనేటప్పటికి 'దేశాభిమానం లేదు నీకు వుద్యోగం లేకపోతే బ్రతకడానికి నీకు త్రోవ తె[లి]యదు. బ్రాహ్మణ్ణి. చెంబు తోముకొంటే మాకుంటుంబా న్నేకాక, నీ కుటుంబంవంటి యెన్ని కుటుంబా లెన్నింటినైనా పోషించ జాలనా నేను?' అ తహశీల్దారుణ్ణి నాలుచీవాట్లు పెట్టాఁడు. వుద్యోగ పోయింది. గాంధితో కొన్నా ళ్ళు రేగాఁడ 'ఇంగ్లీషుదొరతనం శనిదొరతనంవంటిది' అని గాం[ధి] అంటే, నాతమ్ముఁడున్నూ, వానింబలె వుద్యోగాలను వకీళ్ళవృత్తులను, బళ్లను, వదలినవాళ్లందఱున్నూ ఆపాట నే పాడినారు. దొరతనంవారికి వీళ్ల[మీద] ఆగ్రహం పెల్లురేఁగింది. ఏమిచెప్పదునూ తల్లీ! వి[చా]రి వెట్టి. పోలీసువారిచేత తిన్నకఱ్ఱదెబ్బలకు లెక్క లేదు. ఒళ్లంతా కాయలు కాచివున్నవి. మాతమ్ము[ని] శరీరం మంచినిమ్మపండువన్నె వంటిదిసుమీ. వా[ని] శరీరంమీఁద కనుఁబడే ఆదద్దులు నల్లత్రాఁ[చు] పాములున్న ట్లున్నవి. అవి మాసిపోలేదుసుమీ స్వరాజ్యసంపాద్యం చల్లబడ్డది.'

వేం. 'అయితే మీతమ్ముఁ డిప్పుడెక్కడ వున్నాఁడు జీవయాత్ర ఏలాగా నడచుచూ వుంది? పిల్లకు పెం[డ్లి] అయిందా?'

జం. శే. సో. 'ఇప్పుడెక్కడ వున్నా డని చెప్ప గలను? మాతాతముత్తాతలు సంపాదించిపెట్టిన [మ]ణాచి ఏమిన్నీ లేదు. అయితే ఒకవూరిగుడిసె కలదు అందు వాఁడు వానిసంసారంతో వున్నాఁడు చిన్నప్పుడేడవయేఁటనే వానికి వడుగు చేసి [మా] నాన్నగారు వానికి వేదవిద్య నేర్పినారు. అది ఇప్పు[డు] వానిపుచ్చె కాస్తూ వున్నది. ఏదో ఒకవిధాన పస్తు [ఉం]డక జీవయాత్ర చేసుకొంటూ వున్నాఁడు. బా[ల్య]దశలో వాఁడూరకుండక సంస్కృతభాషలో పం[చ] కావ్యాలు నేర్చుకొన్నాఁడు. ఆభాషలో సాహిత్య[ము] కద్దు. స్వగ్రామంలో నే సంస్కృతాంధ్రపాఠశా[ల] పెట్టి సంస్కృతాంధ్రములను బాలురకున్నూ, బా[లి]కలకున్నూ, చెప్పుచూ వున్నాడు. నాన్‌కోఅప

షన్‌లో చేరినాఁడనే నేరంవల్ల మొదట డైరెక్టరు దొరవారు గ్రాంటియ్యడం లేదన్నారు. అయినా గ్రామస్థులందఱున్నూ అర్జీ పెట్టుకొన్నారు. దానివల్ల దొరవారు గ్రాంటియ్యడాని కొప్పుకొన్నారు. సాలుకి రెండువందలరూపాయలు గ్రాంటు చిక్కుతూ వుంది. జోశ్యం తెలుసును. దానివల్ల వానికిఁ బూటకష్టం లేకుండానే దాటిపోవుచూ వుంది. పిల్లకుగూడ జైలునుండి వచ్చినవెనుక పెండ్లి చేసినాఁడు. ఆపిల్ల అదృష్టం మంచిదే. శీలవతి, రూపవతి, శుద్ధశ్రోత్రియకుటుంబంలో బుట్టింది. దానివల్ల పదేండ్లకు లోపలనే మాగ్రామానికి సమీపంలో వున్న వేదారణ్యసోమయాజులవారు తనకుమారునకు దాన్ని తీసికొని తనయింటనే పెండ్లి చేసుకొన్నారు. దానికి బుద్ధివచ్చింది. గర్భాధానం జరిగింది. అయిదాఱేళ్ళనుంచి కాపురం చేస్తూవుంది. మగబిడ్డ కలిగాఁడు. అది సుఖంగానే మగనితో ముచ్చటగా కాపురం చేస్తూ వుంది. మాతమ్మునకింకా ఇద్దఱు కొడుకు లున్నారు. సంస్కృతాంధ్రములున్నూ వేదమున్నూ వాళ్ళకి మాతమ్ముఁడే నేర్పుచూ వున్నాఁడు. ఇదంతా మహాతపస్వియైనమానాన్నగారియనుగ్రహం. మాతమ్మునిజాతకరీత్యా వానికిఁ గడగండ్లు ప్రాప్తించునంచూ, ముందుగానే గ్రహించియే మాతండ్రిగారు వానికి ముందుగా సంస్కృతాంధ్రాలు నేర్పినారు. వేదంగూడ వానిచేత అధ్యయనం చేయించారు. వుద్యోగంపోయినా ఆకారణంవల్ల బ్రతుక నేర్చి వున్నాఁడు. దీని కంతా దీర్ఘదృష్టి వుండవలె. గ్రుడ్డెద్దు చేలోబడ్డట్లు ప్రవర్తించరాదు. ఇంగ్లీషు వొక్కవిద్యనే నేర్చి దాన్నే నమ్మి వుంటే ఈకలికాలంలో ఆఁకలిచిచ్చువల్ల బాఁపలకు మాడి చావవలసిందే. పూర్వం వ్యవసాయం హిందూదేశస్థులకు వృత్తిగా వుండినా, ఆయాయి కులస్థులకు వారివారికులవృత్తులు దాని కంగంగా వుండేవఁట! దానిచేత నిర్వ్యాపారంవల్ల ఇప్పుడు కల్గుచుండే చిక్కు అప్పుడు లేకుండిందంట!' (అనుచుండఁగా వేఱొకపాలుత) 'శేమమ్మసోమిదేవమ్మగారూ! మీతమ్ముఁడుగారింబోలియే మా చెల్లెలిపెనిమిటిన్ని అసహాయోద్యమాగ్నిజ్వాలాన పడ్డాడు. మలమలమాడి పోయినాడండి' (అని కన్నుల నీళ్లు పెట్టుకొనెను.)

జం. శే. సో. 'పార్వతమ్మగారూ! కండ్లలో నీళ్ళు పెట్టుకోవద్దు తల్లీ. ఏమి చేయగలం? మనకు శుభాశుభము లెప్పుడున్నూ పూర్వకర్మము ననుసరించి కలుగుచూ వుంటవి. ఈవిషయంలో గాంధికానీ మఱి ఎవ్వరైనాకానీ నిందకు పాత్రులు కారు తల్లీ. మీ చెల్లెలిపెనిమిటి ఇందుఁ బ్రవేశించాఁడా?'

పార్వ. 'సోమిదేవమ్మగారూ! కొంచెం హెచ్చుతక్కువగా మీతమ్ముఁడుగా రావుద్యమంలో ప్రవేశించినారుగదా! ఆసందర్భంలో నే మామఱిదిన్ని ప్రవేశించి వుంటాడనుకోండి. కొంతభేదం వుంటుందేమో!'

జం. శే. సో. 'అదేలాగా?'

పార్వ. 'ఏమి చెప్పను? (కనులకొలుకులలోనీళ్ళుజలజలమని రాల) నా చెల్లెలిపెనిమిటి స్వరాజ్యం సంపాదించేవుద్యమంలో గాంధితో చేరినాఁడు. ఇంటర్మీడియేటుపరీక్షలో మొదటితరగతిలోకృతార్థుఁడైనాడండి. బి.ఏ. తరగతిలో చేరినాఁడు. చేరీ చేరకముందే గాంధి "స్వరాజ్యం జెండాఎత్తాను. దాన్నిగడించేదానికై చదువుకొంచూ వుండేకుఱ్ఱవాళ్ళందఱున్నూ చదువు వదలవలె" నని దేశీయమహాజనసభచే తీర్పుచేయించాఁడు. అంత ఆంధ్రదేశాన పెద్దగొడవ పుట్టింది.'

జం. శే. సో. 'వొక్క ఆంధ్రదేశాన్నే ఆగొడవపుట్టిందా?'

పార్వ. 'అన్నిరాజ్యభాగాల అది పుట్టినా, పుట్టక పోయినా, ముందుముందుగా ఇట్టివన్నీ ఎక్కడనో పుట్టి వ్యాపించడానికి సాధనంగా ఆంధ్రదేశాన్ని వుపయోగించుకొంటూ వుంటున్నవి.'

జం. శే. సో. 'ఎందుకు?'

పార్వ. 'ఆంధ్రులు క్రొత్తవుద్యమం అంటే ముందుగ గంతు లేస్తారు. మేలుకీళ్లు వాళ్లు ముందుగా తలంచరు. పాపం అది వారిస్వభావం.'

జం. శే. సో. 'ఆవెనుక?'

పార్వ. 'ఈపాడుచదువు నాకెందుకు? పుణ్యమా పురుషార్థమా? దాన్ని విడిస్తే స్వరాజ్యం వస్తుంది. దేశాభిమానం గలవాణ్ణి. కావున చదువు వదలేస్తా' అంచూ బి. ఏ. చదవడానికి చెన్నపట్నానికిఁ బోయి కాలేజిలో జీతం కట్టి తరగతిలో చేరినవాఁడు, వున్నట్టుండి ఇంటిలో దిగబడ్డాడు. 'మొన్న చెన్నపట్నానికి పోయినవాఁడవు చదువుకోక ఎందుకురా వచ్చేశినావు' అని మానాన్నగారల్లుణ్ణి అడిగినారు. 'నాన్ కోఆపరేషన్‌లో' చేరినాను. దానివల్ల చదువుకు నీళ్లు వదలేశాను. గాంధిమహాత్మునితోఁ జేరి స్వరాజ్యం సంపాదిస్తానం టన్నాఁడు. ఎవరు చెప్పినా విన్నవాఁడు కాఁడు. పిల్లరండ. తూర్పుపడమరలు తెలియ

వాయె. ఇంక గతి ఏది? చదువూ సంధ్యా మట్టిలో కలిపాడు.'

జం. శే. సో. 'మీసోదరిని వాని కిచ్చి పెండ్లి అయిం దెప్పుడు?'

పార్వ. 'ఇంటర్ పరీక్షకు చదువుచూ వుండగా మా నాన్నగారు మా చెల్లెలి నిచ్చి వానికి వివాహం చేశారు.'

జం. శే. సో. 'చిన్నవాడు. మంచి దే. ఆవెనుక?'

పార్వ. 'ఆప్రకారం కాలేజి వదలేశాడు. పెండ్లిలో మా నాన్నగారు వాని కిచ్చి వుండే మంచిమంచిపట్టు బట్టలను ప్రోగుచేసి 'నాషనల్ ఫెస్టివల్'లాం 'కస్టె ర్నర్తకులనోట్లో మట్టి ఇంకా' అంటూ భోగిపండుగ నాడు వేసే మంటలో వేశాడు. ఆవెనుక?'

జం. శే. సో. 'ఏం చేశాడు?'

పార్వ. 'మీతమ్ముడు గాంధికి వప్పచెప్పినపాద మే నా చెల్లెలి పెనిమిటికిన్నీ వప్పచెప్పాడు. (జలజలరాలు చుండుకన్నీటి తుడిచి వైచి) 'కారాగృహప్రాప్తి అయింది. 'శ్రీకృష్ణజన్మభూమికి పోవుచూ వున్నా నండి. దిగులు పడ వద్దండి. బిన్నా వస్తాను లేఁగా' అంటూ, పోలీసువాళ్ళకఱ్ఱదెబ్బలకు గురియై వేలూరుకు వెళ్లాడు. ఇరువదేండ్లవాడండి. పండంత కాపరం. ఆహా, రాగిసంకటి వానికి వొంటబట్టింది కాదు. జ్వరం. నెత్తురుభేదులు. శల్యగతమైనాడు. వైద్యులు వానినాడిని పరీక్షించి యింటికి పంపే శారు. ఇంటికి వచ్చినవారం దినాలలోపల నే శ్రీకృష్ణ జన్మభూమికిఁ బోయివస్తా నన్నవాడు, రుద్రభూమికి బయనం సాగించాడు.' (అని చెప్పి 'ఓ' అని గొంతెత్తి విలపింపసాగెను.)

జం. శే. సో. 'అయ్యో! పాపం. ఆపిల్ల చేసుకొన్న పాపఫల మమ్మా. పార్వతమ్మతల్లీ వూరుకో. చచ్చిన వాళ్ళింక వస్తారా, చెప్పవే? ఏడవకుము తల్లీ.'

పార్వ. 'మనుస్సు దిటవు చేసుకొందా మంచూ యెంత ప్రయత్నం చేసి నా, అది కుదుటబడ్డది కాదు.'

జం. శే. సో. 'ఆ పసిది ఇప్పు డెక్కడ వుంది?'

పార్వ. 'ఎక్కడ వుం దని చెప్పను? మా నాన్నగారి దగ్గఱ నే వుంది.'

జం. శే. సో. 'అత్తగారింట్లో వుండదాని కేమి?'

పార్వ. 'ఆసోదే మని చెప్పను సోమిదేవమ్మగారూ?'

జం. శే. సో. 'పైన...'

పార్వ. పుత్త్రిశోకంవల్ల పీడితులైనమామరిదితల్లిదండ్రులు పుత్త్రిన కపరక్రియలు చేసి రుద్రభూమిం జేరినా రండి.'

జం. శే. సో. 'అయ్యో పాపం. (అని కన్నుల నీరు పెట్టుకొని కొనగోటఁ దుడిచి వైచి) 'ఆవెనుక?'

పార్వ. 'మా చెల్లెలి కర్తవ్యాన మా నాన్నగారు ఆయిద్దఱికిన్నీ పరలోకక్రియలు చేశారు.'

జం. శే. సో. 'వారికి వేరే పుత్త్రిసంతానం లేదా?'

పార్వ. 'లే దండీ లేదు. పుత్త్రికాసంతానమున్నూ లేదు, ఏకపుత్త్రివిషయం. దానివల్ల నే మా నాన్నగారే నా చెల్లెలి కర్తవ్యాన వారి కుదకదానక్రియలు నిర్వర్తించారు.'

జం. శే. సో. ఆలాగా? ఆస్తి ఏమైనా వుందా?'

పార్వ. 'లేక ఏమి? అతిథిసత్కారం చేయడానికిన్నీ. తాను తినేదానికిన్నీ మంచి జీవనం కద్దు. అన్నోదకాలకేమిన్నీ తక్కువలే దండి. పసిది క నండీ. బుద్ధి వచ్చింది. ఇట్టిస్థితిలో వుండేఅనాథలఁ గాపాడడం బహుకష్ట మండీ.'

జం. శే. సో. 'అవు నవును అమ్మా.'

పార్వ. 'ఒంటరిగా అత్తగారియింట్లో ఆపసిదాని వుంచడం వుచితం కాదు. మానంమీఁద దృష్టిక వాళ్లకు అట్లుంచడం అపకీర్తికి కారణం అవుతుంది. అట్లంచూ మా నాన్నగారు దాన్ని తనదగ్గఱనే వుంచుకొని వున్నారు. ఎక్కడికిన్నీ దాన్ని ఆయన పంపరు. నాయొక్క బలాత్కారంవల్ల నాదగ్గఱ పక్షంరినా లుంచుకొంటా నంటే దాని పంపి వున్నారు.'

జం. శే. సో. 'ఇట్టిఅనాథస్త్రీలను గాపాడడం కష్టం తల్లీ. శీఘ్రంగా మీపుట్టింటికి దాన్ని పంపివేయి నీ పెనిమిటిన్నీ పసివాడు.మీూపరి. అపకీర్తికి కడపట నీవు పాలవుతావు తల్లీ. కోపపడబోకు నే నీలాగ చెప్పుతా నంచూ.'

పార్వ. 'మా అత్తగారున్నారు. పెద్దవారు. దాన్ని నిల్ప దాటిపోనీయరు. మీారున్నూ పెద్దవాళ్ళు. ఇట్టి వన్నో మీాకళ్లారా చూచి వుంటారు. మీాస దుపదేశ శిరసావహిస్తా. (ఈమాటలు వినుచుండినపూర్వోక్త హ్మృతవేంకమ్మ' అనువృద్ధపూర్వసువాసిని) సోమి దేవమ్మగారూ! సూర్యోదయం అయి రెండుగడియ ప్రొద్దైంది. మాటలసందడిలో ప్రొద్దెక్కడం తెలియక పోయింది. గాంధియొక్క స్వరాజ్యోద్యమానవలకు సాగకున్నా, ఇట్టి వనేకకుటుంబాలు కూలి గులగులలై పోయినవి, లెక్కకు మిక్కిలిగా వున్న వంటా.'

జం. శే. సో. 'స్వరాజ్య మేమో గాంధియత్నంవ

రాలేదు. ఇఁక రాబోదు, చట్టసభల్లో గాంధిశిష్యు లెంతయత్నించినా? సర్వాధికారం ఇంగ్లీషుప్రభువులచేతులో వుంది. చట్టసభలమూలాన సంపూర్ణ స్వాతంత్ర్యం సాధించడం కుందేటి కొమ్ము నే సాధించడం వంటిది అవుతుంది. వొకటిమాత్రం వచ్చింది.'

పం. 'అదేం దండీ?'

ర. శే. సో. మాలవాళ్ల వల్ల వొత్తుడు తప్పక కలిగింది. మనం మాలవాళ్లమైనాం. నేఁడు మనం అదృష్టం చేసుకొన్నాం. వాళ్ల పొడ ఇంతదాక కనిపించ లేదు.'

వేం. 'మరచినానండి. మాలోళ్లకున్నూ, కాంగ్రెస్సువోళ్లకున్నూ వాగ్వాదం జరుగుతూ వుందంట. ఆడకు పోతా నంచూ మాపిల్లరండ అన్నాఁడు. అందఱకున్నూ ఇండ్లకు పోవచ్చు గదా?'

రం. శే. సో. 'తల్లి పోవచ్చును. రండి పోదాం' (అని స్త్రీవ్యక్తులు నిష్క్రమించిరి.)

స్థలము. ముందు పేర్కొనఁబడిన శ్రీలక్ష్మీనృసింహస్వామి దేవాలయము నెదుట నుండునరుఁగును, దానికి ముందునిసుకదిబ్బలును.

కాలము. అస్తమయమగుటకు జాముప్రొద్దుండును.

లక్ష్మీపుల రామచంద్రారెడ్డి దేశీయమహాజనసభా నాయకులయుపన్యాసము విన వచ్చినతన గ్రామస్థులతో, 'మదీయగ్రామస్థులారా! నాప్రార్థనప్రకారం సభానాయకులవుపన్యాసం వినడానికి వచ్చినందులకు నాకు సంతోషమే కాని మన కందఱకున్నూ గమనింపవలసినవిషయం ముఖ్యమైనం దొకటి కలదు. లేనిపోనివివాదాలు వాళ్లతో పెట్టుకోరాదు. వాళ్లు చెప్పబోయేవిషయం అతిసంగ్రహంగా వుండవలెనంచూ ముందే వాళ్లకు హెచ్చరించి వున్నాను. వాళ్లను అడుగవలసినవిషయం మనకు కొంత గలదు. ప్రశ్నోత్తరపూర్వంగా ఆవిషయా లడిగి వాళ్లవల్ల వాట్ని తెలుసుకొందాం. అయితే మనగ్రామస్థులలో ఓటియ్యడాని కధికారం గలవాళ్లపేళ్లుండేపట్టిక ప్రకారం జనులందఱున్నూ వచ్చి వున్నా రనుకొంటూ వున్నాను. (గ్రామమునసబును చూచి) 'సుబ్బరావు పంతులవారూ! దొరతనంవారు తమకు పంపినఆపట్టిక వుందా?' (అని అడిగెను.)

గ్రా. ము. 'వుంది.'

ల. రా. 'ఆపేళ్లవరుసనే కదా యిచ్చటజనులు పోగై వున్నారు.'

గ్రా. ము. 'ఆప్రకారమే వచ్చివున్నారు.'

ల. రా. 'మాలలకు ప్రత్యేకస్థానం వుందేమో?'

గ్రా. ము. 'వుంది. తత్సంబంధము లైనవరణాలు జరుగును. అయినా కాంగ్రెస్సువాళ్లను కొన్నిప్రశ్న లడుగవలసి వుందంట. దానికిగ్గాను మాలలకంతా ప్రతినిధి వొకఁడు వచ్చి వున్నాఁడు. వాళ్లతో మాట్లాడడానికి మాలలప్రతినిధియైన (అక్కడ దూరాన నిలువఁబడి వుండేమాలసంసారిం జూపి) రాగనికి అవకాశం కలిగించవలసింది.'

ల. రా. 'దాని కేమిఅభ్యంతరం? అలాగే చేయిస్తా. మాగురువులవా రింకా రా లేదేమి?' (అనుచుండఁగా భువనగిరి శేషాద్రిశేషశాస్త్రి) ఆగ్రామమున నుండుబ్రాహ్మణగృహస్థు లొకరిద్దఱు వెంటరాఁ బ్రవేశించును. అక్కడఁ బోగైనజనసమూహము లేచి నిలవఁబడును. ఆప్రకారము వచ్చినవిప్రులం గాంచి) 'బ్రాహ్మణుల కెల్లరకు నమస్కారములు. ఇదో. ఇటు ఇటు. దయ సేయండి' (అని వారల కని నియమించి యుండుచాఁపలఁ జూపెను. అంత వారు వానిపై సుఖోపవిష్టులైరి. రామచంద్రారెడ్డి కూర్చుండఁడని చేసైగఁ జేయఁగాఁ దక్కంగల ప్రజాబృందము కూర్చుండెను. జనసమూహమంతయు మానముద్ర ధరించి యుండును. సముద్రతరంగముల ధ్వనిమాత్రము విన వచ్చుచుండును. తెరలో ''గాంధికీజై! గాంధిమహాత్మునికీ జై! పండిట్ జవహర్లాల్ నెహరుకూ జై!' అనుకూఁతలు వినఁబడును. ఆలోపల దేశీయమహాజనసభ యొక్క జండాలు పట్టుకొనినవాలు రొక రిద్దఱు ప్రవేశించి) 'గాంధికీ జై! గాంధీమహాత్మునికీ జై! పండిట్ జవహర్లాల్ నెహరూకి జై' (అని పలికి ఆజండాలను నక్కడ నుండువేఁపమ్రానునెక్కి దానిమీఁదఁ గట్టి వానికి నమస్కృతు లొనర్చి), 'గాంధీమహారాజికీజై! గాంధీమహాత్మునికీ జై! పండిట్ జవహర్లాల్ నెహ్రూకీ జయి' (అనిరి. ఆప్రకారమనుచుండగా దేశీయమహాజనసభానాయకు లొకకొందఱైదార్గురు స్త్రీవ్యక్తి యొకతె వెంటరాఁ బ్రవేశించిరి.)

ల. రా. (లేచి) 'ఇటు ఇటు రండి' (అని వారికి దారి కలిగింపఁ జేసెను. వారును ప్రవేశించి యరుఁగుమీఁదఁ గూర్చుండిరి. ఎల్లవారును స్వస్థానములందు సద్దు సేయక కూర్చుండి చిత్రింపఁబడినబొమ్మలనం దగి యుండిరి.)

(అంత దేశీయసభానాయకులలో మొదటివ్యక్తి లేచి,) 'రామచంద్రారెడ్డిగారూ! తాము మా కంతా కృపతోనున్నూ ప్రీతితోనున్నూ ఇచ్చినఆతిథ్యం వర్ణనాతీతం. నావెంటవచ్చిన నాయకులకు మారుగా నే నే మాకృ

తజ్ఞతాపూర్వకానేకసహస్రనమస్కృతు లొనర్చుచున్నాను.'

ల. రా. 'దేవరా! తాము చేసినస్తుతికి నేను తగను. మాగ్రామానికి వచ్చినవాళ్లెవరైనా సరే మాకున్నంతలో వాళ్ళకు కడుపార అన్నోదకాలివ్వడం మాకు వంశపరంపరానుగతంగా వస్తూవుండేఆచారం. దాని కింత నన్ను పొగడడం నాకు శ్రేయస్కరం గాదు. ఇఁక జరుగవలసి వుండేకార్యక్రమం దయచేసి సెలవియ్యండి.'

మొ. వ్య. 'ఈసభ కధ్యక్షుణ్ణి వరించుకోవలసిందే మొదటిపని.'

ల. రా. 'బుద్ధి బుద్ధి. దానికేమి లెండి? మాభువనగిరి శేషాద్రిశాస్త్రిగారు నేఁటిసభ కధ్యక్షులుఁగ చేసుకొన్నాం. మీ కంతా యిష్టమా?'

మొ. వ్య. 'చిత్తం. అలాగే కానిండు.'

ల. రా. 'మనం చేసుకొని వుండేవ్యవస్థప్రకారం నేఁటిసభకు మాగురువులవా రధ్యక్షులు. మీ కంతా ఇష్టంకదా?' (అనఁగా జనులలో నొకఁడు లేచి) 'సరె' (అని అనెను. అంత భువనగిరి శేషాద్రిశాస్త్రి లేచి,) 'దేశీయమహాజనసభాసభ్యులారా! స్త్రీరత్నములారా! అస్మద్గ్రామవాస్తవ్యులారా! నేఁటిసభకు నధ్యక్షునిగా మీ రంతాచేరి నన్ను నియమించుకొన్నారు. దానికి మీకు మిక్కిలికృతజ్ఞుఁడను. సభానాయకు లేమి ఉపన్యసింప దలచి వున్నారో, నా కావిషయం తెలియదు. అయినా వొక్కవిషయం వారికి నాకు హెచ్చరిక సేయవలసి వుంది. అదేమందంటే? మే మా పల్లెటూళ్ళవాళ్ళం. నగరాల్లో వసించేనాగరులంగాము. మర్యాదేందో మాకు తెలియదు. మాశిష్యుఁడు వాళ్ళకుఁ జేసి వుండేఆతిథ్యాది సత్కారంలో ఏదైనాలోపం వుండిందంటే, ఆలోపాన్ని సవరించుకోవల్సిందిగా రెడ్డికి మారుగా నేను వాళ్లను వేఁడుకొంచూ వున్నాను. (మొదటి వ్యక్తిం జూచి) 'దేవరా! తాము చెప్పఁదలఁచుకొన్నవిషయం అతిసంగ్రహంగా వుండవలె. మాటలాడడానికి తమ కొసఁగఁబడివుండే కాలవ్యవధి అరగడియమాత్రమే. అరగడియకాఁగానే ఈల తమకు వినఁబడుతుంది. వెంటనే తమవుపన్యాసం నిలిపి మీస్థానంలో మీరు విశ్రమించవలె.'

మొ. వ్య. (తనలో) 'చూడడానికి పల్లెటూళ్లవాళ్లుగా కన్పడుతూ వున్నారు. అయితే సభను నడిపేతీరు చూస్తే బహుళసభలు చేసి నడపినవాళ్ళలాగ వర్తిస్తున్నారు.' (అని ప్రకాశముగా) 'సభాధ్యక్షా! గ్రామవాస్తవ్యులారా! మహిళారత్నములారా! గాంధిమహాత్ముఁడు రాజకీయరంగంలో ప్రవేశించాఁడు. ప్రవేశించి కాంగ్రెస్సుకు అపూర్వం అయి వుండేస్వగౌరవం కలిగించాఁడు. అదెట్లా నంటే? మహాత్ముఁడు కాంగ్రెస్సులో ప్రవేశించడానికి పూర్వం ఇంగ్లీషుదొరతనాన్ని స్వరాజ్యం ఇయ్యవలసిందిగా కాంగ్రెస్సు చేతులు జోడించుకొని, 'ఓ ధేవుఁడా! మేము పాపులం. మాపాపాల్ని తోశేయి. మాకొక్కరొట్టెముక్క ఇయ్యి. అదేచాలుమాకు. ధేముడా!' అని క్రైస్తవులు భగవంతుణ్ణి వేడేలాగా వేడుతూ వుండింది. ఆయన వచ్చినానక అలా వేడడం లేదు. బిచ్చం అడిగే పద్ధతి నిలిచింది. అన్యసాహాయ్యం లేక స్వరాజ్యం తనంతట మనవొడిలో దిగబడేలాగ వొక్కపథం కలిగించాడు. కాంగ్రెస్సు ఆపథం నుంచి దంచూ వొప్పుకొంది. ఆపథంఏంది? రక్తపాతం వుండకూడదు. మనోవాక్కాయకర్మల మూలాన గూడా ఒకమిత్రులకే కాకుండా, శత్రువులకున్నూ గూడా, హింస చేయడం కూడదు. దానివల్ల పూర్వం లేనిస్వగౌరవం ఆయనవచ్చినవెనుక కాంగ్రెస్సుకు వచ్చింది. అస్పృశ్యత తొలఁగించవలసిందంచూ కాంగ్రెస్సు తీర్పు చేసింది. అదిన్నీ కూడా పూర్వం లేనిదే. ఆరెండున్నూ అపూర్వాలే. గాంధిమహాత్ముఁడే ఆరెండుతీర్పులకున్నూ కారకుఁడవుతాఁడు. ఆవెనుక స్వరాజ్యసంపాద్యానికై గాంధిమహాత్ముఁడు కారాగృహానికి బోయాఁడు. ఆయననీడలాగ మేమున్నూ ఆయన్ను వెంబడించినాం. పోలీసువాళ్ళకఱ్ఱదెబ్బలుమాదేహాం రుచి చూచినాయి. స్వరాజ్యసంపాద్యానికొగ్గాను రక్తపాతం లేకుండానున్నూ, ముందెవ్వరున్నూ, ఎప్పుడున్నూ, ఏచోటానున్నూ ప్రయత్నించినలాగ దేశచరిత్రాల్లో ఆధారాల్లేవు. అట్టివొడ్డ దైనసాత్త్వికమార్గంలో స్వరాజ్యానికై ప్రయత్నించింది గాంధి వొక్కఁడే. దానివల్ల అతఁడు మహాత్ముఁడు.' అని ఖండాంతరాల్లో వుండేబహువిధక్రైస్తవసంఘాలన్నీ ఆశ్చర్యపడ్డవి. పడి దంగైనావి. ఆయన్ను అపరక్రైస్తవుడంచూ భక్తిపురస్సరంగా దండాలెట్టారు. ఆయన కీర్తిప్రతిష్ఠలు ఏం చెప్పను? ఖండాంతరాల్లో నలుగడలా నాగజెముడులాగా అల్లుకొన్నవి. ఈలాగా సర్వం స్వరాజ్యానికై అర్పించుకొన్న కాంగ్రెస్సు సభ్యుల నే మీ కంతా వరించుకోవల్సింది', అని. అనుచుండఁగా నీల వినఁబడియె. అంత మొదటివ్యక్తి స్వస్థానమున సుఖోపవిష్టుఁ డయ్యె.)

మననం చేశాను. 'మానం' అనేపదం నాహృదయ వీథినుంచి పరారి చిత్తగించింది. 'స్వేచ్ఛ' అనేశబ్దం దానిస్థానే నిలుచుకొంది. అంత వొక్కచోట ఇంతదాఁక వంచినతలల నెత్తలే దావీరులు శూరులు, ఆ వుత్తర కుమారులు. మహమ్మదీయులకున్నూ హిందువులకున్నూ మాత్రం ఎప్పుడున్నూ వుండేమనస్పర్థ అట్టే వుంది. మాయం కాలేదు. గాంధిమహాత్మునికి కుడిభుజంగా వుండేఆలీసోదరులిద్దఱున్నూ కాంగ్రెసుకు పిక్కబలం చూపారు. అప్పటినుంచి నేఁటిదాక ఏటాయేటా కాంగ్రెస్సు జరుగుతూ వుండేచోట్లకు తప్పకుండా పోతూ వస్తూ వున్నా. ఆఆకర్షణశక్తే కాంగ్రెస్సును వదల వద్దని బోధిస్తూ వుంటుంది, అనవరతం.'

కాంగ్రెసుపార్లమెంటుబోర్డు స్త్రీలకు ప్రతినిధిగా చట్టాలకూటాల్లో వుండేలాగ నన్ను పొమ్మన్నది. కాంగ్రెస్సుచర్య అంతా నాకు తెలుసును. ఆడుదాన్ని. దానివల్ల ధనం మిక్కిలితక్కువగా వ్యయం చేయవల్సిందే అని చట్టకూటాల్లో వాదిస్తా. చేతు[illegible]తిబద్ధలయ్యేలాగా బల్లలను గుద్దుతా. నొప్పెత్తినా చెప్పుకోను. అర్థవిషయం నాకు తెలిసినలాగా పురుషులకు తెలియనే తెలియదు. దానివల్ల నే 'అమ్మాబిచ్చం పెట్టే' అని వచ్చే జోగులమొత్తానికి ఇంట్లో బియ్యం వున్నా 'లే' దనడానిక్గ్గానే స్త్రీజాతిని మన్వాదిస్మృతికర్తలు నియమించి వున్నారంట. 'అతివృష్టివల్లనో, అనావృష్టివల్లనో, వరిపంటలు సన్నగిల్లుతవి.' అని అనుకోండి. కరువంచూ రైతులు ఘోషిస్తారు. పన్నుల్లో కొంత తగ్గిస్తా నంటుందేమో దొరతనం. అప్పుడు మేము స్త్రీలం కావున పన్ను ముదరా ఇవ్వవద్దని నేను దొరతనానికి సలహా చెప్తా. కావున ఓగ్రామస్థులారా! నే నాఁడుదాన్ని. మీ కంతా నన్నే వరించుకో వల్సింది. అనేది నాప్రార్థన. అదే కాంగ్రెస్సాజ్ఞకూడాను. గాంధీమహాత్మునికీ జై. వందేమాతరం.'' (అను చుండ నీల వినఁబడును. అంత స్త్రీవ్యక్తి స్వస్థానమున సుఖోపవిష్టయగును. అటువెనుక సభాధ్యక్షుఁడు 'నా కనుష్ఠానకాలం సమీపించింది. శ్రీలక్ష్మీనృసింహస్వామిదేవాలయంలో అనుష్ఠానం తీర్చుకోడానికి పోయి వస్తాను. నే లేనప్పుడు నాకు మారుగా సభాధ్యక్షునిస్థానాన్ని మాశిష్యుఁడు (రామచంద్రారెడ్డిఁజూపి) ఆక్రమించుకొంటాఁడు, సభాచర్య ముగించండి. నాకై మీ కెదురు చూడ నక్కఱలేదు. (కాంగ్రెస్సు నాయకులంగని) రామచంద్రుఁ డధ్యక్షుఁడుగ వుండడం మీ కిష్టమా?' (అని అడిగెను. అన విని మొదటివ్యక్తి) 'మాకిష్టమే. అయితే సభాచర్య తాము ప్రారంభించారు. తామే కొనవఱకున్నూ వుండి సభాచర్యను ముగించి పోవడం మాకు మిక్కిలిసమ్మతం' (అని అనెను. అంత సభాధ్యక్షుఁడు). 'అది సాధ్యం కాదు. అనుష్ఠానం మాకు ముఖ్యం' (అని నుడివి జనులఁ జూచి) 'సభ్యులారా! రామచంద్రారెడ్డి అధ్యక్షుఁడై వుండడం మీ కంతా ఇష్టం అవునా? కాదా?' (అని అడిగెను) 'మా కంతా సమ్మతమే' (అని వారిలో నొకఁడు లేచి పల్కెను. సభాధ్యక్షుఁడైన భువనగిరి శేషాద్రిశాస్త్రి లేచి,) 'సభ్యులారా! మీసమ్మతిని అనుష్ఠానానికి పోయి వస్తా' (అని కాంగ్రెస్సునాయకులఁ జూచి '(పెద్దలారా! సెలవా! పోయివత్తునా? కొనవఱకుండి సభాకార్యం పూర్తి చేయక పోయినా నని తప్పుగా కొనబోకుఁడు. సూర్యుఁ డస్తమించఁబోవుచున్నాఁడు. క్షమించండి దయచేసి (అని సభకు నమస్కరించి తక్కుంగల విప్రగృహస్థులు వెంటరా నిష్క్రమించును.)

అంత రామచంద్రారెడ్డి సభాధ్యక్షునిస్థాన మాక్రమించుకొని కాంగ్రెస్సునాయకులతో) 'ఇంకను మీ కేమి చెప్పవలసి వుంది? దయచేసి చెప్పండి.' (అని వేఁడెను. అట్లని వేఁడగా వారిలో మొదటివ్యక్తి) 'మాకు చెప్పవలసినవిషయం అంతా చెప్పినాం. మీకు తెలియఁ జెప్పవలసి వుండేఅంశం ఏమిన్ని లేదు. అంత్యోపన్యాసం చేయడానిక ముందుగా,

'నేలఁగట్టుపల్లియ పల్లెటూరువాళ్ళు మ-రా-రా-శ్రీ. లక్షావుల రామచంద్రారెడ్డిగారి యాజమాన్యమునఁ జేసిన సభలో రాబోవునెన్నికలో దేశీయమహాజనసభాసభ్యులచే నియమితులైనకాంగ్రెస్సువరుల నే వరించుకోవలయును' అని చేసిన ట్లొక తీర్పు వార్తాపత్రికల్లో ప్రకటన చేస్తే, దేశం అంతా కాంగ్రెస్సువైపే వుం దనే అభిప్రాయం లోకానికి తెలుస్తుంది?''

ల. రా. 'దేవరా! అట్టితీర్పు తొందరపడి చేయడానికి ముందుగా మా కంతా మిమ్మల్ని కొన్నిప్రశ్నలడుగ వలసి వుంది. వాటి కంతా తాము జవాబిస్తారా?'

మొ. వ్య. 'ఆలాగే మాకుఁ దెలిసినంతవఱకు మీరడుగఁబొయ్యే ప్రశ్నలకు బదులు చెప్తాం.

ల. రా. (అన విని జనుల గాంచి) 'ఓసభ్యులారా! మీ వుత్తరవైందంటే మనకు ప్రతినిధిగా (భీమశంకరమురెడ్డిఁజూపి) యీ సంసారి కాంగ్రెస్సు నాయకులఁ బ్రశ్నలు వేస్తాడు. మీకు సమ్మతమా?'

(అనఁగా విని అందొక వైశ్య ప్రముఖుఁడు లేచి) 'సభాధ్యక్షుఁడా! మాకంతా సమ్మతమే భీమశంకరం రెడ్డి గారు మాకు మారుగా కాంగ్రెస్సు నాయకులను ప్రశ్న లడగడం.''

భీ. రె. దేశీయమహాజనసభా నాయకుల్లో మొదటివ్యక్తిం గాంచి యిట్లనియె:—) ''దేవరా! పూర్వం దౌర్జన్యరాహిత్య అసహాయోద్యమప్రచారం ప్రారంభం అయినప్పటినుండి నేఁటిదాఁక తమకున్నూ కాంగ్రెస్సుకున్నూ సంబంధం వుందా?'

మొ. వ్య. 'వుంది.'

భీ. రె. 'గాంధి దేశీయమహాజనసభను తనఅధీనం చేసుకొన్నాఁడు. ఆవెనుక దానిపేర అతఁడు చేసిన వ్యవహార మంతా తమకు తెలిసియే వుంటుం దనుకొంటా.'

మొ. వ్య. 'తెలిసియే వుంది. పద్దువారిగా సకలవ్యవహారం తెలుసును?'

భీ. రె. 'ఆఫ్రికానుండి గాంధి హిందూదేశానికి వచ్చి ఎంతకాలం అయింది?'

మొ. వ్య. షుమా రిరువదేండ్లుండు నేమో.'

భీ. రె. నాగపూరులో కాంగ్రెస్సు జరిగిందికదా?'

మొ. వ్య. 'జరిగింది.'

భీ. రె. 'అం దప్పు డాదేశీయమహాజనసభ చేసిన తీర్పులన్నీ తమకు జ్ఞప్తియం దున్నవా?'

మొ. వ్య. మరవలేదు. కాని జ్ఞప్తియందే వున్నవి.'

భీ. రె. కొన్ని చెప్పగలరా వాట్ని?'

మొ. వ్య. 'దొరతనంవారికేమాత్రం ఏవిధమైనసాయం చేయఁగూడ దనేది మొదటిది.'

భీ. రె. 'ఈలాంటి వెన్ని వున్నవి?'

మొ. వ్య. 'పది పదునైదుతీర్పు లుండి వుండును.'

భీ. రె. 'వాటిలో అస్పృశ్యతను తొలఁగించవలసిం దనే తీర్పువుందా? లేదా?'

మొ. వ్య. వుంది వుంది. స్వరాజ్యసంపాద్యానికంటే అది ముఖ్యస్థానాన్ని అలంకరించింది. వామనావతారం ఎత్తిననారాయణునిచేయి క్రిందుగానున్నూ బలిచక్రవర్తిచేయి మీఁదుగానున్నూ అయినలాగా స్వరాజ్యం క్రింద బడ్డది; అంటరానితనం పైకి లేచింది.'

భీ. రె. 'కాంగ్రెస్సురాజకీయసంస్థయా? లేదేని ధర్మానికి కట్టుపడ్డ హైందవసంఘాన్ని ధర్మవిరుద్ధంగా మార్చడానికిగ్గాను ఏర్పడ్డ ధర్మవిరుద్ధసంస్థా మీ కాంగ్రెస్సు?

మొ. వ్య. 'రాజకీయసంస్థ. కాని సంఘసంస్కారసంస్థ కాదు.'

భీ. రె. 'తమమాట వాస్తవమా?

మొ. వ్య. 'వాస్తవం కాకేమి?

భీ. రె. 'కాంగ్రెస్సు హైందవధర్మమునకు విరుద్ధసంస్థకానప్పుడు, ఒక్క హైందవసంఘానికే సంబంధించినఅంటరానితనాన్ని మాయం జేయవల్సిం దనే తీర్పును 'రాజకీయసంస్థ' అయి వుంటే కాంగ్రెస్సు చేత చేయించి వుండడం ధర్మమా?'

మొ. వ్య. 'ధర్మమో అధర్మమో. దానితోఁ బని మన కెందు కండి? కాంగ్రెస్సు ఆతీర్పు చేసింది. కావున మన కంతా దాన్ని ఒప్పుకోవల్సిం దనేది విధి. అదన్నీ కాక ఆజ్ఞకూడా. ఎన్నికలు జరిగే కాలంలో అంటరానితనాన్నిగూర్చి తామాలా నొక్కి ప్రశ్న వేయడం వుచితం కాదు.

భీ. రె. 'కాంగ్రెస్సు చేసిం దనేనెపముం బురస్కరించుకొని మీరు దాన్ని ఒప్పుకొంటారేమో కాని ధర్మపరుల మగు మేమంతా దాని చర్యను ఒప్పుకోము. మాకు తృప్తి అయ్యేలాగా ఈ విషయాన్ని గూర్చి వుండేమాసందేహాలు తీర్చండి. ఎన్నికల కాలాల్లో దాన్ని గూర్చిప్రస్తావించవద్దంటే మే మూరకవుండం. మీ జిత్తులు మాకు తెల్సును. ఇప్పుడా విషయం కప్పిపుచ్చడం. రేపు చట్టాలకూటాల్లో కాంగ్రెసుసభ్యులు దాన్ని తొలఁగించడానికి యత్నం చేయడం. ఇది మీరు చేసేతంత్రం. మే మొప్పుకోము. మాకు ధర్మం ముఖ్యం. శాసనసభల మూలాన మీరు సంపాదించబొయ్యేస్వరాజ్యం మాకప్రధానం. దానివల్ల రాజకీయసంస్థగా వుండేకాంగ్రెస్సు చేత అస్పృశ్యతను తొలగించవల్సిం దనే తీర్పును మీ రంతా ఏలా చేయిస్తారు?'

మొ. వ్య. 'అంటరానితనం హైందవసంఘానికి కళంకం. ఆ మచ్చ మాసిందంటే, అందఱున్నూ ఒక్కరగ మవుతాం. అప్పుడు స్వరాజ్యం సులభోపాయాన వస్తుంది. అది అట్లే వుండిం దంటే, స్వరాజ్యం రాదు.'

భీ. రె. 'ఎందు కని.'

మొ. వ్య. 'ఆఫ్రికా', 'ఫిజి', 'మారిషెస్'—ఈలాంటి పరరాజ్యభాగాల్లో హిందూదేశస్థులుగా వుండే కూలీలమొత్తాలనేకా లున్నవి. ఆదేశాలు తెల్లదొరతనంలో వుంటున్నవి. వాళ్లు అక్కడకూలీ చేసుకొంచూ వుండే హైందవకూలీలను మిక్కిలిగా అగౌ

రణం చేస్తారు. వాళ్ళ కుండే హక్కులవంటిహక్కులు హైందవకూలీలకు లేవఁట.'

భీ. ర. 'ఏల లేవు?'

ము. వ్య. 'వాళ్ళు తెల్లవాళ్ళఁట. వీరు నల్లవాళ్ళఁట. వీళ్ళను వాళ్ళు పాలించేకార్యానికై ఈమర్త్యలోకంలో పుట్టి వున్నారఁట. దాన్నివల్ల వాళ్ళు హెచ్చంచున్నూ వీళ్ళు తక్కువ అంచున్నూ వాళ్ళు వాడుచూ వీళ్ళను నీచంగా భావిస్తారఁట.'

భీ. ర. 'హిందూసంఘంలో వుండేఅంటరానితనానికన్నీ, పరదేశాల్లోకూలి చేసుకోడానికి వెళ్ళి వుండే హైందవకూలీలను ఆడ వుండే తెల్లోళ్ళు నీచంగా భావించేదానికిన్నీ సంబంధమేముందయ్యా! ఓకాంగ్రెస్సుఘనుఁడా? పీర్ల పండుగకున్నూ, మహాశివరాత్రికిన్నీ సంబంధమేముందయ్యా?'

ము. వ్య. 'ఆపరదేశాల్లో వుండేహైందవకూలీలకున్నూ తెల్లోళ్ళకు కలిగి వుండేహక్కులన్నింటిన్నీ ఎందుకు కలిగించకూడదంచూ అడిగితే, వాళ్ళున్నూ, వాళ్ళకి పైబడివుండేహోంగవర్నమెంటున్నూ, 'హిందూదేశంలో అంటరానివాళ్ళకు సమానాధికారం మీరు హైందవసంఘంలో కలిగించారా? లేదే. వాళ్ళను మీరు నికృష్టులంచూ దూరాన వసించేలాగా చేశి వున్నారఁట. అదేల? వాళ్ళను దగ్గఱకు రానియ్యరంటే. అదెందుకు? అని తిరుగ ఇక్కడ వుండి అడిగినవాళ్ళకు ప్రత్యుత్తరం చెప్పి హిందూకూలీలకు తమ కుండే హక్కులవంటిహక్కులను కలిగించం అంచున్నారంట.'

భీ. ర. 'ఆకారణంవల్ల నా హిందూసంఘంలో వుండే మాలవాళ్ళకనాదినుంచి ఆచారంలో వుండేఅంటరానితనాన్నిఎత్తేయవల్సిందంచూ కాంగ్రెస్సుచేత గాంధి చేయించింది.'

ము. వ్య. 'అవును. ఇంతేకాకుండా. హిందూదేశాన్ని పాలిస్తూవుండేపార్లమెంటుద్వయాన్ని 'మాకు స్వరాజ్యం ఇవ్వండి. మాదేశాన్ని మీయండను మేమే పాలించుకొంటాం.' అని హిందూదేశస్థులు బహుకాలంగా అడుగుచూ వస్తూ వున్నారు. అయితే వాళ్ళియ్యడం లేదన్నారు.'

భీ. ర. 'ఎందువల్ల?'

హెచ్చుతక్కువలు.

ము. వ్య. 'హిందూదేశస్థులు ఒక్కజాతీయప్రజాసమూహంగాదు. హిందువులున్నారు. తురకలు కలరు. క్రైస్తవులుంటున్నారు. పార్సీకులున్నారు. జైనులు సీకులు, ఈలాంటిభిన్నమతస్థులనేకులున్నారు. వాళ్ళంతా ఎప్పుడున్నూ పోట్లాడుకొంటూ వుంటారు. వాళ్ళలో అయికమత్యంలేదు. మేముంటే అయికమత్యం వుంటుంది. జగడాలుండవు. మేము హిందూదేశాన్ని పాలించడం వల్లనే శాంతినాటుకొంచూ వుంది. యేం లేకుంటే మీగతియేమై వుండివుండునో మీఆత్మారాముణ్ణే అడగండి. అయినా మీరేమో స్వరాజ్యం అడిగారు. మీమాట తోసివేయడం మంచిదికాదు. బ్రహ్మ కుంభకర్ణునకు వరాలిచ్చినట్లు పదేండ్లకొక్కతడవ కొంచెం కొంచెంగా మాకు తోఁచినంత ఇస్తూ వస్తాం. అజీర్ణరోగి వణ్ణం తినేలాగా. స్వరాజ్యం చేసుకోడానికి మేము మీకు నేర్పిస్తాం. మీరున్నూ నిదానంగా, మూగవాఁడుమాట్లాడ నేర్చుకొనేలాగా, స్వరాజ్యం చేసుకోడానికి మావల్ల నేర్చుకోండి. ఏంపాసిపోయింది మీ కిప్పుడు స్వరాజ్యం లేకపోతే? మేమున్నాంగాదా హిందూదేశాన్ని పాలించడానికి?' అని చెప్పారు.''

భీ. ర. 'వొక్కహైందవుల కే సంబంధించినఅంటరానితనం మాయం చేయడానికి కాంగ్రెస్సుచేత గాంధి చేయించినతీర్పుకున్నూ, మీపలుకులకున్నూ సంబంధం లేనే లే' దే! ఏం దీమాటలు?'

ము. వ్య. 'ఏలా సంబంధం లేదు? హిందువుల్లో మాలవాళ్ళున్నారు. వాళ్ళను దూరాన వుంచి వున్నారు. వాళ్ళు మీదగ్గఱ కొచ్చేసి మీతో అంతాకలిసి భేదం లేకుండా వుంటే, స్వరాజ్యం ఇస్తాం' అని అన్నారు బ్రిట్టిషుప్రజలు. దానివల్ల అంటరానితనం మాయం చేయడానికి ప్రయత్నం.'

భీ. ర. 'పార్లమెంటుద్వయమా! మాకు స్వరాజ్యం ఇయ్యవే. మాదేశాన్ని మేము పాలించుకొంటాం' అని మేము తెల్లోళ్ళను వేఁడజాలం. సొంతంగానే అన్యసాహాయ్యం లేక స్వరాజ్యం సంపాదిస్తాం.' అన్నమీగాంధి 'స్వరాజ్యం ఇయ్యవల్సిందంచూ పార్లమెంటుద్వయాన్ని ప్రార్థిస్తాఁడా? ఇదేటి మాట? హైందవసంఘంలో వుండేఅంటరానితనం పోయిందంటే, మేము స్వరాజ్యం ఇస్తామంటుందా, ఆపార్లమెంటుద్వయం? చెప్పివుండదు. ఆలా ఎప్పటికిన్నీ చెప్పదున్నూ కూడా.'

ము. వ్య. 'ఏల చెప్పదు?'

భీ. ర. 'ఆడితప్పడం తప్పనేది వొకకారణంగా అయినా వుండవచ్చును. అది లేకుంటే సనాతనధర్మానికి బద్ధులై వుండేహైందవులున్నూ, అధర్మాన్నే అనుష్ఠిస్తూ వుండే మీగాంధిన్నీ ఆతనిసహచరపంక్తు

లున్నూ, ఈలాంటికొన్నిసమాజాలున్నూ, పరస్పరం జగడాలాడుచూ వుంటారు. కడుపులో చల్ల కదల కుండా మనకు హిందూదేశాన్ని ఏలుతూవుండ వచ్చును.' అనేభావంతో అయినా చెప్పివుంటుంది. అట్టి యేలినవాళ్ళమనోగతమర్మం తెలుసుకోక గాంధి కాంగ్రెస్సుచేత అంటరానితనాన్ని తీసివేయించడం ముఖ్యం అంచూ చెప్పించింది అవివేకం. అవునా? కాదా?'

మొ. వ్యా. 'ఆలా కాంగ్రెస్సుచేత గాంధిమహాత్ముఁడు చెప్పించింది అవివేకం అంచూ నేను చెప్పజాలను. అయినా తాము సెలవిచ్చింది సైతం కొంతవఱకు వాస్తవంగా నే వుంటుంది.'

భీ. రె. 'కొంతవఱ కనడం ఎందుకు? పూర్తిగా నే అని అనండి.'

మొ. వ్యా. 'ఆవెనుక మీప్రశ్న?'

భీ. రె. 'ఇప్పుడడుగుచూ వుండేవిషయం తెగితే కాదా వేఱొకఅంశం అడగడానికి వీలుంటుంది. అంటరానితనం హిందూదేశంలో మాయం అయిందంటే, దక్షిణాఫ్రికా—ఈలాంటిపరరాజ్యభాగాల్లో కూలి చేశి జీవిస్తూ వుండేహిందూకూలీలకు అక్కడ వుండే తెల్లవాళ్ళ మొత్తానికి వుండేహక్కులవంటిహక్కులన్నింటినీన్ని కలిగిస్తారా ఆడ వుండేఅధికారులు?'

మొ. వ్యా. 'ఏమోనండి? కలిగించినా కలిగించవచ్చును. కలిగించకపోయినా కలిగించక పోవచ్చును. ఇదమిత్థం అని చెప్పడానికి నాకు సాధ్యంఅవుతుందా?'

భీ. రె. 'మీకు సాధ్యం కాదు. కలిగించారనుకోండి. ఆపక్షంలో ఆపరరాజ్యభాగాల్లో హిందూకూలీలున్నూ సర్వవిధాల తెల్లవాళ్ళకు తుల్యులవుతారు. ఆప్రకారం తుల్యులయ్యేపక్షంలో, తెల్లోళ్ళను కూలి చేసే దెవరు? తెల్లవాళ్ళ కన్నివిధాల తుల్యులయ్యే సరికి, హిందూకూలీలున్నూ అధికారపదవి వహిస్తారు. ఆకారణంవల్ల తెల్లవాళ్ళు తమకు కూలి చేయుమంచూ హిందూకూలీలను అడుగుతారు. 'మేము మీకు తుల్యులం అయినాం. దానివల్ల కూలి చేయము' అని అంటారు, హిందూకూలీలు.'

మొ. వ్యా. 'తెల్లవాళ్ళున్నూ హిందువులున్నూ చేరి తోఁటలో పని చేసుకొంటారు.'

భీ. రె. 'అ దెప్పటికిన్నీ జరగనిపని అనుకోండి.'

మొ. వ్యా. 'ఇద్దఱున్నూ పని చేసుకోకపోతే మఱేలాగా వారికి పని సాగడం?'

భీ. రె. 'మీగాంధి విధవల నే పెండ్లి చేసుకోవల్సింది. లేకుంటే పెండ్లిండ్లు లేకుండా నే నైష్ఠికబ్రహ్మచారులుగా నే వుండండి, అని వుపదేశించాఁడఁట అవునా కాదా?'

మొ. వ్యా. 'అ—వు—నే—మో.'

భీ. రె. 'అవు నేమో అని సందేహించడం ఎందు కండీ? చెన్నపురిలో పచ్చయప్పమొదలారికళాశాలాభవనంలో నొక్కతడవ సమావేశం అయి వుండే దాదాపు వేగురు బాలురకు 'రెడీ మేడుషర్టులలాగా వుండేవిధవలనే వివాహం చేసుకోండి' అని మీగాంధిమహాత్ముఁడు హితోపదేశం చేశాఁడఁట!'

మొ. వ్యా. 'దానికిన్ని దక్షిణాఫ్రికాలో పనిచేయడానికి కూలీలను పంపడానికిన్నీ సంబంధమేముందండీ?'

భీ. రె. 'సంబంధముందో లేదో చెప్తా వినండి.'

మొ. వ్యా. 'తలబీకరకాయగా వుందబ్బా ఈరెడ్డి ప్రశ్నలడగడంచూస్తే (అని మనస్సులో అనుకొని ప్రకాశంగా) 'వింటానులెండి, చెప్పి ముగించండి శీఘ్రంగా.'

భీ. రె. 'తమకు విసుగు పుట్టుచూ వుందేమో! అయినా ఓర్పుతెచ్చుకొంచూ వినండి.'

మొ. వ్యా. 'చిత్తం చిత్తం.'

భీ. రె. ఆలాగా హిందూబాలురందఱున్నూ ఒక్కరు కూడా తప్పకుండా, విధవల నే పెండ్లి చేసుకొంటారనుకోండి. ఇక జనాభివృద్ధికేం తక్కువ? వొక్క దక్షిణాఫ్రికా కే కాదు. ప్రపంచంలో తెల్లోళ్ళు ఏలుచూ వుండేరాజ్యభాగాల కన్నింటికిన్నీ హిందూకూలీలను పంపుచూ వుండవచ్చును. ఆడ వుండే తెల్లోళ్ళచే చెప్పుదెబ్బలు తింటూ వుండవచ్చును. హిందూదేశంలో వుండేలీడర్సు ఆరాజ్యభాగాల్లో కూలీ చేశేహిందూకూలీలను గౌరవించండి. హింసించకండీ' అంచూ ఆడవుండే అధికారులకు అర్జీలు వ్రాసి పదేపదే పెట్టుకొంచూ వుండవచ్చును. ''వాళ్ళున్నూ 'మీలో వుండే హెచ్చుతక్కువలు సరి చేసుకోండి.ఆ వెనుక వాళ్ళను మేము గౌరవించేదిన్నీ గౌరవించకుండా వుండేదిన్నీ ఆలోచిస్తాం'' అంచూ ఆఅధికారులు నాయకులయొక్క అర్జీలకు బదులు చెప్పుచూ వుంటారు. అవునా? కాదా? దయచేసి చెప్పండి.'

మొ. వ్యా. 'అవు నేమో?' ''విధవావివాహాలు అసలే లేనప్పుడు హిందూసంఘంలో ప్రజలకు జీవయాత్ర సాగడం బహుకష్టంగా వుంటూ వుంది. ఆకారణంవల్ల నున్నూ, పూర్వం వాళ్ళపెద్దలకు జీవనాధారాలుగావుండేకులవృత్తులన్నీ నశించడంవల్ల నున్నూ, కూలి చేసికొంచూ బ్రతుకుదాం అనే వుద్దేశంతో దక్షిణా

ఫ్రికా, మొదలగుపరదేశభాగాలకు వలస పోతూ వున్నారు హైందవప్రజలు. విధవావివాహాలభివృద్ధి అయిందంటే, ప్రజాభివృద్ధిన్నీ నిరాటంకంగా అవుచున్నూ వుంటుంది.

భీ. రె. ఇప్పుడు తెల్పిందా మీ గాంధిమహాత్ముఁడు బాలురకు చేశి వుండేవుపదేశంగూర్చి ఈ హెచ్చుతక్కువల సందర్భంలో నాకు మీతోఁ ప్రస్తావించడానికి కారణం? సంబంధమేముందంటిరే.'

మొ. వ్యా. 'బట్టతలకున్నూ, మోఁకాళ్ళకున్నూ ముడివేయడానికి బలేప్రయత్నిస్తూ వున్నారే.'

భీ. రె. బట్టతలకున్నూ మోఁకాళ్లకున్నూ మేమా ముడివేస్తూ వున్నాము? మీరా? మీ గాంధిమహాత్ముఁడా? దయచేసి చెప్పండి. దక్షిణాఫ్రికాము న్నగుపరరాజ్యభాగాల్లో కూలిచేసి జీవిస్తూ వుండే హిందూకూలీలకు ఆ చోట్లల్లో వుండే తెల్లవాళ్ళకు వున్నట్టి అధికారమున్నూ, గౌరవమున్నూ లేవు. హిందూదేశంలో హైందవసంఘంలో వుండే అంటరానితనం దానికి కారణం" అనుచూ మీ గాంధిమహాత్ముఁడు పాడడం. దాన్ని అంగీకరిస్తూ మీరున్నూ,

"తందానతానా, తాన తందనానా"

అంచూ అతణ్ణి బలకొట్టడంయొక్క విధం గూర్చి ఆలోచిస్తే, మీరు ఇంతకుముందు చెప్పినవుపమ మీకున్నూ, గాంధికిన్నీ సరిపోతుంది.

మొ. వ్యా. 'ముగించండి మీవుపన్యాసం, బిన్నా.'

భీ. రె. 'శీఘ్రంగానే ముగిస్తానండి నావుపన్యాసాన్ని! సాత్వికమార్గాన స్వరాజ్యం సంపాదించే మీ గాంధిమహాత్మునికి శిష్యులై వుండేమీ కీపాటివోర్పు లేకపోతే, ఇఁక ఎలాగా స్వరాజ్యం సంపాదిస్తారు? 'సాత్వికమార్గం అనే సమాసంలో 'సాత్వికము' అనేవిశేషణాన్ని తీసేసి 'రాజసతామసమార్గాలను' స్వరాజ్యం సంపాదిస్తామనండి. 'ముగించండి మీ వుపన్యాసం బిన్నా' అని చెప్పినారంటే అప్పుడది చెల్లుతుంది. 'సాత్వికమార్గాన' అని ఎంతకాలం చెప్పతూ వస్తారో మీరున్నూ, మీ గాంధిమహాత్ముఁడున్నూ, అంతకాలం కోపం కలిగించే తామసగుణాన్ని అరిషడ్వర్గాలకు వునికిపట్టుగా వుండేమాతోనున్నూ, మావంటివాళ్ళతోనున్నూ, మాట్లాడేటప్పుడు మీకు చూపించరాదు. అవునా? కాదా?'

మొ. వ్యా. 'క్షమించండి. కోపగించుకోకండి. ఓర్పు తెచ్చుకొన్నా. ఇక ఎదురాడక వింటా.'

భీ. రె. 'అయితే సరి. మీ గాంధిమహాత్ముఁడు చేశివుండే వుపదేశం విరివిగా అనుష్ఠింపఁబడ్డదంటే, హైందవసంఘంలో విధవలుండరు. మీ గాంధిమహాత్ముని యొక్క స్మృతిప్రకారం విధవలనే పెండ్లి చేసుకోవల్సిందనే వ్రతముకల హైందవకుఱ్ఱవాండ్రకు విధవలు చిక్కరు. అయిరోపాఖండమునుండి వాళ్ళను ఎగవు తెచ్చుకోవలసి వుంటుంది. అభివృద్ధి అయ్యే జనసంఖ్యకున్నూ అంతం వుండదు. వాళ్ళకందఱికున్నూ జీవనాధారం దొరతనానికి కల్పించవలసి వుంటుంది. కల్పించకుంటే అనవరతం అంతఃకలహాలు వుత్పత్తి అగుచూ జరుగుచూ వుంటవి. వొక్కొక్కవేళ దొరతనానికి పీడవచ్చినా రావచ్చును. మొన్న ఇటీవల అయిరోపాలో పెద్దసంగ్రామం కలిగింది కాదా?'

మొ. వ్యా. 'కలిగింది. దానికి విధవావివాహాలా కారణం?'

భీ. రె. 'కాక ఏమి? జర్మని చిన్నరాజ్యం. విధవావివాహాలవల్ల జనాభివృద్ధి అడ అయింది. జనులకు ఉండఁ జోటు లేదు. వాళ్లకు తిన బువ్వ లేదు. ఇంగ్లీషు వాళ్ళకు వుండే ఇండియావంటి పెద్దరాజ్యం జర్మనీ వాళ్ళకు లోబడ్డది ఏరాజ్యమున్నూ లేదు. విధవావివాహాలవల్లనున్నూ, వాటిన్ని అనుసరిస్తూ వస్తూ వుండేఆర్థికదుస్థితివల్లనున్నూ, జర్మనీ ప్రజలకు వసించడానికి ఇండియావంటి పెద్దదేశం కలిగించవలసిన భారం ఆరాజ్యాన్ని పాలించేకైజరుతలమీఁద బడ్డది. దానికొగ్గాను ఆకైజరు ఇంగ్లీషుపరాసు రాజ్యాలతో పోరాటం పెట్టుకొన్నాఁడు. దానివల్ల ఆకార్యభారం తగ్గింది.'

మొ. వ్యా. 'ఎలాగా?'

భీ. రె. 'ఆపోరాటంలో కైజరుకు జయం కలుగలేదు. పరాభవం కలిగింది. రాజ్యచ్యుతుఁడైనాఁడు. ఇండియావంటి పెద్దరాజ్యాన్ని అతనిప్రజలకు సంపాదించి ఇయ్యలేక పోయినాఁడు. అయినప్పటికిన్నీ అతని వుద్దేశం వొక్కవిధాన నెఱవేఱింది.'

మొ. వ్యా. 'ఏ విధాన?'

భీ. రె. 'ఇండియావంటి పెద్దదేశం జర్మనులకు లభ్యపడక పోయినా, విధవావివాహాలవల్ల వృద్ధి అయి వుండే జనులు యుద్ధంలో ఖర్చైనారు. ఆతీరున అతని వుద్దేశం నెఱవేఱింది. ఇప్పటికైనా గ్రహించినారా తాము మీ గాంధిమహాత్ముఁడు తూర్పుపడమరలు తెలియని హైందవబాలురకు చేసిన దుష్ట

హితోపదేశమువల్ల రాబోవునట్టి వుపద్రవాలున్నా? అయితే వొక్క సందేహం తీరుస్తారా?

మొ. వ్యా. 'తెలిసి వుంటే తీరుస్తా మీ సందేహాన్ని?'

ఫి. రె. 'హైందవబాలురు పెండ్లి చేసుకొంటే విధవలనే పెండ్లి చేసుకోవల్సింది. లేకుంటే, ఆంధ్రా యూనివర్సిటికి ఇప్పు డుండే వైస్‌చాన్సలర్ గారం బోలి నైష్ఠికబ్రహ్మచారులుగా వుండవలసిం దంటూ చెప్పినమీ గాంధిమహాత్ముఁడు తనకుమారుఁడైన దేవదాసుగాంధికి అప్పుడే తెంచినకొత్తముసుకు వేసుకోనిసకేశిని యైనవిధవను గానీ, నవీనకాలపు వైధవ్యంలో అనుభవం సంపాదించి వుండే కేశరంజన్ ఆయిలును పట్టించి నున్నగా దువ్వుకొన్నవిధవను గానీ, ఏల తెచ్చి పెండ్లి చేయ లేదు?'

మొ. వ్యా. "ఆవిషయంలో గాంధిమహాత్మునిహృదయం నాకు ఇదమిత్థంగా వుంటుం దని వూహించేదానికే సాధ్యంకాదు. అయినా, ఆయనకొడుకు బుద్ధి తెలిసినవాఁడు. మంచిచెడ్డలు తెలిసినవాఁడు. అతని వివాహవిషయంలో గాంధిమహాత్ముఁడు ప్రవేశించి వుండఁడు. అతనికే దాన్ని విడిచి వుంటాడు. అతఁడు తనమాట వినఁడనే కారణంవల్ల విధవనే వివాహం చేసుకో అంటూ సలహా చెప్పి వుండఁడు.'

ఫి. రె. 'సొంతకొడుకే తనమాట విననప్పుడు లోకంలో వుండే హైందవబాలురందరున్నూ మీ గాంధిమహాత్ముని వుపదేశం వింటారా? దానిప్రకారం నడుచుకొంటారా?'

మొ. వ్యా. 'ఏల వింటారు? ఎందుకు నడుచుకొంటారు?'

ఫి. రె. "పెండ్లి చేసుకొంటే విధవల నే పెండ్లి చేసుకోండి. లేకుంటే పెండ్లిలేక వుండండి' అని మీ గాంధిమహాత్ముఁడు హైందవబాలుర కేలా చెప్పినాఁడు? బాలురు బాలురే కాని బుద్ధి తెలిసినవాళ్ళు గారు. లోకజ్ఞానం వాళ్ళ కుండదు. హిందువులంతా విధవలను పెండ్లి చేసుకొన్నవాళ్ళు పెక్కు[illegible]లై వుండే ఇడుములవల్ల బాధపడుచూ వుంటున్నారు. ఆబాధలు వర్ణనాతీతాలు. ఎవరో వొకరిద్దఱు, పూర్వసువాసినుల వివాహం చేసుకొన్నవాళ్ళకు, సంఘసంస్కారులుగా వుండే జమీందారులయొక్క ప్రాపువల్ల గృహస్థధర్మం సంకటం లేకుండా నడుస్తూ వుంది. అట్టివాళ్ళది వొక్క లెక్కలో చేరదు. విధవల వివాహం చేసుకొని వుండే సామాన్యజనులకు గలుగుచుండే సంకటాలే మన కాలోచింపవలసి వుండేవి. 'విధవలను పెండ్లి చేసుకోండి' అని సులువుగా బుద్ధి చెప్పవచ్చును. ఎవరి కీసలహా చెప్పడం? లోకజ్ఞానం సుంతేనిలేనిబాలురకు. సలహా చెప్పేవాఁడెవఁడు? మహాత్ముఁడని పేరెన్నిక కన్నవాఁడు. బ్రిటిషుదొరతనాన్ని వేఱింటి వెల్లగించడానికి దారి వేసినవాఁడు. అట్టివాని నోటినుండి వచ్చేమాట అంతా వేదవాక్యంగా లోకజ్ఞానశూన్యులై వుండేబాలురు తలస్తారు. నమ్ముతారు కూడాను. ఆతనివుపదేశప్రకారం ప్రవర్తించడానికి తీర్మానం చేసుకొంటారు. చేసుకొని తమతీర్మానాన్ని తమ్ముఁగని పెంచి పెద్ద చేసి నాలు గక్షరాలు నేర్పించి ఎంతో మక్కువతో ప్రేమించుచూ వుండేతల్లిదండ్రులకు వెళ్ళగక్కుతారు. తల్లిదండ్రుల కామాట వినడానికే ఇష్టముండదు. ఓర్పుండదు. ఏవగించుకొంటారు కూడా వాళ్ళు. సంఘసంస్కారప్రియుఁడైనతండ్రికూడా దాని కొప్పుకోఁడు. నేఁటిసంఘసంస్కారుల్లో పెక్కుండ్రు తా మన్యులకు 'విధవలను పెండ్లి చేసుకోండి. మాలవాళ్లతో గలిసి కూళ్లు తినండి.' అంటూ హితోపదేశం చేస్తారు. కాని తాముమాత్రం తాము చెప్పేలాగా వర్తించుకోరు. ఇది వాస్తవం? అవునా కాదా?'

మొ. వ్యా. 'ఏలా అవునండీ?'

ఫి. రె. 'వినండి దయచేసి. 'విధవలనే పెండ్లి చేసుకోండి' అంటూ హైందవబాలురకు హితోపదేశం చేసి వుండే మీ గాంధిమహాత్ముఁడు తనకొడుకు దేవదాసుగాంధికి విధవ నొక్కదాన్ని తెచ్చి ఇచ్చి పెండ్లి చేశాఁడా? దయచేసి చెప్పండి.'

మొ. వ్యా. 'గాంధిమహాత్ముఁడు తనకుమారునకు విధవ నిచ్చి పెండ్లి చేయ లేదు.'

ఫి. రె. 'ఎవరిఁ దెచ్చి వాని కిప్పించి పెండ్లి చేశాఁడు?'

మొ. వ్యా. 'వైష్ణవబ్రాహ్మణబాలికను.'

ఫి. రె. 'తనకొడుకునకు విధవ నిప్పించి పెండ్లి చేయించడం మీ గాంధిమహాత్ముఁడు ఒల్లఁడు. అవునా కాదా?'

మొ. వ్యా. 'బదులు లేదు.'

ఫి. రె. ఒల్లఁడనేది మీ భావం అంటూ మీమౌనం తెల్పుచూ వుంది. అవునా కాదా?'

మొ. వ్యా. 'బదులు లేదు.'

ఫి. రె. 'విధవ' అనేశబ్దం అమంగళకరం అయిందే, ఆశబ్దం విన్నవాళ్ళ కొక్కవిధమైనసంకటమున్నూ దుఃఖమున్నూ కలుగుతవి. ఇదిమనుష్యస్వభావం. గాంధి మీకు మహాత్ముఁడై వుండినా, అతఁడున్నూ మనుష్యమాత్రుఁడే సుమీ. మానవాతీతుఁడు గాఁడు, అవునా కాదా? దయచేసి చెప్పండి.'

మొ. వ్య. "మానవమాత్రుఁడే.

భీ. రె. 'విధవ' అనేశబ్దం 'అమంగళకరం' అనేవిషయం మీగాంధిమహాత్మునిఅంతరాత్మకు తోఁచి వుంటుంది. అవు నా కా దా?'

మొ. వ్య. 'తోఁచి వుంటుం దేమో.'

భీ. రె. 'తోఁచివుంటుం దేమో' అంచూ ఏల చెప్తారు? తోఁచి వుంటుం దనేది నిక్కం. అని వొప్పుకోండి.

మొ. వ్య. 'బదులు లేదు.'

భీ. రె. 'విధవనా పోయి పోయి పెండ్లి చేసుకోడం, నాముద్దులకొడు కైనదేవదాసుగాంధి.' అని మీ గాంధిమహాత్ముఁడు తలఁచి తనపుత్త్రికకు విశ్వస్థం దెచ్చి యిచ్చి పెళ్ళి చేశాఁడుకాఁడు. అవు నా కా దా దయచేశి తెల్పండి.'

మొ. వ్య. 'చీడపురుగు పట్టుకొన్నలాగా నన్నీతఁడు పట్టుకొన్నా డబ్బా! ఏలా వదలించుకోడం, ఈచీడ పురుగును?' (అని మనమున ననుకొని ప్రకాశముగా) 'అయి—వుండ—వచ్చును.'

భీ. రె. 'పోనియ్యండి. వైష్ణవబ్రాహ్మణిఁ దెచ్చి తన కొడుకునకు ఇప్పించి వివాహం చేయించుకొన్నాఁ డే కాని మాలెతఁ దెచ్చి వివాహం చేయ లేద దేల.'

మొ. వ్య. (మొగము చిట్లించుకొని) 'కారణం ఏ ముంది?'

భీ. రె. దానికిఁ గారణం తెలియ దా తమకు?'

మొ. వ్య. 'గాంధిమహాత్మునిహృదయం ఆతనికుటుంబ విషయాల్లో తెలుసుకోడం మహాకష్టం. బ్రాహ్మణిని దెచ్చి తనకుమారున కేల కట్టిపెట్టాఁడో? మాలెత తెచ్చి ఏల కట్టిపెట్టలేదో దానికంతా కారణం నాకు తెలియదండి.'

భీ. రె. 'మీగాంధిమహాత్ముఁడు వైశ్యుఁడఁట! ఆతనికొడు కైనదేవదాసుగాంధిన్నీ వైశ్యుఁ డే అవుతాఁడు హైందవసంఘసంప్రదాయప్రకారం. అవు నా కాదా?'

మొ. వ్య. 'అవు నవును.'

భీ. రె. 'ఇప్పు డాతనికొడుకును పెండ్లి చేసుకొన్నఆఁ డది బ్రాహ్మణి. అగ్రజాతిది. అవు నా కాదా?'

మొ. వ్య. 'అవు నవును.'

భీ. రె. 'అగ్రజాతిస్త్రీని మూఁడోకొలంవాఁడు పెండ్లి చేసుకొన్నా డనేది గౌరవం. మఱీన్ని అగ్రజాతి వాళ్లు ఈవివాహంవల్ల మూఁడవకొలంవాళ్ళకు తుల్యు లైనారుకాని. దానివల్ల వాళ్ల అగ్రజాతిత్వం మట్టిలో కలిశిపోతుంది.' అనేఅంశం లోకానికి చూపించడాని కై మీగాంధిమహాత్ముఁ డీతీరున హైందవసంఘాన్ని తల్లక్రిందులుగ చేస్తూ వుంటున్నాఁడు. అవునా కా దా?'

మొ. వ్య. 'బదులు లేదు.'

భీ. రె. నేను చెప్పినకారణంవల్ల మాలెతను దెచ్చి తన కుమారుని కిప్పించి పెండ్లి చేయలేదు మీగాంధిమహాత్ముడు? అవు నా కా దా?

మొ. వ్య. 'అ దేలా కారణం అవుతుంది?'

భీ. రె. 'మాలెత అంత్యజస్త్రీ. దాన్ని తనకొడుకు పెండ్లిచేసుకొంటే తనకొడుకున్నూ తానున్నూ మాలోళ్లకు తుల్యు లవుతా రనేఅంశం తండ్రికొడుకుల కిష్టం వుండదు. దానివల్ల మూఁడవకొలంలో పుట్టిన గాంధిన్నీ అతనితనయుఁడున్నూ అంత్యజులతో వైవాహికసంబంధం చేసుకోడానికి ఇష్టపడరు.'

మొ. వ్య. 'ఏలా?'

భీ. రె. 'అంటరానితనాన్ని హైందవసంఘం మాయం చేయ లేదు. ఆప్రకారం దాన్నిపోగొట్టకుండా వుండడం ఆసంఘానికి పెద్దకళంకం. ఆకళంకం మాసిపోయేదాఁక నేనున్నూ మాళవాళ్లేను.' అంచూ చెప్పి వుండే మీగాంధిమహాత్ముఁ డేలయ్యా మాలెతఁ దెచ్చి తనకుమారున కిచ్చి వివాహం చేయ లేదు? దానివల్ల అంత్యజులతో వైవాహిక సంబంధం చేయడానికి తండ్రికొడుకుల కిష్టం లేదనడం వాస్తవం. ఇట్టి మీగాంధిమహాత్ముని ప్రవర్తన వల్ల వర్ణాశ్రమధర్మాన్ని ధ్వంసం చేయవల్సిం దనేది మీగాంధియొక్క ముఖ్యోద్దేశం. ఆవుద్దేశం బ్రాహ్మణిని ఆతనికొడుకున కిచ్చి వివాహం చేయడంలో స్పష్టం అయింది. అంటరానితనాన్ని తొలఁగించడానికి అన్నివిధాల ప్రయత్నం చేస్తూ వుండేమి గాంధిమహాత్ముఁడు తనకుమారునకు మాలెత నిచ్చి వివాహం చేసుకోక వుండడంవల్లకూడా ఆవుద్దేశ స్థిరపడ్డది. అంటరానితనంపోనందుననున్నూ, వర్ణాశ్రమ ధర్మధ్వంసం పూర్తి కానందువల్లనున్నూ, క్రొ శాసనసభలమూలాన దాన్ని వే అంట పెల్లగిం చేయించుకోడానికి మీగాంధిమహాత్ముఁడు శాస సభాద్వయంలో ప్రవేశించడానికి కాంగ్రెసు సభ్యుల కనుజ్ఞ ఇచ్చి వున్నాఁ డనేది మానిశ్చితా భిప్రాయం.

మొ. వ్య. 'అంటరానితనాన్ని మాయం చేయడాని గాంధిమహాత్ముఁ డెందుకు గాఢప్రయత్నం చేస్తు వున్నాఁడో మీకుఁ దెలుసు నా?'

భీ. రె. 'ఎందుకో. తెలియదు.'

మొ. వ్య. హైందవసంఘంలో నాటుకొని వుండేజా

మతభేదాలవల్ల హెచ్చుతక్కువ లున్నవి. ఆ హెచ్చుతక్కువలవల్ల పరస్పరకలహా లనవరతం కలుగుచూ వుంటవి. ఆ హెచ్చుతక్కువలు పోయినవంటే మతకలహాలకు చోటుండదు. దానికొగ్గానే అంటరానితనాన్ని మాయం చేయడాని కామహాత్ముడు గాఢప్రయత్నం కాంగ్రెస్సుమూలాన చేస్తూ వున్నాడు.'

భీ. రె. 'అంటరానితనాన్ని మాయంచేయడానికి కాంగ్రెస్సును సాధనంగా మీమహాత్ముడు వుపయోగించుకో కూడదు.'

ము. వ్యా. 'ఏల ?'

భీ. రె. 'కాంగ్రెస్సు రాజకీయసంస్థ.'

ము. వ్యా. 'అయితే ఏమి ?'

భీ. రె. 'అందొక్క హిందువులే వుండరు. మహమ్మదీయులు, క్రైస్తవులు — ఈలాటి భిన్నమతస్థులు కూడా అందుంటారు. ఒకరిమతం వేరొకరికి సరిపడదు. ఒక్క హిందువులకే సంబంధించిన అంటరానితనాన్ని మాయం చేయడానికై కాంగ్రెస్సులో సభ్యులుగా వుండే మహమ్మదీయులాదిగాగల భిన్నమతస్థులు తోడ్పడుతారనుకో. అట్టిపట్టులలో మతవిషయికకలహాలకు కాంగ్రెస్సు ఆస్పద మవుతుంది. రాజకీయసంస్థగా వుండే కాంగ్రెస్సు మతవిషయిక కలహాల కాస్పద మైందంటే, కాంగ్రెస్సు ఏవుద్దేశంతో నెలకొని యేబదేండ్లనుండి జీవించి వున్నదో, ఆవుద్దేశం నెఱవేఱదు. దానికి 'కాంగ్రెస్సు' అను పేరుతోనే వుండవలసి వుంటుంది. 'వాస్తవమైన రాజకీయసంస్థ' అని కాంగ్రెస్సు అనిపించుకోదు. హైందవసంఘాన్ని తల్లక్రిందులుగ మార్చడానికే కాంగ్రెస్సు ఏర్పడ్డదనేది మానిశ్చితాభిప్రాయం. రాజకీయసంస్థగావుండిన కాంగ్రెస్సును హైందవసంఘసంస్కారసంస్థగా మీ గాంధిమహాత్ముడు మార్చినాడు.'

ము. వ్యా. 'ఏలా మార్చాడు ?'

భీ. రె. 'అతడు దాన్నితనయధీనం చేసుకోక ముందు (అనగా అతడు ఆఫ్రికాలో వుండేటప్పుడు) ఆ కాంగ్రెస్సు బొత్తిగా రాజకీయసంస్థగానే వుండింది. అప్పుడు దాన్ని నడపుచూ వుండినరాజకీయధర్మమర్మజ్ఞులు మతవిషయికచర్చలకుగాను దాన్ని సాధనంగా వుపయోగించుకొన్నవాళ్లు కారు. హైందవసంఘాన్ని సంస్కరించడానికై ప్రత్యేకంగా వేరొక సంస్థ వుండింది. దానికి హిందూ సంఘ సంస్కార సభ అని పేరు. ఏయేచోటుల్లో ఏయేకాలాల్లో కాంగ్రెస్సు నడచుచూ వుండిందో, ఆయాయిచోటుల్లోనూ, ఆయాయికాలాల్లోనూ, కాంగ్రెస్సు నడిచినవెనుక, ఆ హిందూ సంఘసంస్కారసభ సమావేశం అవుతూ వుండింది. అందు దొరతనంవారి సేవకులకుగూడా ప్రవేశం వుండింది. కాంగ్రెస్సులో వాళ్లకు ప్రవేశంలేదు. ఆకారణమే కాంగ్రెస్సు బొత్తిగా రాజకీయసంస్థ అనేవిషయాన్ని స్థిరపఱుస్తూ వుంది.'

ము. వ్యా. 'అయితే కాంగ్రెస్సు నడిచేచోటుల్లో హిందూసంఘ సంస్కార సభా సమావేశం ఇప్పుడు అయ్యేది లేదు. ఏల ?'

భీ. రె. 'కాంగ్రెస్సు మీ గాంధిమహాత్ముని అధీనంఅయిందిమొదలు, ఒక్క హిందువులకే సంబంధించినఅంటరానితనాన్ని మాయం చేయడానికి కాంగ్రెస్సుసాధనంగా అయింది. అది వొక్క హైందవసంఘానికి చేరినఒక్క అంటరానితనాన్నే కాక విధవావివాహాద్యనేకాంశములకు చోటిచ్చినది. తక్కినఆకారణాలవల్ల హిందూసంఘసంస్కారసభ పేరు లేకుండా పోయింది. కాంగ్రెస్సు దానిస్థానాన్ని ఆక్రమించుకొన్నది. ఇప్పుడా కాంగ్రెస్సు హైందవసంఘసంస్కారసభగా అయి వుంది. 'రాజకీయసంస్థ' అనే వేషాన్ని, 'గోముఖవ్యాఘ్రం' అనేలాగా మీ గాంధిమహాత్ముడు దానికి వేశాడు. అవునో కాదో తమరే ఆలోచించుకో వచ్చును.'

ము. వ్యా. 'కాంగ్రెస్సు రాజకీయసంస్థకాదు. అయితే హిందూసంఘసంస్కారసంస్థ' అనేది మీ అభిప్రాయమా ?'

భీ. రె. 'నావ్యక్తిగతమైవుండే అభిప్రాయమే కాదు. సనాతనధర్మపరులసమూహంయొక్క అభిప్రాయం కూడాను అదే.'

ము. వ్యా. 'అంటరానితనాన్ని తొలగించే అంశాన్ని కాంగ్రెస్సుమెడకు గాంధిమహాత్ముడంటగట్టింది వాస్తవం. తక్కినవిధవాద్యనేకవిషయాలు దానిమెడకంటగట్టినా డనడం అధర్మం.'

భీ. రె. 'అధర్మం ఏమాత్రం గాదు.'

ము. వ్యా. 'ఏలాగా ?'

భీ. రె. 'మీ గాంధిమహాత్ముడు ఆఫ్రికాలో వుండేటప్పుడు కాంగ్రెస్సుసమావేశం అవుతూ వున్నచోటుల్లో, జాతిమతభేదాలు పాటింపుచూ ఆయాయిరాజ్యభాగాలనుండి వచ్చి వుండే ప్రతినిధులకు అన్నోదకాలు ఏర్పాటు చేస్తూ వచ్చారు. అతడక్కడనుండి హిందూదేశానికి వచ్చి కాంగ్రెస్సును తనఅధీనం

చేసుకొన్నాఁడు. ఆ వెనుక కాంగ్రెస్సుసమావేశం అయ్యేతావుల్లో జాతిమత భేదాల ననుసరించి ఆతిథ్యం ఇచ్చేఆచారం అడుగంటింది. 'ఎల్లిసెట్టి లెక్క-ఏక లెక్క' అనేలాగా సబ్బండు కూళ్లు కాంగ్రెస్సుకూడే తావులకు వచ్చే హైందవప్రతినిధులచే తినిపించుచు వస్తూ వున్నారు. కాకినాడలో అలా జరిగింది. దానివల్ల దానికి వచ్చిన హైందవప్రతినిధు లనేకులు ఇండ్లకు పోయినవెనుక ప్రాయశ్చిత్తం చేసుకొన్నారు. అప్పటినుండి నేఁటిదాకా అలాగే నడుస్తూ వుంది. అవునా కాదా?'

ము. వ్య. 'అవు నవును.'

భీ. రె. 'కాకినాడలో కాంగ్రెస్సు అయినప్పటినుండి నేఁటిదాఁక అనేకస్థలాల్లో జరిగిన కాంగ్రెస్సుసమావేశాలకు ప్రాచీనాచారపరాయణులుగా వుండే హైందవప్రతినిధు లందఱు పోవడం చాలించుకొన్నారు.'

* ము. వ్య. 'వాళ్లు పోతే ఎంత? పోకపోతే ఎంత? వాళ్లు మాకు వొక్క లెక్కలో చేరినవాళ్లు కారు.'

భీ. రె. 'ఈతిరస్కారభావ మొక్కవ్యక్తిదే కాదు. దేశీయమహాజనసభానాయకుల కందఱకుఁ గలదు.

---

* ౧౯౨౭ సం॥ జనవరి నెల ౧౭ వ తేది సోమవారము రాత్రి ఎన్నిక గంటలకుఁ బైఁబడి దేశీయమహాజనసభానాయకులలో మ-రా-శ్రీ సి. రాజగోపాలాచార్యులును, మ-రా-శ్రీ యస్. సత్యమూర్తి బి.ఏ., బి. యల్., గారును సౌ. విశాలాక్షమ్మగారును, మున్నగు గలసభ్యులు "శాసనసభాధ్యక్షులను దేశీయమహాజనసభచే నియమితులై యుండువరులనే వరించుకోవలసినది. తక్కుంగలకక్షలవారిచే నియమితులై యుండువరులను వరించుకోఁగూడదు." అని పట్టియమాంబళమున వరించుకొన నగు కారము కలగ్రహస్థులను, గృహిణీజనసమూహమును వేఁడు సభ చేసిరి. అప్పు డాసభకు బ్రాహ్మణపత్రికాకార్యనిర్వాహకుఁడు చని (1) శాసనసభాధ్యక్షులలో సనాతన ధర్మము పోషించెదము. (2) ధర్మవిరుద్ధములై యుండు (అనఁగా బాలికావివాహనిషేధశాసనమువంటివి) చట్టములు చేయఁ బ్రయత్నింపము. (3) చేయఁబూనువారికిఁ దోడుపడము. (4) దొరతనమున కనుకూలము లై యుండునవియును బ్రజాసముదాయమునకుఁ బ్రతికూలములును నై యుండునవియును నైన యార్థికవ్యాపారాద్యనేకాంశములు చర్చింపవలసినపట్లలో దొరతనమువారి కనుకూలముగ శాసనసభాసభ్యులు వర్తింపఁ గడంగుదు రేని, ధర్మవిరుద్ధము లగుశాసనములు చేయుటకు పక్షమునకుఁ గాని కక్షలకుఁ గాని ప్రభుత్వము తోడ్పడదు. ధర్మవిరుద్ధశాసనములవలన నేలుబడికి నష్టముండదు. వారు దానికిఁ దాము సాహాయ్యముచేసి నిష్టపడెదరు. ప్రజకు లాభము కలిగించువంశములు వారికి నష్టము కలిగించును. దానివలనఁ దము కనుకూలము కలిగించుకక్షకు గాని కక్షలకుఁ గాని దొరతనము సర్వవిధములఁ దోడుపడును. ఈము న్నగుకారణములు ధర్మవిరుద్ధము లగుశాసనములు చేయఁ గొందఱు సభ్యులఁ బురికొల్పును. అట్టివారు తమవ్యక్తిగతము లై యుండుభావప్రకారము ధర్మవిరుద్ధము లగుశాసనములు చేసి వానిఁ జట్టములుగఁ గావించుకొన దొరతనమువారితోఁ 'దమశాసనములకుఁ దోడ్పడినచోఁ దామును ప్రజలకు నష్టము కలిగించు నంశములలో దొరతనమువారికి ననుకూలముగ వర్తించెదము" అనుభావము కలయొప్పందము చేసికొందురు. ఇట్టిది జరుగ దని తలంప వీలు లేదు. గాంధికిని ఇర్విన్ ప్రభువునకును జరిగిరహస్యగోష్ఠివలనఁ గలిగిననిగ్గఁట :—"స్వరాజ్యోద్యమము నేను చాలించుకొనెద. అస్పృశ్యతఁ దొలఁగించుటకును, నామాలబిడ్డలకు దేవాలయప్రవేశము కలిగించుటకును, దొరతన మన్నివిధములనాకుఁ దోడ్పడవలయును" అనునది. ఈకారణమువలననే గాంధి రాజకీయవ్యవహారములతోడిసంబంధము వదలుకొనినాఁడు. దేశీయమహాజనసభాసభ్యులు పైనఁ జెప్పఁబడినగాంధియిర్వినులరహస్యగోష్ఠియొక్క నిగ్గు క్రియాకారముగఁ జేయుటకుఁగానే శాసనసభలోఁ బ్రవేశింపవలసినదిగా గాంధి వారికనుజ్ఞ ఇచ్చినాఁడు. "అట్టియొప్పందము కాంగ్రెసుసభ్యులకు దొరతనముతో చేసికొనరాదు" అనుభావము కలయంశము లై యుండని ఇంగ్లీషులో మ-రా-శ్రీ. యస్. సత్యమూర్తిగారి కందఁ జేసినాఁడు. అతఁ డాతీరున బ్రాహ్మణపత్రికాకార్యనిర్వాహకుఁ డిచ్చినపత్రమునుంగూర్చి యొక్కపలుకై నఁ బలుక లేదు. ఆ వే మని యడుగఁగా ఇంటికిఁ బోయి ప్రత్యుత్తరము వ్రాసెద నని బదులు పలికినాఁడు. బ్రాహ్మణపత్రికాకార్యనిర్వాహకుఁడు అటఁ బ్రోగై యుండుసభ్యులసమక్షమున నే తాను వ్రాసియిచ్చినయంశములకుఁ బ్రత్యుత్తరము లియ్యవలసినదిగాఁ బట్టుపట్టినాఁడు. కాని వానివచనము లరణ్యరోదనము లయ్యె. ఆసభఁ గూర్చినయుక్తాయుక్తజ్ఞానశూన్యులై నవుత్త్రవాంఢ్రకుఁ గోపము వచ్చెను. వారిలో నొకఁడు బ్రాహ్మణపత్రికాకార్యనిర్వాహకునిఁ గొట్టుటకుఁ బూనినాఁడు. అయినఁ గొంద ఱాతని వల దని నివారించిరి. గాంధియహింస ఇట్టిదే సుడీ. అట్టిసందడిలో మ-రా-శ్రీ సి. రాజగోపాలాచార్యులు (అనఁగా గాంధికి వియ్యంకుఁడు) 'ఈ

ఇంతతిరస్కారభావం వాళ్లకు ప్రాచీనాచారపరాయణులయెడ వున్నను, వోట్లకై ఈప్రాచీనాచారపరాయణుల పెద్దమ్మలనే అడగ వస్తూ వున్నారు. వోట్లియ్య నధికారము కలసనాతనధర్మపరులు ధర్మమునందు వాస్తవమైనభక్తిశ్రద్ధలు కలవాళ్ళుగా వుందురేని, నాస్తికమహాజనబృందమునకు నమూల్యములైన తమవోట్ల నియ్యకుందురుగాక! ఆనాస్తికజనబృందమెవరుగా వున్నను సరే. (అని తనమనస్సులో ననుకొని ప్రకాశముగా) "కాంగ్రెస్సుచే హిందూసంఘసంస్కారకార్యం నిరాఘాటంగా చేయిస్తూ వుండేదాఁక కాంగ్రెస్సుసమావేశాలకు ప్రాచీనాచారపరాయణులు వచ్చినా మీకొకటే, రాకున్నా మీకొకటే. పోనీ యింక ఇంక ఆమాట. కాంగ్రెస్సుసమావేశాల్లో అంటుటకున్నా ఏకపంక్తిలో అన్నం పెట్టించడం అనేటంతటి సంఘసంస్కారం చేయవలసి వుండేపద్ధతులలో వొకటి. అవునా కాదా?'

మొ. వ్య. 'ఒకటే. కాదని ఏలా చెప్పను?'

భీ. ర. 'ఈ సంఘసంస్కారకార్యభాగం కాంగ్రెస్సే కాదా చేసింది?'

మొ. వ్య. 'కాంగ్రెస్సెలా చేసింది?'

భీ. ర. 'కాంగ్రెస్సు కూర్చింది కాంగ్రెస్సు నాయకులే. అన్నోపకారులయ్యే దాని కేర్పాట్లు చేసింది వాళ్ళే. కాంగ్రెస్సంటే ఏంది? ఈనాయకులయొక్కకూటమే కాదా కాంగ్రెస్సు? దానికి ప్రతినిధులుగా వచ్చేవాళ్లంతా హిందూసంఘసంస్కారులే కాని హిందువుల్లో తక్కుంగలవాళ్లు రావడం లేదు. కాఁబట్టి హిందూసంఘసంస్కారులకూటం అయి వుండే కాంగ్రెస్సే సబ్బండుకూళ్లకు ఆకరంగా అయి వుంది. ఇదన్నీ సంఘసంస్కారకార్యభాగంలో వొకటి. దానివల్ల కాంగ్రెస్సు హిందూసంఘసంస్కారసంస్థ. కాని రాజకీయసంస్థ ఏమాత్రం కాదు. అవునా కాదా?'

మొ. వ్య. 'సబ్బండుకూళ్లకు కాంగ్రెస్సు ఆస్పదం అయి వున్నదనుకోండి. తక్కినఅంశాలు?'

భీ. ర. 'విధవావివాహంవిషయం ముందే తమతో చర్చించాను గాదా?'

మొ. వ్య. 'కాంగ్రెస్సు చేసిందా విధవావివాహాలు?'

భీ. ర. 'కాంగ్రెస్సంటే ఏం దండీ? విధవలకు బిడ్డలను పుట్టించడానికి మార్గాన్వేషణపరులై వుండే మీరే కాంగ్రెస్సు. కాంగ్రెస్సే మీరు. మీగాంధిమహాత్ముఁడు దానికి సర్వాధికారి; కాంగ్రెస్సుకు అతఁడెప్పుడు సర్వాధికారి అయినాఁడో మీరనున్నా అతఁడే సర్వాధికారి. మీరు గంగిగొడ్లు. అతఁడు హైందవబాలురను పెండ్లిచేసుకొంటే విధవలనే పెండ్లిచేసుకోండి. లేకుంటే 'వూరుకోండి' అని మీకోపదేశంచేశాఁడు. కాంగ్రెస్సే అతఁడు; అతఁడే కాంగ్రెస్సు. అట్లగుటవల్ల విధవావివాహాలకు ఆకాంగ్రెస్సే ఆకరం. అవునా కాదా? దయచేసి చెప్పండి. తక్కినవిషయాలుకూడా అట్టివే. కావున తమతో విస్తరించి వానినిగూర్చి ప్రసంగించడం వ్యర్థంగా ప్రొద్దుపుచ్చడం అవుతుంది. కాఁబట్టి కాంగ్రెస్సు హిందూసంఘసంస్కారసంస్థ కాని రాజకీయసంస్థ కాదు. ఇది మాసిద్ధాంతం.'

భీ. ర. 'హైందవసంఘంలో జాతిమతభేదాలవల్ల హెచ్చుతక్కువ లున్నవి. ఆకారణంవల్లనే పంచములన్యమతగ్రహణం చేస్తూ వుంటారంటూ మీగాంధిమహాత్ముఁడంటాఁడంటే. వాస్తవమా?'

మొ. వ్య. "అన్నాఁడనేది వాస్తవం. అతఁడొక్కఁడే కాదు ఆలా అన్నది. పండిట్ మదనమోహనమాళవ్యాగూడా అన్నాడు ఆలాగా." అని.

భీ. ర. 'మీగాంధిమహాత్ముఁడన్నా, పండిట్ మదనమోహనమాళవ్యా అన్నా, మాకావిషయంలో ఇద్దఱున్నా, తుల్యులే. మీగాంధిమహాత్ముఁడన్నాఁడనఁగానే మా కాలనియం తృప్తిస్సి లేదు; ఆపలుకే అంటూ వుండే పండిట్ మదనమోహనమాళవ్యా యన్నాడన్నా మాకు తృప్తిస్సి లేదు, ఇద్దఱున్నా తుల్యులే. అనేది మాభావం.'

మొ. వ్య. 'గాంధిమహాత్ముఁడు హిందూసంఘసంస్కర్తఁడు; పండిట్ మదనమోహనమాళవ్యా సనాతనధర్మపరుఁడు. ఆయనయందు మీకు భక్తిశ్రద్ధలుంటవే. మేము అంటూ ఆయనకూడా ఆలా అంటూ చెప్పుచున్నాఁడంటున్నా. ఆవిషయంలో ఇద్దఱున్నా తుల్యులే అనేదిమీయభిప్రాయం అయి వుంటే, నేను దానిం గూర్చి ప్రశ్నించి వుండను. పోనిండు.

---

(బ్రాహ్మణపత్త్రి) కాకార్యనిర్వాహకుఁడు తన 'వోటు' ఇచ్చినా ఒక్కటే; ఇయ్యక పోయినా ఒకటే. అది యొకలెక్కలోఁ జేరింది కాదు.' అనుభావము కలనుడువులే ఓటుజాతరలో మొదటివ్యక్తిచే బల్కింపఁబడియెనని యెఱుఁగునది. కాంగ్రెస్సు చిత్తవృత్తి ఎఱిఁగి సనాతనధర్మపరులకు వర్తించుట లగ్గు.

"ఓటుజాతర" గ్రంథకర్త.

హెచ్చుతక్కువలు కావా కారణాలు పంచము లన్యమత గ్రహణం చేయడానికి?"

భీ. రె. 'హెచ్చుతక్కువల నే విషయం పశుపక్ష్యాది మృగముల్లోను కలవు. మానవసంఘంలోనూ గలవు. లేనిచోటు లేదు. ఇప్పటికి చెప్పబోయే అంశం ఆస్తికులై వుంటేమా వాదం. నాస్తికులై వుంటేగా గాంధిమహాత్మునియొక్కయున్నూ ఆతన్ని అనుసరిస్తూ ఆతనిచిత్తవృత్తినిఅనుసరించి నడుస్తూ వుండే మీ కాంగ్రెసువాదులయొక్కయున్నూ వాదం కాదు. ఆవునకుండేపూజ్యత పందికి లేదు. ఆవుపాలునకుండే ఔషధగుణం పందిపాలకు లేదు. గాడిదపాలైనా కొన్నిరోగాల కుపయోగపడు తుంది. పందిపాలు దేనికిన్ని పనికి రాదు. నాలుగుకాళ్ళమృగాల్లో ఈలాటి హెచ్చుతక్కువలుం టున్నవి. పక్షుల్లోనూ కద్దు. కాకుల్లో 'మాలకాకి' అనిన్నీ, బాపనకాకి అనిన్నీ రెండు తెగలకాకు లుం టున్నవి. ఆ విషయం తమకు తెలుసునా?'

మొ. వ్య. 'తెలుసును.'

భీ. రె. 'ఆవుకున్నూ పందికిన్నీ వుండే హెచ్చుతక్కువలకు కారణం ఏమి?'

మొ. వ్య. 'బదులు లేదు.'

భీ. రె. గంగానది కద్దు. అది ప్రవహిస్తూ వుంది. అట్లే జలదారిన్నికూడాను. అంటుంటే నీళ్లుప్రవహిస్తూ వుంటవి. రెంటికిన్ని హెచ్చుతక్కువ లున్నవి. ఔనా కాదా?'

మొ. వ్య. 'ఉన్నవి.'

భీ. రె. 'ఏల?'

మొ. వ్య. 'బదులు లేదు.'

భీ. రె. 'అట్లే మానవసంఘంలో హెచ్చుతక్కువ లుంటూ వున్నవి ప్రపంచంలో ఏదాయు చూచినా? వొక్కహిందూసంఘంలో నే కాదు. అవునా కాదా?'

మొ. వ్య. 'అవునో కాదో నాకు తెలియదు. ఖండాంతరాల్లో హెచ్చుతక్కువ లున్నవా?'

భీ. రె. లేక ఏమి?'

మొ. వ్య. 'లేవంటారే ఆదేశస్థులు?'

భీ. రె. 'అయిర్లాండు' అనేదీవి కేల బ్రిటిషుపార్లమెంటుద్వారాం స్వాతంత్ర్యం ఇవ్వకుండింది ఇంతకాలం బట్టి?'

మొ. వ్య. 'నాకు తెలియదు.'

భీ. రె. 'మీగురువైన గాంధి మహాత్ముడైనా మీకు చెప్పలేదా?'

మొ. వ్య. 'చెప్ప లేదు.'

భీ. రె. 'అయిర్లండుదీవిలోని ప్రజలు 'రోమన్ కాథలిక్కు' అనే క్రైస్తవమతశాఖకు చేరినవారు.'

మొ. వ్య. 'అయితే నేమి?'

భీ. రె. 'ప్రాటెస్టెంట్ అయివుండేపార్లమెంటుద్వారాం సామాన్యంగా రోమన్ కాథలిక్కు నేక్రైస్తవులను నీచంగా భావిస్తుంది.'

మొ. వ్య. 'ఏల?'

భీ. రె. తాము హెచ్చనిన్నీ రోమన్ కాథలిక్కులు తక్కువ అనిన్నీ.'

మొ. వ్య. 'మతసంబంధ మై వుండే హెచ్చుతక్కువలు క్రైస్తవుల్లోను గూడా కలవా?'

భీ. రె. 'లేక ఏమి? తప్ప కున్నవి. 'తాము హెచ్చు; రోమను కాథలిక్కులు తక్కువ;' అనే భావంవల్ల ప్రాటెస్టెంటు అయి వుండేపార్లమెంటు ద్వారాం అయిర్లండుదీవికి స్వాతంత్ర్యం ఇచ్చిందికాదు.'

మొ. వ్య. 'అయిర్లండుదీవికి ఏలాగా స్వాతంత్ర్యం కలిగింది?'

భీ. రె. 'దెబ్బకు దెయ్యం వెఱచును.'

మొ. వ్య. 'ఆలాగా?'

భీ. రె. 'అయిర్లండుదీవికి స్వాతంత్ర్యం కలగడానికి బూర్వమే, కేపుకాలని, కన్నడా, ఆస్ట్రియా మున్నగురాజ్యభాగాలకు స్వాతంత్ర్యం బ్రిటిషుపార్లమెంటుద్వారాం కలిగించి వుండే, కారణం ఏమి? తెలుసునా?'

మొ. వ్య. 'ఆరాజ్యభాగాల్లో వుండేప్రజలు ప్రాటెస్టెంటుక్రైస్తవులయి వుంటారేమో.'

భీ. రె. 'వుంటారేమో అని సందేహ మెందుకు? ఆకారణంవల్ల నే బ్రిటిషుపార్లమెంటు ఆరాజ్యభాగాలకు స్వాతంత్ర్యం ముమ్మందుగా ఇచ్చి వుంది. అది మా సమ్మయ్యండి కాని ఇంగ్లండుచరిత్రం చదివి వున్నారా?'

మొ. వ్య. 'చదివి వున్నా. అయితే మే మీగ్రామానికి వచ్చింది వోట్లభిక్షకు. ఆదేశంచరిత్రం, ఈదేశంచరిత్రం ముందు వేసుకొంచూ ఏదోలేనిపోనిపుక్కిటి పురాణాలు చెప్పడాని కారంభించారేమండి? వోట్లిస్తా మంటూ మాకు చెప్పి ఆతీరున తీర్పుచేసి మా చేతి కియ్యండి. మేము ఈగ్రామస్థులంతా కాంగ్రెస్సు కే వోట్లిస్తా మంటున్నా రని పత్రికల్లో ప్రకటిస్తాము.'

భీ. రె. 'మీ గాంధిమహాత్మునిమతప్రకారం మీవిరోధులు మిమ్ము కొట్టినా, తిట్టినా, చంపినా, పూర కుండ వలసిం దనేది మీకు విధి కాదా? మీమహాత్ముని

ఆజ్ఞోల్లంఘనం చేసి కోపగించుకోడం మీసాత్త్విక మార్గానికి విరోధమే."

మొ. వ్య. 'చిత్తం చిత్తం. కోపగించకండి. కానీయ్యండి తమకు మమ్మడిగే ప్రశ్నలసముదాయాన్ని.'

భీ. రె. 'ఇంగ్లండుచరిత్రం చదివి వున్నానంటిరి. మేరిరాణి ప్రొటెస్టెంటులనున్నూ, యెలిజబెత్తురాణి రోమన్‌కాథలిక్కులనున్నూ, మతభేదంవల్లనే కాదా పరస్పరం హింసించుకొన్నవిషయం తమకు తెలియదా?'

మొ. వ్య. 'తెలుసును.'

భీ. రె. 'స్పెయినున్నూ, పరాసురాజ్యమున్నూ రోమన్‌కాథలిక్కురాజ్యములు. ప్రొటెస్టెంటురాజ్యమైన గ్రేటుబ్రిటను ఆరెంటితో జగడం చేస్తూ వుండింది మతభేదాలవల్లనే కాదా?'

మొ. వ్య. 'అవు నవును.'

భీ. రె. 'పైనఁ బేర్కొనఁబడినవి మతసంబంధములై వుండే హెచ్చుతక్కువలు. ఆర్థికస్థితి ననుసరించి కలిగింది కాదా పరాసురాజ్యవిప్లవం?'

మొ. వ్య. 'అనఁగా?'

భీ. రె. 'శ్రీమంతులు హెచ్చేమి? బీదలు తక్కువయేమి?' అనే హెచ్చుతక్కువలవల్లనే గాదా పరాసురాజ్యవిప్లవం వుత్పత్తి అయింది?

మొ. వ్య. 'ఇప్పుడు తెలిసింది. అవును.'

భీ. రె. 'ఆ హెచ్చుతక్కువలు ఆ విప్లవాంతంలో అడుగంటినవా?'

మొ. వ్య. 'లేదు. నెపోలియను బోనపార్టు పూర్వం శ్రీమంతులుండేస్థానాన్ని ఆక్రమించుకొన్నాఁడు. తక్కినపరాసుప్రజాసమూహం ఆతనికి గులాములై వుండినారు.'

భీ. రె. పరాసురాజ్యవిప్లవం హెచ్చుతక్కువలనే కారణంవల్లనే కలిగింది. కాని అవియేమీ అడుగంటలేదు. నెపోలియను పరాసురాజ్యానికి చక్రవర్తి అయినాఁడు. ఆతని మొదటిభార్య సామాన్యకుటుంబంలో పుట్టినయాఁడుది. రాజవంశంలో పుట్టినరాచపట్టి కాదనేకారణంవల్ల నెపోలియను తమకు తుల్యుఁడని ఆస్ట్రియా మొదలగురాజ్యాల నేలేప్రభువులు భావించ లేదు. అందువల్ల నెపోలియను మొదటిపెళ్ళాన్ని విడిచేశాఁడు. విడిచేశి ఆస్ట్రియా ప్రభువురాజపుత్రిక పెండ్లి చేసికొన్నది హెచ్చుతక్కువలవల్లనే కాదా?'

మొ. వ్య. 'అవు నవును.'

భీ. రె. 'అంత దూరానికి మనకు పోవఁ బనిలేదు. శ్రీ పంచమజార్జి చక్రవర్తికొడుకు ఎన్మిదో ఎడ్వర్డు తాను వలచినరంభను విడవడానికి ఇష్టం లేక గాదా ఇంత పెద్దరాజ్యాన్ని వదలింది? దానికి కారణం ఏంది?'

మొ. వ్య. 'ఆయువిద రాజపుత్రిక కాదనేదే కారణం?'

భీ. రె. ప్రపంచంలో ఈ హెచ్చుతక్కువలు మానవజన్మంతో పుట్టుచూ వుంటవి. వాట్ని తీసివేయడానికి మీ గాంధిమహాత్మునివల్లనూ కాదు. ఆతణ్ణి పుట్టించి వుండే బమ్మదేముడివల్లనూ కాదు. ఒక్క హైందవసంఘంలోనే కాదా హెచ్చుతక్కువలుండడం. 'వాట్ని పురస్కరించుకొంచూ మీ గాంధిమహాత్ముఁడు కాంగ్రెస్సుమూలాన అంటరానితనాన్ని మాయించడానికి పూనింది అధర్మం.' అనేది మావాదం. దానివల్ల కాంగ్రెస్సు హైందవసంఘసంస్కారసంస్థ. కాని రాజకీయసంస్థకాదనడం మాసిద్ధాంతం.'

మొ. వ్య. 'మాలవాళ్ళు అన్యమతంలో చేరడం జాతిమతభేదాన్ని అనుసరించి వుండే హెచ్చుతక్కువలవల్ల కాదా?'

భీ. రె. 'కాదు.'

మొ. వ్య. 'ఏల?'

భీ. రె. మాలవాళ్ళు దరిద్రులు. కూలి చేసి జీవిస్తూవుండేవాళ్ళు. కూలి చిక్కనప్పుడు, వాళ్ళకు పస్తుండవలసి వస్తుంది. భూమి పుట్ర లేవు, దున్ని పండించుకొంటూ తినడానికి. అదిన్నీకాక నేతవృత్తి వడ్లంగియీలాంటిచేతివృత్తులవల్ల పుష్కలంగా జీవనం వాళ్ళకు పూర్వం వుండింది. కూలి చిక్కినా, చిక్కకపోయినా ఆఁకలిచిచ్చు ఆరకుండింది లేదు. సుఖజీవనంచేస్తూ వుండేవాళ్ళు. అది యిప్పుడు మాసింది.'

మొ. వ్య. 'ఎందుకని?'

భీ. రె. 'పూర్వం చెప్పాను గదండి వాళ్ళ తాతముత్తాతలు చేస్తూ వాళ్ళ వంశక్రమాగతమై వుండే నేత, కమ్మర, కంచర — ఈలాంటివృత్తులు నశించి వుండడమే కారణం. నెల్లూరుమండలంలో కందుకూరనేవూరుంది. అందున్నూ దానికి చుట్టుపట్లా వుండే గ్రామాదుల్లోనూ మాలవాళ్ళు నేస్తూ వుండేదుప్పట్లను కొనక వాళ్ళకు వుండే అంటరానితనాన్ని తీసి వేయాలంచూ వాగుచూ వుండే కాంగ్రెస్సుకత్తువాళ్ళల్లో ఎందరుంటున్నారు? దయ చేసి చెప్పండి?'

మొ. వ్య. 'కొనకయేమండి? ఆలా కాంగ్రెస్సువాళ్ళ మీఁద నిరాధారంగా నేరం మోపడం ధర్మంగాదండి, మీకు.'

భీ. రె. 'నిరాధారంగా వాళ్ళమీఁద నేరం మోపను. అది నాపనికాదు. దయచేశి వినండి. కాంగ్రెస్సు సభ్యుల్లో చట్టసభలకు దగినవరులు లేరు. దానివల్ల "నీవు మాకాంగ్రెస్సు చేరుతావా? నీవు చేరుతావా?" అంటూ పేరంటం బెట్టి పిలుస్తూ వున్నారు మీకాంగ్రెస్సుసభ్యులు. అవునా కాదండీ?'

మో. వ్యా. 'అ—వు—ను.'

భీ. రె. డిల్లీ చట్టసభలో సభ్యులుగా వుండేవాళ్ళల్లో ఖద్దరు కట్టేవాళ్ళెందరు? చెన్నపురి వర్తకులగుంపునకు ప్రతినిధిగా వరింపఁబడివుండే వైశ్యప్రముఖుఁడున్నా, అలాగే బ్రాహ్మణబ్రువుఁడున్నా, ఖద్దరుకట్టుతూ వున్నారా? కౌన్సిల్ ఆఫ్ స్టేటుకు వరింపఁబడ్డముగ్గురు సభ్యుల్లో ఇద్దఱు ఎప్పుడైనా వాళ్ళజీవితకాలంలో ఖద్దరు ధరించి వుంటారా? దయచేశి చెప్పండి.'

మో. వ్యా. 'బదులు లేదు. తల వంచును.'

భీ. రె. 'ఇప్పుడు చెన్నపట్టణంలో శాసనసభాధ్వయాలకు వరింపఁబడబోయే కాంగ్రెస్సు వర్గీణుల్లో, జస్టిస్ వర్గమునుంచి చీలి కాంగ్రెస్సులో చేరి వుండే వాళ్ళున్నా వుంటున్నారు. వాళ్ళు వాళ్ళజీవితదశలో గానీ, కాంగ్రెస్సుసభ్యులైన వెనుకనుగాని, ఖద్దరు ధరిస్తూ వుండేరా? ధరిస్తూ వుంటున్నారా? దయచేశి చెప్పండి.'

మో. వ్యా. 'వంచినతల ఎత్తలేదు. అదే బదులు.'

భీ. రె. 'పోనియ్యండి. అసహాయోద్యమప్రచారం ప్రారంభించినసుత కాంగ్రెస్వాలనుఁ బోయి బహు కష్టపరంపర లనుభవించినమహనీయు లున్నారు. వాళ్లను మేము నిందించం. అట్టివాళ్ళొక్కకొందఱే వుంటారు. వారిని విడిచి కాంగ్రెస్సుక్రీడను (అనఁగా మతాన్ని) ఒప్పుకొని అందు క్రొత్తగా సభ్యులై వుండేమాలోళ్ళకు ప్రతినిధులున్నా, తురకలకు ప్రతినిధులున్నా, క్రైస్తవులకు ప్రతినిధులున్నా, ఖద్దరు ధరించేవాళ్ళైనా? దయచేశి సెలవియ్యండి. వీళ్ళందఱున్నూ శాసనసభాధ్వయంలో సభ్యులుగా వరించబడ్డ వెంటనే (1) 'అంటరానితనాన్ని తొలగించవలసింది. (2) మాలోళ్ళకు దేవాలయప్రవేశం కలిగించవలసింది.' అనేతీర్మాను రెండింటిని చేయబోయేవాళ్ళేకాదండి. దీనికే వోట్లభిక్షను అడగడం కూడాను. మాలవాళ్ళు నేస్తూ వుండే బట్టలను కొంటూ వాళ్ళ ఆర్థికస్థితి బాగుచేశేయత్నం విడిచారు. అయితే శాసనసభాధ్వయంలో ప్రవేశించి క్రొత్తరాజ్యాంగాన్ని తలబ్రద్దలయ్యేలాగా పగులగొట్టడానికి కాదు. అది వాళ్ళవల్ల కానిపని. దాన్ని చేయడానికి వాళ్ళు పూనుకొన్నారంటే' "మంత్రులు వద్దు; గింత్రులు వద్దు. సభా వద్దు గిభా వద్దు. నేనే చెన్నరాజ్యభాగాన్ని పాలిస్తాను. మీరు కాలికి బుద్ధి చెప్పండర్.' అని గవర్నరే నిరంకుశంగా చెన్నరాజ్యభాగాన్ని పాలిస్తాడు. ఇది నిక్కం. ముమ్మాటికి నిక్కం. "శాసనసభల్లో ప్రవేశిస్తాం. ప్రవేశించి క్రొత్త రాజ్యాంగంయొక్కతలను చీల్చి వేస్తాం. స్వరాజ్యం పదేండ్లలోపలవస్తూవుంది.' అని వోట్లభిక్షకై నిలిచి వుండేకాంగ్రెసు వరగణాలు చెప్పడం లోకజ్ఞానం లేకుండా అమాయికులై వుండే పల్లెటూళ్ళవాళ్ళను మోసం చేయడానికే అయివుంది.'

మో. వ్యా. 'అవునుకా' 'ఇది ఎంతసేపబ్బా' (అని మనమున ననుకొనును.)

భీ. రె. 'కొంతశాఖాచంక్రమణం అయింది. అట్లయినా మీ కడిగి తెలుసుకోవలసినవిషయాలే అవి కూడాను. ఇంక హెచ్చుతక్కువవల్ల నే మాలోళ్ళు అన్యమతగ్రహణం చేస్తూ వుంటున్నారంటూ మీ గాంధమహాత్ముఁడు చేసే దాన్ని ఈలా ఖండిస్తా. నేను ఖండించేవిధం సహేతుకంగా లేకుంటే నన్ను శిక్షించండి. ఆశిక్షను తలమోస్తా.'

మో. వ్యా. 'ఏలా?'

భీ. రె. 'అది పంచములంతా దారిద్ర్యదశవల్ల అన్యమతంలో చేరుతున్నారే కాని హెచ్చుతక్కువలవల్ల కానే కాదు. మీ గాంధమహాత్ముఁడు కాంగ్రెస్సుకు ఈ అంటరానితనాన్ని అంటగట్టినప్పటినుండి నేఁటిదాక అంటరానితనాన్ని తీసివేయడానికి అతఁడు చెప్పుతూ వుండేకారణాల్లో ఇది వొక్కటి; కాని పంచములలో వొక్కఁడుకూడ ఆకారణం చెప్పనే లేదు.'

మో. వ్యా. 'పంచములకుఁ బ్రతినిధులుగా వుండేవొక కొందఱు హెచ్చుతక్కువలవల్ల నే అన్యమతాన్ని స్వీకరిస్తాం' అంటూ ఘోషిస్తూ వున్నారు. వారి ఘోష వినబడలేదా తమకు?

భీ. రె. 'వినబడకేమి? వినబడుతూనే వుంది. అయితే పంచములలోఁ జదువను వ్రాయను వచ్చినవారసలే లేరు. ఒక్కొక్కరాజ్యభాగానికిన్నీ వొక్కఁడో, ఇద్దఱో, ముగ్గురో నాల్గుఇంగ్లీషుముక్కలు నేర్చుకొన్నవారుంటారేమో. ఆప్రకారం నాల్గింగ్లీషుముక్కలు నేర్చుకొన్నపంచము లొకకొందఱు, పంచములకు ప్రతినిధు లని దొరతనం నిర్ణయించింది. ఆకారణంవల్ల వాళ్ళు పంచములకుఁ"

ప్రతినిధులేమాత్రంకారు. అవునా కాదా?'

మొ. వ్య. 'అవు నవును.'

భీ. రె. 'హిందూసంఘం జాతిమతభేదాలవల్ల పంచములను తక్కువగా భావిస్తూ వాళ్ళను దూరాన వుంచి వుంది. అది అధర్మం. వాళ్ళను దగ్గఱకు రానియ్యకపోతే వాళ్ళన్యమతగ్రహణం చేస్తారు.' అని గాంధీన్నీ, అతని మాటవిన్న పంచమవ్యక్తు లొకకొందఱున్నా చెప్పుచున్నారే కాని గ్రామాదుల్లో వుండే పంచముల్లో ఒక్కఁడుగూడా చెప్పినపాపాన బోయిందిలేదు. ఇంగ్లీషుభాషావాసన కలిగినపంచములున్నా, మొండిచేయివానికి నువ్వులు తినడానికి వుపాయం చెప్పే మానవులంబోలినబ్రాహ్మణబ్రువులొకకొందఱున్నా, హెచ్చుతక్కువలం చున్నారే కాని తక్కిన పంచము లెవ్వరున్నా దాన్ని పాటిస్తూ వుండేలాగా తోఁచడం లేదు. కావున హెచ్చుతక్కువలవల్ల అన్యమతగ్రహణం పంచములు చేస్తారనడం నిరాధారమైన వాదం. గాంధి చెప్పినప్రకారం 'హెచ్చుతక్కువలవల్లనే పంచము లన్యమతగ్రహణం చేస్తా' రనేవాదం వాస్తవం, అనేమాటసరికి యొప్పుకొందాం అనుకోండి. అప్పటికిన్నీ హిందూసంఘంలో వుండే హెచ్చుతక్కువలు అన్యమతగ్రహణం చేసినవాళ్ళలోను కంటబడుచూనే వుంటున్నవి. ఏమతంలో చేరినా ఆయుచ్చుతక్కువలు దృశ్యము లవుతూ వుంటున్నవి. లేదంగురా?'

మొ. వ్య. 'లేదని ఏలా చెప్పను?'

భీ. రె. 'క్రైస్తవమతబోధకులలో పశ్చిముఖండవాస్తవ్యు లున్నారు. అవునా కాదా?'

మొ. వ్య. 'వున్నా రనేకులు.'

భీ. రె. 'వాళ్ళమతబోధను విని క్రైస్తవమతగ్రహణం చేసి వుండేస్వదేశక్రైస్తవులను, క్రైస్తవమతబోధకులై వుండే శ్వేతముఖులు, దగ్గఱ చేర్చరు; తమపంక్తిలో వణ్ణం తిననీయరు; తాము తినే ఆహారపదార్థాలు వాళ్లకు పెట్టరు. రాగి, జొన్న, సజ్జ ఈమున్నగుగట్టిగింజలసంకటి వాళ్ళకుఁ దినడానికి వేస్తారు. స్వదేశక్రైస్తవస్త్రీలను వాళ్ళు పెండ్లాడరు. ఈతీరున క్రైస్తవమతబోధకులై వుండేశ్వేతముఖులు స్వదేశక్రైస్తవుల నికృష్టంగా భావిస్తారు. ఆలాగే చూస్తారు కూడాను.'

మొ. వ్య. 'తాము సెలవిచ్చే విషయాలు క్రొత్తవిగా వుంచూ వున్న వేళ?'

భీ. రె. 'క్రొత్తవి కావు. పాతవే. వాస్తవములైవుండు విషయాలే. స్వదేశక్రైస్తవుల కున్నతవిద్యను అయిగోపాక్రైస్తవమతబోధకులు నేర్పించరఁట. క్రైస్తవమతాన్ని బోధించడానికి వలసి వుండేవిద్యమాత్రం నేర్పిస్తారు. క్రైస్తవమతబోధకులు నడిపేపాఠశాల లనేకము లున్నవి కావా? హైందవబాలికలకు డబ్బిచ్చి చదువు నేర్పిస్తారఁట. అయితే తమ అధీనంలో వుండేస్వదేశక్రైస్తవబాలికలకు వాళ్ళు డబ్బిచ్చి విద్య నేర్పియ్యరఁట. క్రైస్తవమతబోధకులైన శ్వేతముఖు లుండేగృహాలు రాజభవనాలలాగ వుంటూ వున్నవి. అయితే వాళ్ళ తాబేదారిలో వుండేస్వదేశక్రైస్తవప్రజలయిండ్లతీరు మీరు చూచి వున్నారో లేదో కాని మన మాలవాళ్ళయిండ్లే వేయి మడుఁగులు మేలనిపిస్తవి. క్రైస్తవమతంలో చేరేదాక శ్వేతముఖులై వుండేక్రైస్తవమతబోధకవర్గాలు తమ కన్నివిధాల స్వదేశస్థులుఁ దుల్యు లంటూ భావిస్తా, ఆప్రకారం కార్యరూపేణ చేస్తా వుంటారు; క్రైస్తవమతగ్రహణం చేశిచేయునివెంటనే, ఆ శ్వేతముఖులై వుండేక్రైస్తవమతబోధకులు క్రొత్తగా క్రైస్తవమతాన్ని స్వీకరించినవాళ్ళను మహాహీనంగా చూస్తూ వుంటారు. వాళ్ళచే అష్టచాకిరి చేయించుకొంటూ వుంటారు. క్రైస్తవమతగ్రహణం చేయడానికిపూర్వం తమకు తుల్యులనుగా భావించి ఆ ప్రకారం వర్తిస్తూ వుండిన శ్వేతముఖులైనక్రైస్తవమతబోధకులు క్రైస్తవమతాన్ని గ్రహించినవెనుక వాళ్ళను మహానీచంగా చూస్తూవుండే దానికి కారణం ఏమి? దయచేసి సెలవియ్యండి.'

మొ. వ్య. 'హెచ్చుతక్కువలే కారణాలు.'

భీ. రె. 'హిందూసంఘం మిమ్ములను తక్కువగా చూస్తూ వుంది. మా క్రైస్తవమతంలో చేరండి. వెంటనే మిమ్ము మాను తుల్యంగా భావిస్తాం; ఆలాగే క్రియారూపేణ చేస్తాం' అని మాలవాళ్ళ నూరించి చెప్పుతారు. వాళ్ళమాటలు విని క్రైస్తవమతాన్ని స్వీకరించే మందబుద్ధులను మహాహీనంగా చూస్తారు, ఆ తెల్లముఖులైనక్రైస్తవమతబోధకులు. ఎందుకండీ యీలాటిభేదప్రవర్తన ఈ క్రైస్తవమతబోధకులకు?'

మొ. వ్య. (మౌనముద్రధరించి ఆవెనుక) 'స్వదేశక్రైస్తవుల్లో ఆంగ్లేయభాషలో ఉన్నతవిద్య నేర్చినవా రనేకు లుంటున్నారే. అదెట్లా?'

భీ. రె. 'నేను ముందుచెప్పిందంతా స్వదేశక్రైస్తవజనసామాన్యానికి. ఏదో తప్పిదారి బుద్ధిమంతులైన క్రైస్తవు లున్నతవిద్య చదివి దొరతనంలో గొప్పగొప్పకొలువులు వక్కీళ్ళవృత్తి వైద్యవృత్తి ఈ మున్నగుజీవనాధారాలవల్ల క్రైస్తవమతబోధకులైయిగోపావాళ్ళధనసాహాయ్యం లేక స్వతంత్రులై

జీవిస్తూ వున్నారు. అట్టివాళ్ళల్లోనే ప్రాటెస్టెంటు శాఖా క్రైస్తవులున్నూ రోమన్ కాథలిక్కు క్రైస్తవులున్నూ వేఱువేఱుగా సభలు చేసుకొంటూ మెల్లమెల్లగా పశ్చిమఖండవాస్తవ్యులై వుండే క్రైస్తవమతబోధకులు క్రైస్తవమతంలో చేర్చుకోడానికై చేస్తూ వుండే మతస్థితంపుఁగార్యాలనున్నూ, వ్యాపారాలనున్నూ, ఏవగించుచూ వుంటూ, దూరందూరంగా తొలగి తొలగి వేఱుపడి పోవుచూ వుంటూ వున్నారు.'

మొ. వ్యా. 'అయితే హెచ్చుతక్కువభేదాలేలా కలిగినవో మనదేశంలో.'

భీ. రె. హెచ్చుతక్కువలెల్ల దేశాల్లోనూ వుంటూ వున్నవి. లేవనడానికి వీలులేదు. హిందూసంఘంలో మతభేదాలవల్ల హెచ్చుతక్కువలుంటే, అన్యదేశాల్లో ద్రవ్యాన్ని అనుసరిస్తూ ఆ హెచ్చుతక్కువలుంటవి.'

మొ. వ్యా. 'హిందూసంఘంలో వుండే హెచ్చుతక్కువలేలా బైటపడ్డవి?'

భీ. రె. 'హిందూసంఘంలో హెచ్చుతక్కువలుండినవి. నేఁటికిన్నీ వుంటూ వున్నవి. "మా నొసట బమ్మ రాశినాఁడు. లేనిది రమ్మంటే వస్తుందా? వున్నది పొమ్మంటే పోతుందా?" అనే వొకవిధమైన తృప్తితో అన్యదేశక్రైస్తవమతబోధకప్రజాసమూహం హిందూదేశంయొక్క మట్టిగడ్డమీఁద అడుగుపెట్టేవఱకూ జనసంఘం వుంటూ వచ్చింది. అది ఎప్పుడీ దేశంలో అడుగుపెట్టిందో, అప్పటినుండి నేఁటిదాక హెచ్చుతక్కువలనేవాదం పుట్టింది. క్రమక్రమంగా నావాదం పెచ్చుపెరిగింది. ఇప్పుడది గాంధియత్నంవల్ల పెద్దకొండ అయింది. హెచ్చుతక్కువలవల్లఁ బూర్వం లేనికలహాలు క్రైస్తవమతబోధకులవల్లనున్నూ, వాళ్ళవల్ల ఆంగ్లేయవిద్యాభ్యాసము నేసి వుండే హిందువులవల్లనున్నూ కలిగినవి. కలుగుచూ వున్నవి. అనంతము లైనవి.'

మొ. వ్యా. 'క్రైస్తవమతబోధకులురాకముందేల ఈ హెచ్చుతక్కువలవల్ల జగడాలు లేవు?'

భీ. రె. 'మాలవాళ్ళ కన్నిచేతివృత్తులు తెలిసి వుండినవి. అన్నిటికంటే నేతవృత్తి వాళ్ళకు ముఖ్యం. అది జీవించి వుండేదాక వాళ్ళయొక్క ఆర్థికస్థితి బాగుగా వుండేది. అన్నోదకాలకు వాళ్ళకేమాత్రం తక్కువ లేదు. ఆ కారణంవల్ల ఆ హెచ్చుతక్కువలు వాళ్లు పాటించేవాళ్ళు కారు. నేఁటికిన్నీ మాలవాళ్ళు హెచ్చుతక్కువలు ఏమాత్రం తమ కున్నవనే విషయంగూడా తలఁచరు.

మొ. వ్యా. 'ఆ నేతవృత్తి నశించిందేలాగా?'

భీ. రె. 'తూర్పిండియావర్తకసంఘం హిందూదేశాన్ని పాలించడానికి ప్రారంభించింది మొదలు నేతవృత్తి నశించింది. లంకషైరు నేతవృత్తి అభివృద్ధి చెందింది. చెందుచూ వుంది. ఆ కారణంవల్ల వారు కూటికి పేదలైరి కాని హిందూసంఘంలో వుండే హెచ్చుతక్కువలవల్ల వాళ్ళు అన్యమతగ్రహణం చేయుచూ వుండడం లేదనడం సిద్ధాంతం.'

మొ. వ్యా. "మాదిగవాళ్ళుంటున్నారుగాదా? మాలవాళ్ళకున్నూ అంటరానితనం వుందంటే, వాస్తవమా?"

భీ. రె. 'ఆయిద్దఱకున్నూ అంటరానితనం కద్దు. మాదిగవాడ మాలవాడలో కలిశి వుండదు; కొంచెం దూరంగానే వుంటుంది. వుభయులకున్నూ సంబంధబాంధవ్యాలున్నూ లేవు. మాలవాళ్ళు వేఱు; మాదిగవాళ్ళు వేఱు. వాళ్ళు తాకినబావినీళ్ళు వీళ్ళు చేదుకోరు. మాదిగవాళ్ళు తమకంటే మాలవాళ్ళు తక్కువ అంచూ వాదుకొంచుంటారు. మాలవాళ్లు మాదిగవాళ్ళు తమకంటే మిక్కిలి నీచం అంచూ చెప్తారు. ఆ మొదలుగా వుండే కారణాలవల్ల వుభయులకు ఎప్పుడున్నూ పొత్తు కుదరడం లేదు. ఆ ఇద్దఱకున్నూ వుండే అంటరానితనాన్ని గూర్చి మీ గాంధిమహాత్ముఁడేమంటాఁడు? ఆ అంటరానితనాన్ని తీసివేయడానికి మీ గాంధిమహాత్ముడు ప్రయత్నించ లేదు. అదేల?'

మొ. వ్యా. 'ఆ విషయం మా గాంధిమహాత్ముని బుద్ధికెక్కింది గాదు.'

భీ. రె. 'ఏల?'

మొ. వ్యా. 'కారణం తెలియదు.'

భీ. రె. 'నేను చెప్తా వినండి. మీ గాంధి చక్కఁగాఁ బుద్ధి తెలియకముందే పసితనంలోనే ఖండాంతరాలకు పోయినాఁడు. పోయి ఆడనే కాపురం బహుకాలం చేశాఁడు. అప్పుడప్పుడు స్వదేశానికి వచ్చుచున్నూ పోవుచున్నూ వుండినాఁడు. వుండినా హైందవసంఘంయొక్క ప్రాచీనసంప్రదాయాలాతనికి తెలిసి వుండవు. అక్కడికి పోకముందవి తెలిశి వుండినా, పాశ్చాత్యులతో బహుకాలం కలిసి వర్తిస్తూ వుండడంవల్ల స్వసంఘసంప్రదాయాలు ఆతనికి జ్ఞప్తి వుండవు. వాట్ని మఱచి వుంటాఁడు. అదిన్నీ కాక ఆ దేశాల్లో వుండే క్రైస్తవమతబోధకులవుపదేశాలాతడు అనవరతం శ్రవణం చేశాఁడు. శ్రవణం చేశివుండే విషయాన్ని మననం చేశాడు. ఇంకా చేస్తూ వుంటున్నాఁడు. మననం చేశి ధ్యానిం

చేశాఁడు. ధ్యానం చేశి ధారణ చేశాఁడు. ధారణ చేశి భ్రమరకీటన్యాయ్యేన క్రైస్తవమతస్థుడైనాఁడు. అతఁడు అఫ్రికాను వదలి హిందూదేశానికి వచ్చాఁడు. క్రైస్తవుఁడు కొండకొనమీఁద వుపదేశించి వుండేపండ్రెండువిధాలైనసూత్రాలను అందఱకున్నూ వుపన్యాసంచేయడానికి ప్రారంభించాఁడు. తురకలతో తానున్నూ తురకవాణ్ణే అని అన్నాఁడు. క్రైస్తవులతో క్రైస్తవమతబోధకులే తనకు ఆచార్యులని చెప్పాఁడొకచోట.

మొ. వ్యా. 'ఏచోట ఏసందర్భాన మాగాంధమహాత్ముఁడాలాగా అన్నాఁడు?'

భీ. రె. 'సర్వరాజకీయకక్షాద్వితీయసమావేశానికి లండనుకుఁ బోయినాఁడు. పోయి అడ క్రైస్తవమతబోధకులగుంపులసముఖంలో వుపన్యాసం చేశాఁడు. అప్పుడు క్రైస్తవమతబోధకులే తన కాచార్యులని పల్కినాఁడు. అవునా కాదండీ.'

మొ. వ్యా. 'ఒకవేళ ఆతఁడాలా చెప్పినా చెప్పి వుండవచ్చును. అయితే నాకా విషయం జ్ఞప్తిలేదు.'

భీ. రె. 'నాయొక్కపూర్వోక్తులనుండి యుక్తాయుక్తజ్ఞానము కలమనుష్యునకు నిశ్చయించుకోవలసి వుండే నిశ్చయం ఏంది? మీగాంధమహాత్ముఁడు, క్రైస్తవమతస్వీకారము చేయలేదు. అయినా అతని నడవడి కలున్నూ ఉపన్యాసములున్నూ అతనినుతాచారానుష్ఠానములున్నూ అతఁడు క్రైస్తవమతస్థుఁడే అనేది మాసిద్ధాంతం. భగవద్గీతను అతడు చదువుఁగాక. అతఁడు తాను సనాతనధర్మపరాయణుఁడనని చెప్పినను చెప్పుకోఁగాక. హైందవసంఘముయొక్క నిర్మాణక్రమ మాతనికి తెలియదు. తెలిసి వుండందంటే, అంటరానితనాన్ని మాయం చేయించే దుష్టకార్యం కాంగ్రెసుకు తాలిబొట్టుగా కట్టి వుండడనేది మాతీర్పు.

వెలివైవఁబడినశాసనసభలయందు దేశీయ మహాజనసభాసభ్యులకుఁ బ్రవేశింప రెండవ తడవ ననుజ్ఞ గాంధి యేల యిచ్చెను?

భీ. రె. 'మీగాంధమహాత్ముఁడు బ్రిట్టిషుదొరతనాన్ని హిందూదేశాన్ని పట్టిపీడించేశని అని అన్నాఁడా లేదా?'

మొ. వ్యా. 'అన్నాఁడు.'

భీ. రె. 'ఇంగ్లీషుప్రభుత్వం శనిదై వుండిదంటే దాని సంస్థలన్నీశనుల వే కావా?'

మొ. వ్యా. 'అవును.'

భీ. రె. 'శాసనసభలున్నూ దొరతనంవారిసంస్థల్లో చేరి వుండే వే కావా?'

మొ. వ్యా. 'చేరివుండే వే.'

భీ. రె. 'శాసనసభలున్నూ ఇంగ్లీషుశనిగణంలో చేరిన వే కావా?'

మొ. వ్యా. 'చేరిన వే.'

భీ. రె. 'ఆకారణంవల్లనే కాఁగా శాసనసభలను అన్నింటినీ వోంప్రథం కాంగ్రెస్సుచే మీగాంధమహాత్ముఁడు వెలివేయించాడు.'

మొ. వ్యా. 'ఆకారణం వొక్కటే కాదు. శాసనసభల్లో చేరడంవల్ల స్వరాజ్యం రాదు. అవి నేతిబీఱకాయలు. అందుండి పనిచేయడంవల్ల నిగ్గు తేలదు. శాసనసభలకు బైట వుండి కాంగ్రెస్సుయొక్కముఖ్యోద్దేశాలు జనసామాన్యానికి తెలియచేస్తూ వుండడంవల్ల కొంత లాభం కలుగుతుంది. ఆపాటిలాభంకూడా శాసనసభలవల్ల లభ్యపడదు. దానికొగ్గాను పాటుపడేదంతా వ్యర్థం. శాసనసభల్లో ప్రవేశించడం అప్రధానం. అందువల్ల శాసనసభలను కాంగ్రెస్సుచే గాంధిమహాత్ముఁడు వెలివేయించాఁడు.'

భీ. రె. 'మీగాంధమహాత్ముఁడాలాగా కాంగ్రెస్సుచే వెలివేయించినశాసనసభల్లో తిరుగా కాంగ్రెస్సు సభ్యులకు 'స్వరాజ్యకక్షి' అనుపేరుతో ప్రవేశం కలిగించాఁడఁట. అదెప్పుడు?'

మొ. వ్యా. 'గాంధిమహాత్ముఁడు కారాగృహంలో వుండినాఁడు. గయలో కాంగ్రెస్సు నడిచింది. దానికి సి. ఆర్. దాసు అధ్యక్షుఁడు. ఆతఁడప్పుడు కాంగ్రెస్సునుండి 'స్వరాజ్యకక్షి' అనేకక్షను చీలదీశాఁడు, చీలదీశి శాసనసభల్లో చేరవల్సింది. చేరి, మంత్రిస్థానాలు కోరకూడదు. దొరతనం తమనట్ట ప్రకారం పిల్చి ఇచ్చినా వాట్ని తీసికోకూడదు. ఏలుబడి కనుకూలంగా ఏయంశంలోనున్నా స్వరాజ్యకక్షాసభ్యులకు వర్తించుకోరాదు.' అని తీర్పు ఆతఁడు కాంగ్రెస్సుచేత చేయించినాఁడు. ఆవిషయం తమకు తెలుసునా?'

మొ. వ్యా. 'తెలియక ఏమి?'

భీ. రె. 'ఈయంశము లంతా మీగాంధమహాత్మునితో కలిసి ముందుగా మాటలాడి ఆవెనుక కాంగ్రెస్సుచే ఆతీర్పు చేయించి వుంటాఁడనుకొంటాను.'

మొ. వ్యా. 'గాంధిమహాత్మునియంగీకారం పొందియే సి. ఆర్. దాసుఆలాచేశి వుంటాఁడు.'

భీ. రె. 'ఆ సి. ఆర్. దాసు కాంగ్రెస్సుచే చేయించిన తీర్పుప్రకారం స్వరాజ్యకక్షాసభ్యులు శాసనసభల్లో

ప్రవేశించారు. ప్రవేశించి దొరతనాని కెదురొడ్డి సర్వతంత్రస్వాతంత్ర్యంగా వుండేస్వరాజ్యాన్నిసంపాదించారా? ఆప్రకారం సంపాదించడంవల్ల ఇంగ్లీషు వాళ్ళు హిందూదేశాన్ని వదలి తమలంకారాజ్యానికి వెళ్ళారా?'

మొ. వ్య. రెండున్నూ జరగ లేదు. ఆప్రథమస్వరాజ్య కక్షూసభ్యులవల్ల స్వరాజ్యమున్నూ రాలేదు. ఇంగ్లీషు వాళ్ళు హిందూదేశాన్ని వదలేశి తమలంకారాజ్యానికిన్నీ పోవనూ లేదు.'

భీ. రె. 'సర్వతంత్ర స్వాతంత్ర్యం కల్గివుండే స్వరాజ్యాన్నిసంపాదించవలసిం దనేది ప్రథమస్వరాజ్యకక్షూసభ్యులవుద్దేశం. అది శాసనసభలమూలాన వాళ్ళు సాధించలేదు. మ రేందిసాధించారు వాళ్ళందు ప్రవేశించి?'

మొ.వ్య.(ఆత్మలో)'ఈసంసారి నన్ను విడవడు. ప్రథమస్వరాజ్యకక్షూసభ్యు లంతా సి. ఆర్. దాసు చేయించినకాంగ్రెస్సుతీర్పుచొప్పున ఆడిల్లీశాసనసభలో ప్రవేశించి దానిప్రకారం ప్రవర్తించుకోక, తమతమ వ్యక్తిగతములుగా వుండే హైందవసాంఘికవిషయాల కాసభలో ప్రసక్తి కలిగించారు. దానివల్ల దేశీయ మహాజనసభ కే చెడ్డపేరు వచ్చింది. దేశంలో సనాతనధర్మపరులసంఖ్య అధికం. వాళ్ళ కీసభయందుండేభక్తిశ్రద్ధలు సన్నగిల్లినవి. అదిన్నీ కాక వాళ్ళిప్పుడు దాని కెదురు తిరిగారు. ఏం చేయడానికిన్నీ తోచకుంది? ఈభీమశంకరంరెడ్డి ప్రశ్నలు వేశేధోరణి ఆలోంచి చూస్తే బాలికావివాహనిషేధ శాసనాన్ని కే నన్ను లాగేలాగా తోస్తూ వుంది. అయినా నాశక్తికొలందిన్నీ కాంగ్రెస్సుసంస్థచర్యనే అన్నివిధాల సమర్థిస్తా'. (అని ప్రకాశముగా) 'శాసనసభలమూలాన సంపూర్ణస్వాతంత్ర్యం ఏలా వస్తుంది? రాదు. రానున్నూ లేదు.'

భీ. రె. శాసనసభలమూలాన వాళ్ళనుకొన్నలాగున స్వరాజ్యం సంపాదించలేదు. అయితే వాళ్ళందుం ప్రవేశించి సాధించి వుండేమహాకార్యస్వభావం ఏంది?'

మొ. వ్య. 'ఏ మని చెప్పను?'

భీ. రె. 'మొంప్రథం డిల్లీశాసనసభలో ప్రవేశించి వుండినకాంగ్రెస్సుసభ్యులలో పెక్కండ్రు బాలికా వివాహనిషేధశాసనాని కనుకూలు రై వుండి దాన్ని శాసనంగాం జేయవలసిం దని గట్టిపట్టు పట్టినా రంటే. వాస్తవమా?'

మొ. వ్య.''వాస్తవ మే. అది వ్యక్తిగత మై వుండే అభిప్రాయం. కాంగ్రెస్సు అలాగా ప్రవర్తించవలసిందం చూ వాళ్ళ కేమాత్రం అప్పుడు అనుజ్ఞ ఇయ్యలేదు. దానివల్ల వాళ్లవ్యక్తిగతము లై వుండేఅభిప్రాయాలకు కాంగ్రెస్సు ఏమాత్రమున్నూ పూచి పడదు. కాంగ్రెస్సు ఆవిషయంలో దోషి కాదు.''

భీ. రె. 'పదునాలుగేండ్లవయస్సుకు లోబడినఆడబిడ్డను పెండ్లి చేశేవాళ్లకు శిక్ష' అనేవాక్యంలో వుండే 'పదునాలుగేం'' డ్ల నేదాన్ని 'పదునెన్మిదేండ్లుగా' మార్చవల్సిం దంచూ కారాగృహంలో వుండేగాంధి కాంగ్రెస్సుసభ్యులకు తంతి ఇచ్చినాం డంటే. వాస్తవమా?

మొ. వ్య. 'వాస్తవ మే. అయితే అది గాంధియొక్క వ్యక్తిగత మై వుండేఅభిప్రాయం. కాంగ్రెస్సుది ఏమాత్రం కాదు. అదిన్నీ కాక అప్పుడతండు కాంగ్రెస్సులోనూ లేండు. చెరలో వుండినాండు. కాంగ్రెస్సు పేరుతో ఆసంఖ్యను మార్చవలసిందిగా కాంగ్రెస్సు సభ్యులకు తంతి చేశా డని తలచడం అధర్మం. దానికి కాంగ్రెస్సు పూట పడదు.'

భీ. రె. 'అస్పృశ్యతను తొలంగించవలయును అని గొప్పింఃకూడా కాంగ్రెస్సే. కాని మతి యెవ్వరున్నూ కారు కాదా? అలాగే ఈబాలికావివాహనిషేధశాసనంకూడా.'

మొ. వ్య. 'అయితే ఆచట్టానికిన్గూడా కాంగ్రెస్సే ఉత్తరవా దనడ మే మీనిశ్చితాభిప్రాయ మా?'

భీ. రె. 'మానిశ్చితాభిప్రాయం అయినా కాకపోయినా ఈసంఘసంస్కారవిషయాల్లో గాంధి తనభావాన్ని కాంగ్రెస్సుమూలాన నే తెలియ చేస్తూ వుంటాడు. ఆతనియభిప్రాయాని కెవ్వరున్నూ ఎదురాడరు. ఆతని మాటలకు అందరున్నూ గంగెద్దులు. విసన్న చెప్పిందంతా వేదవాక్కన్నట్లు గాంధిపలు కే కాంగ్రెస్సులో చట్టం. అంటరానితనంవిషయంలో గాంధి పలుకుచూ వుండేదే చట్టంగావుంటూ వుండ లేదా? రాజకీయసంస్థగా వుండేకాంగ్రెస్సు వొక్క హైందవుల కే కాక వాళ్ళకంటె భిన్నమతసులుగా వుండే మహమ్మదీయులాద్యనేకభిన్నమతస్థులకు వుమ్మడిసొత్తు. అట్టిదానిచే అంటరానితనం తీసివేయవలశిం దనిపించాడా లేదా మీగాంధిమహాత్ముండు. ఆతీర్పు అప్పటినుంచి నేటిదాక కొట్టువడక కాంగ్రెస్సురికార్డులో అట్లే నిట్టరాడులాగా వుంటూ వుందా లే దా? దానితోగూడా వెలివై వంబడినశాసనసభలాదిగాగల తీర్పులంతా కొట్టు వడినా లేవా? ఈఅంటరాని

తనంగూర్చినతీర్మాలాగే వుండడం ఎందుకు? దయ చేసి చెప్పండి.'

ము. వ్య. 'ఏమని చెప్పను? కానీయండి మీ వుపన్యాసం.'

భీ. రె. విసుగు చెందకండి. కాంగ్రెస్సుచే అంటరానితనం తీసివేయవలసిం దని యేలా అనిపించాడో, ఆలాగే బాలికావివాహనిషేధశాసనాన్ని కూడాను. కాంగ్రెస్సుప్రథమస్వరాజ్యకక్షిసభ్యులను, అలభీష్ముణ్ణి చంపడానికై అర్జునుఁడు శిఖండిని అడ్డం పెట్టుకొన్నలాగా, మీ గాంధిమహాత్ముఁడే తన కడ్డంగా పెట్టుకొంటూ బాలికావివాహనిషేధశాసనం చేశాఁడనేది మా దృఢాభిప్రాయం. హైందవసంఘాన్ని తాలుమాలుగా చేయవల్సిం దనేవుద్దేశంతో ప్రథమస్వరాజ్యకక్షిసభ్యులను ఢిల్లీ శాసనసభలకు మీ గాంధిమహాత్ముఁడు పంపినాఁడు. దానివల్ల స్వరాజ్యం ప్రాపించలేదు. కాని బాలికావివాహనిషేధశాసనం అబ్బింది. అంతే ప్రథమస్వరాజ్యకక్షిప్రయత్నంవల్ల గలిగి హైందవసాంఘికసంబంధంగా వుండేఫలం మీ గాంధిమహాత్ముని భావప్రకారం మంచిదైనా సరే; అస్మదాదులఅభిప్రాయప్రకారం చెడ్డదైనా సరే; అంతేకదండీ.'

ము. వ్య. 'అంతే! అంతే!!'

భీ. రె. 'శాసనసభాప్రవేశంవల్ల జనులకు లాభం కలుగదనేఅంశం సత్యం. ఆలాగా వుండేటప్పుడు మీ గాంధిమహాత్ముఁడుశాసనసభల్లో కాంగ్రెస్సుసభ్యులు చేరడానికి రెండవతడవ అనుజ్ఞ ఇచ్చి వున్నాఁడే. దానికి కారణం ఏంది?'

ము. వ్య. 'సంపూర్ణస్వాతంత్ర్యం వాటిమూలాన సాధించవచ్చు ననేది కొందఱిఅభిప్రాయం. వాళ్ళ కనుకూలంగా వుండడానికిగ్గాను గాంధిమహాత్ముఁడు రెండవతడవ వాళ్ళ కనుజ్ఞ ఇచ్చి వుండవచ్చు ననేదే కారణం అయి వుంటుంది.'

భీ. రె. 'పూర్వం ప్రథమస్వరాజ్యకక్షిసభ్యులు శాసనసభల్లో ప్రవేశించారు. దానివల్ల అప్పుడు స్వరాజ్యమేమో రాలేదు. ఇప్పు డుండేకాంగ్రెస్సుసభ్యులు ప్రవేశించడంవల్ల స్వరాజ్యం తప్పక వస్తుం దనడానికి బ్రిట్టిషుప్రభుత్వం అడు గంటిం దా?'

ము. వ్య. 'లేదు. ఇంకను అదారతన మే వుంది.'

భీ. రె. 'పూర్వం శాసనసభలను కలిగించి వుండేపార్లమెంటుద్వాయ మే కాదా క్రొత్తరాజ్యాంగాన్ని సృష్టించింది? ఆరాజ్యాంగప్రకారంగా నే కాదా క్రొత్తశాసనసభలన్నీ ఏర్పడబోవడం అవుతుంది.'

ము. వ్య. 'ఆరాజ్యాంగప్రకారంగా నే క్రొత్తశాసనసభ లంతా ఏర్పడ బోతుంది. అంతే.'

భీ. రె 'ముం దుండినశాసనసభలను సృష్టించివుండేబ్రహ్మలే ఇప్పుడుకూడా వాటిన్ని సృష్టించి వుంటూ వున్నారు. స్వరాజ్యం శాసనసభలమూలాన అప్పటిప్రథమస్వరాజ్యకక్షి కందకుండా చేసినపార్లమెంటుద్వాయం ఇప్పుడు కాబోయేక్రొత్తశాసనసభలమూలాన కాంగ్రెస్సుసభ్యులకు స్వరాజ్యం అందఁజేస్తుందా?'

ము. వ్య. 'అందచేస్తుందా? చేయదు.'

భీ. రె. 'ఇంగ్లీషుదారతనం అడుగంటిందా? లేదు. పార్లమెంటుద్వాయంచేతుల్లోనే హిందూదేశస్థితిగతులుంటూ వున్నవి. అప్పటికిన్నీ, ఇప్పటికిన్నీ, రేపటికిన్నీ, హిందూదేశస్థులకు స్వరాజ్యం ఇచ్చేవిషయంలో పార్లమెంటుద్వాయంయొక్కచిత్తవృత్తి సుంతైనా మాఱలేదు. అది వొక్కతీరున నే కాదా వుంది? మీ గాంధిమహాత్ముఁడు రెండవతడవ శాసనసభల్లో ప్రవేశించడానికి కాంగ్రెస్సుసభ్యుల కనుజ్ఞ ఇచ్చినాఁ డనేకారణాన్ని పురస్కరించుకొంటూ ఆపార్లమెంటుద్వాయం 'నీముద్దు మొఁగంగరుడసేవ' అంటూ స్వరాజ్యాన్ని మీ గాంధిమహాత్మునకున్నూ, ఆతనిచేతిబొంగరాలలాగా గిఱ్ఱని తిరుగుచూ వుండే మీకున్నూ ఇస్తుందా?'

ము. వ్య. 'ఇయ్యదు. అది స్వరాజ్యం ఇస్తుం దనేఅపేక్షతో కాంగ్రెస్సుసభ్యులకు గాంధిమహాత్ముఁడు శాసనసభల్లో ప్రవేశించేదాని కనుజ్ఞ రెండవతడవ ఇచ్చి వుండ డనేది మానిశ్చితాభిప్రాయం.'

భీ. రె. 'అయితే మఱెందుల కిచ్చి వుంటాఁడు?'

ము. వ్య. 'కారణం నా కూహించడానికి సాధ్యం కాదు. తెలిస్తే తామే సెల వియ్యండి. నేనున్నూ ఓర్పుతో వింటా.'

భీ. రె. 'సర్వరాజకీయకక్షులయొక్కసమావేశాలెన్ని తడవలు లండనులో జరిగినవి?'

ము. వ్య. 'రెండుమూఁడుపర్యాయములై వుండవచ్చును.'

భీ. రె. 'మొదటిదానికి మీ గాంధిమహాత్ముణ్ణి పిలిచిందా, బ్రిట్టిషుహోంగవర్నమెంటు?'

ము. వ్య. 'పిలవ లేదు. కాని రెండవపర్యాయం జరిగి వుండేసర్వరాజకీయపక్షములసమావేశానికి మా గాంధిమహాత్మునకు ఆహ్వానం లండనునుంచి దిగబడ్డది.'

భీ. రె. 'మొదటిదానికి పిలువక పోవడం ఏమి? అప్పుడు మీ మహాత్ముఁ డిండియాలో వుండే నైనం బ్రిట్టిషు

హోంగవర్నమెంటుకు తెలియదా? రెండవదానికి ఆహ్వానించడం ఎందుకు?'

మొ. వ్య. 'మొదటిది లండనులో జరిగినపుడు మా గాంధి మహాత్ముఁ డిండియాలోనే వుండేవిషయం హోంప్రభుత్వానికి తెలియక ఏమి? అయితే ఆ ప్రథమసమావేశానికి పిలవకపోయిందానికిన్నీ, రెండవసమావేశానికి పిలవడానికిన్నీ, కారణం నాకు తెలియదు.'

భీ. రె. 'నా కూహకు తట్టినంతవఱకూ కారణం చెప్తా. వినండి దయచేశి వోర్పుతో. అయితే నేను చెప్పఁబోయేకారణం అంతా నావూహ. నా స్తవం అంచూ నిశ్చయం చేయడానికి నాకు ప్రమాణాల్లేవిన్నీ లేవు. రెండవసర్వరాజకీయకక్షులసమావేశానికి బోవడానికి ముందున్నూ, పోయి లండనులో వున్నంతకాలంలోనున్నూ, ఆడనుండి తిరిగి ఇండియాకు వచ్చినవెనుకనున్నూ, మీగాంధిమహాత్ముఁడు చేసి వుండేరాజకీయములున్నూ, సాంఘికములున్నూ, అయి వుండేచర్య అంతా ఆకళింతకు తెచ్చుకొంచూ నాఅంతరాత్మకు తోఁచేఅంశాలు చెప్పబోతా. అవి మీకు నచ్చినా సరే; నచ్చకున్నా సరే.

మొ. వ్య. '(ఆత్మలో) ఎందున్నూ చిక్కుకొనక వుండేలాగా ఈకొఁపసంసారి తాను చెప్పేమాటను, ఒక్కొక్కదాన్ని సరిగ్గా తూచి తూచి చెప్పుచూ వున్నాఁడు. చూడడానికిఁ బల్లెటూరువాఁడై వున్నా, బలేగడుసువాఁడు. సనాతనధర్మంలో శూద్రుఁడై వున్నా ఇంతభక్తిశ్రద్ధ లేలా అలవడి వుంటవో, నా కూహించడానికి సాధ్యం కాకుంది. స్వచ్ఛమై వుండే సచ్ఛూద్రక్షేత్రింలో సచ్ఛూద్రబీజానికే వుత్పత్తి అయి వుంటాఁడు. లేకపోతే సనాతనధర్మంలో ఇంతపట్టుదల, ఇంతశ్రద్ధ, ఇంత భక్తి, వుంటుందా? ఉండివుండదు. అదిన్నీకాక పూర్వజన్మసుకృతం. నాదిబ్రాహ్మణజన్మం అయితేఏమి? బ్రాహ్మణబుద్ధి రవంత అయినా నాకు అలవడి వుంటుందా? అంటే లేనే లేదు. నా దంతా అబ్రాహ్మణబుద్ధే. బ్రాహ్మణక్షేత్రింలో పుట్టి వున్నా బ్రాహ్మణబీజానికి పుట్టి వుండ నేమో! నా కెందుకీ పాడుచింత ఇప్పుడు?' (అని ప్రకాశంగా). 'సరే దయచేశి చెప్పండి.'

భీ. రె. 'రెండవ సర్వరాజకీయకక్షులసమావేశం జరగడానికి పూర్వం గాంధి దొరతనానికే వుప్పు చేయడానికి వుండేహక్కు జనులకంతా వుం దంచూ, సముద్రోదకంతో వుప్పు చేయవలసిందిగా కాంగ్రెస్సుచే తీర్పు చేయించాఁడు. ఇదే శాసనోల్లంఘనం చేయడానికి ప్రారంభం. కాంగ్రెస్సుతీర్పు అనుష్ఠించడానికి ఇష్టం వుండేవాళ్ళంతా వుప్పు చేయడానికి పూనినారు. దానికి ఫలంగా బహుజనులు కారాగృహంలో వాసం చేయడానికి మొదలెట్టారు. దేశంలో ఘోష పుట్టింది. దాన్ని ఆపడానికి మార్గం ఏంది? గాంధిశాసనోల్లంఘనం మానుకోవలె. లేకుంటే దొరతనం ఆతనిపాదాలమీదపడి స్వరాజ్యం అర్పించుకోవలె. ఆరెండున్నూ కానికార్యాలు. అయితే క్షోభ అడుగంటడానికి త్రోవ ఏంది? సప్రూజయకర్కార్లిద్దఱున్నూ అప్పుడు వైస్రాయిగా వుండేఇర్విన్ ప్రభువుకున్నూ చెఱలో వుండే గాంధికిన్నీ సమాధానం చేయడానికి యత్నంచేశారు. ఆ యత్నం ఫలించింది.'

మొ. వ్య. 'ఏలా ఫలించింది?'

భీ. రె. 'ఇర్విన్ ప్రభువు గాంధితో రహస్యగోష్ఠిలో సంభాషించడానికి వొప్పుకొన్నాఁడు.'

మొ. వ్య. 'ఏవిషయంగూర్చి గాంధిమహాత్మునితోమాట్లాడ ఇర్విన్ ప్రభువు ఇయ్యకొన్నాఁడు?'

భీ. రె. 'ఏవిషయం అంటే? వుప్పుసత్యాగ్రహంవల్ల దేశంలో పుట్టి వుండేక్షోభను అడచడానికి మార్గం గూర్చినవిషయమే, వాళ్ళిద్దఱున్నూ సంభాషించుకోవలసివుండేది.'

మొ. వ్య. 'ఆక్షోభ అడగిందా వారిద్దఱిరహస్యగోష్ఠివల్ల?'

భీ. రె. 'ఏదో వొకవిధాన ఆక్షోభ అడుగంటింది. అదేం దంటే వినండి. గాంధి చెఱలో వుండేటప్పుడు లండనులో సర్వరాజకీయపక్షములసమావేశం కాబోతుంది. దానికి రావలసిందిగా హిందూదేశంలో వుండేరాజకీయకక్షుల నన్నింటికిన్నీ ఆహ్వానంవస్తుం దనే అంశం గాంధిచెవిలో బడ్డది.'

మొ. వ్య. 'ఆరాజకీయకక్షు లేవేవి?'

భీ. రె. 'ఆకక్షులపేళ్లతో మనకు పనేమి? చెప్పండి. 'సర్వరాజకీయకక్షులయొక్క నేతిబీఱకాయలగంప' అని అనుకొన్నా సరే; లేదని 'గంగెద్దులమొత్తం' అని అనుకొన్నా సరే. అధికారులు వాళ్లను రమ్మంచూ పిలుస్తారు. వాళ్ళంతా పోతారు లండనుకు. వాళ్లకు ధనవ్యయం ఏమిన్నీ వుండదు. హిందూదేశంలో దొరతనానికి పన్నులు చెల్లిస్తూ వుండేరైతులు భరించుకొంటారు. అవ్యాజంపురస్కరించుకొంచూ ఆ రాజకీయకక్షులనే నేతిబీఱకాయలగంప లండనుకుఁబోయి ఆగొప్పవీటిని దర్శించుకొంచూ వస్తుంది. అయిరోపా అంతా దిమ్మతిరుగుంది ఆనేతిబీఱకాయలగంప.'

మో. వ్య. 'ఆవెనుక?'

భీ. రె. 'ఆవెనుక ఏ ముంది? ఇర్విన్ ప్రభువుతో మీ గాంధిమహాత్ముఁడు రహస్యగోష్ఠి సలుపడానికి ముందుగా, 'కాంగ్రెస్సుకు ప్రతినిధిగా మీ కాహ్వానం హోందొరతనాన్నుండి వచ్చిం దంటే, తాము లండనుకు పోయి వస్తారా?' అని ఆయనమిత్రుల్లో వొకానొక రడిగినా రంట!'

మో. వ్య. 'దాని కేమని ఆమహాత్ముని ప్రత్యుత్తరం?'

భీ. రె. 'తమకు తెలియదా ఏమి ఆయనప్రత్యుత్తరం? అయినా చెప్తా వినుకోండి. మహమ్మదీయులకున్నూ, హిందువులకున్నూ, స్నేహం కుదిరితే లండనుకు పోతాను. లేకుంటే పోను.' అని

మో. వ్య. 'అభిన్నమతస్థులకు ఇద్దఱకున్నూ పొత్తు కలిగించాఁడా?'

భీ. రె. 'ఏంది పొత్తు కలిగించడం ఆయనపిండాకూడు. అసహాయోద్యమప్రచారంయొక్క ప్రారంభంలో ఆలీసోదరులకంచంలో వొక్కచేయి వేసి వణ్ణం మీ గాంధిమహాత్ముఁడు తింటూవుండినాఁడఁట! అప్పుడు కుదిరిందా పొత్తు అభిన్నమతద్వయానికి? లేదు. ఖిలాఫత్తువిషయంలో మీగాంధిమహాత్ముఁడు కుంత వక్రగతిఁ బోయినాఁ డఁట! దానివల్ల ఆఆలీసోదరు లిద్దఱున్నూ ఆతణ్ణి వదలేశారు. వాళ్లు తురకలలీగులో వాళ్లుచేరారు. బాలికావివాహనిషేధశాసనం చర్చలో వుండేసమయంలో ఆలీసోదరు లిద్దఱున్నూ దానికెదురు తిరిగి వద్దన్నా రఁట! కాకినాడలోనున్నూ, చెన్నపురిలోనున్నూ జరిగి వుండేకాంగ్రెస్సుసమావేశద్వయాలకు మహమ్మదీయులే సభాధ్యక్షులు గా వుండిరి. వాళ్లవల్ల అభిన్నమతద్వయానికి స్నేహం కుదురుతుం దని అన్నా రఁట కాంగ్రెస్సువాఁరు లప్పుడు. అయితే కుదిరిందాఆస్నేహం వాళ్లకు? లేదు. లండనులో జరుగఁబొయ్యేసర్వరాజకీయకక్షులసమావేశానికి పోవడానికి హిందూమహమ్మదీయులద్వేషం అడ్డపడుతుందా? అడ్డపడ దెప్పటికిన్ని. అయితే హిందూమహమ్మదీయుల కిద్దఱకున్నూ స్నేహం కలుగక పోయిం దంటే, తాను లండనుకు పోనన్నమీ గాంధిమహాత్ముఁడు కడపట మైత్రి కూర్పకుండానే లండనుకు పోయినాఁడు.'

మో. వ్య. 'అదేల?'

భీ. రె. సప్రూజయకారులయత్నంవల్ల మీ గాంధిమహాత్ముఁడు ఇర్విన్ ప్రభువుతో రహస్యగోష్ఠి జరిపాఁడు. ఆరహస్యగోష్ఠిలో జరిగి వుండేవిషయం బహుగుప్తంగా నే అప్పటినుంచి నేఁటిదాఁక వుంటూ వుంది. దొరతనంగానీ గాంధిగానీ దాన్ని వెళ్ళగ్రక్క లేదు. అయితేఆరహస్యగోష్ఠివల్ల, శాసనోల్లంఘనంచేశి కారాగృహాలకు బోయి వుండేవాళ్ళ కంతా విడుదల కలిగింది. అధర్మసంస్థగా వుండినకాంగ్రెస్సు ధర్మసంస్థ అయింది. శాసనోల్లంఘన ప్రచారం విరివిగా సాగుచూ వుండేకాలంలో దొరతనం తనఅధీనం చేసుకొన్నకాంగ్రెస్సుద్రవ్యం గివ్వం, అంతా ఒకడాన్ని కూడా తమఅధీనంలో వుంచుకోకుండా పద్దువారిగా అక్కడక్కడ వుండేకాంగ్రెస్సుసంస్థలకు తిరుగఅందజేసిందఁట! బొంబయిలో మార్వాడీల దగ్గఱ వృద్ధికిగాను కాంగ్రెస్సుసంస్థ దాఁచి వుంచిన ఇరువదైదులక్షలరూపాయలమొత్తం తిలక్కు స్వరాజ్యనిధిలోనిభాగం, దొరతనం తనఅధీనం చేసుకొంచూ వుండిం దంట! ఆమొత్త మంతా కాంగ్రెస్సుసంస్థకు చేరిం దంట! గాంధియొక్కయు, ఇర్విన్ ప్రభువుయొక్కయు, రహస్యగోష్ఠివలన గలిగినలాభస్వభావం ఈమాత్ర మే ఆయివుంటుం దంట!'

మో. వ్య. 'ఆరహస్యగోష్ఠివల్ల కలిగి వుండేఅనంతఫలం ఈమాత్రమే కావండీ! ఇంకా ఏంకావలె?

భీ. రె. ఇంకా కావలసినపని ఏమిన్నీలేదు. మీగాంధిమహాత్మునియత్నంవల్లనే స్వరాజ్యం వచ్చింది. ఇంగ్లీషువాళ్లీదేశాన్ని విడిచేశి వెళ్లారు. అమాత్రమే కదండీ అనంతఫలం?'

మో. వ్య. 'నే నొక్కభావంతో చెప్పితే మీరు వేఱొక్కఅర్థం చేసుకొంటారే. అదెట్టిది? (మనసులో) 'మీతో వేగ లేనండి.' (ప్రకాశంగా) 'బిన్నా ముగించండి మీవుపన్యాసం.''

భీ. రె. 'ఎందుకండీ అంతవిసుగు మీకు? బిన్నా చెప్పి ముగిస్తాను లెండి నావుపన్యాసం. వినండి, మీగాంధిమహాత్ముఁడు ఇర్విన్ ప్రభువుతో రహస్యగోష్ఠి సలిపినాఁడు. ఆవెనుక సర్వరాజకీయకక్షాద్వితీయసమావేశానికి లండనుకు రావలసినదిగా హిందూదేశప్రధానప్రభుత్వమునుండి ఆహ్వానం ఆతనివాడిలో పడ్డది. లండనుకుప్రయాణంకట్టాఁడు. కాంగ్రెస్ సభ్యులంతా బెంగపోయినారు. 'హిందూమహమ్మదీయులకు పొత్తు కుదుర్చక పోనన్నమహాత్ముఁడు దాన్ని కుదర్చక లండనుకు ఎందుకు పయనం కట్టాడు?' అని ఆతనిపరోక్షంలో గొణగసాగిరి. ఏం తలచి వుంటున్నాడో మనస్సులో మనగాంధిమహాత్ముఁడు? దీర్ఘదర్శి. ఆడనుండి వచ్చినవెనుక అభిన్నమతస్థులకు పొత్తు కలిగిస్తాఁడు లేకు. దాని కేం తొందర? లండ

నులో జరిగేసర్వరాజకీయకక్షాసమావేశం ముఖ్యం. కాంగ్రెస్సుకు ప్రతినిధిగా పోవుచూ వుండేకాలంలో మన ఈలాంటిచొప్పదంటుప్రశ్నలు వేయడం భావ్యం కాదు. దాన్ని గూర్చి ఏమిన్నీ గాంధి మహాత్మునితో ప్రశ్నించరా దని అతనిఅంగభటులు నోరుమూసుకొని ఆయనకు ప్రయాణసన్నాహానికి సాయం చేశారు.' అవునునా కాదా?'

మొ. వ్య. 'అవు నవును.'

భీ. రె. 'దేశంలో ఘోష మాసింది. కాంగ్రెస్సునాయకులున్నూ, వాళ్ల స్వార్థత్యాగాన్ని అనేకవిధాల ప్రశంసిస్తూ వుండేఅడ్వకేట్సులబృందమున్నూ లండనులో జరగబొయ్యేసర్వరాజకీయకక్షాద్వితీయ్యసమావేశంయొక్క పర్యవసానం మిక్కిలిఅపేక్షతో ఎదురు చూస్తూవుండిరంట!'

మొ. వ్య. 'కారణం ఏమి?'

భీ. రె. 'దానికి కారణం ఏ ముంది? మీగాంధిమహాత్ముఁడు హిందూమహమ్మదీయులకు చెలిమి కూర్చకుండా లండనుకుపో నన్నవాఁడు రహస్యగోష్ఠి ముగిసినానక దాన్నికూర్చకనే దానికి ప్రయాణం గట్టాఁడు. వాళ్లకు అనేక పెద్దరాజకీయతంత్రం. అది గాంధిమహాత్మునికే తెలుసును. మరొక్క ప్రాణికి తెలియదు.' అనేదే కాంగ్రెస్సుసభ్యుల భావం. వాళ్లల్లో తామున్నూ వొక్కరే కాదా? మీకు గాంధిచిత్తం ఈపట్టున తెలియకుంటుందా?'

మొ. వ్య. 'ఏమోనండి? ఎప్పుడో జరిగిందంతా జ్ఞాపకం వుంటుందా చెప్పండి? ఆవెనుక చెప్పి ముగించండి.'

భీ. రె. 'హిందూమహమ్మదీయులకు మీగాంధిమహాత్ముఁడు చెలిమి చేస్తా నన్నవాఁ డట్లుచేయకుండా, తా నన్నఆమాటను కూడా తలచక లండనుకు పోవలసినదిగా ఇండియాప్రధానప్రభుత్వమునుంచి ఆహ్వానం వచ్చిందే చాలునంచూ లండనుకు ప్రయాణసన్నాహం చేశాఁడు. స్వస్థానాన్ని అతఁడు వదలినాఁడు. వదలి బొంబయికి వెళ్లినాఁడు. కాంగ్రెస్సుకాకి గుంపు బొంబయిరేవులో నాతని నోడ నెక్కించుచూ "సర్వతంత్రస్వాతంత్ర్యం గల్గి వుండేస్వరాజ్యం వచ్చేలాగా సర్వరాజకీయకక్షాసమావేశంలో ప్రవర్తించి రాఁ బ్రార్థిస్తూ వున్నాం వోమహాత్మజీ" అని అన్నారు. దాని కాతఁడు చిఱునవ్వునవ్వి "స్వరాజ్యమున కే మవసరం? అంటరానితనం ముందుగా లయించిం దంటే, స్వరాజ్యం తనంతట వస్తుంది. కాబట్టి మీ రీడ వుండి అంటరానితనాన్ని తొలగించవలసిం దంచూ హైందవులకు బోధిస్తూ వుండండి. నేను పోయి బిన్నావస్తా. వచ్చిన వెంటనే శాసనోల్లంఘనం తిరుగ ప్రారంభించ వలసి వచ్చినా వచ్చును. దానికిన్నీ మీకంతా తయారుగా వుండవలె. అంటరానితనం లయింపచేసేకార్యం ప్రధానం. స్వరాజ్యసపాద్యం అప్రధానం. కావున అంటరానితనాన్ని మాయంచేసేదానికి గాఢప్రయత్నం చేయండి. ఇదే నాచేయువుపదేశం. పోయి వస్తా" అని అన్నాఁడు. దానికి నాడ చేరినగంగెద్దులు తలలాడించాయి. దండా లెట్టినవి. గాంధి వాళ్లకు తిరుగ దండం బెట్టినాఁడు. పెట్టి ఓడ నెక్కినాఁడు. అది కదిలింది. 'గాంధిమహాత్మునికీ జయి! గాంధిమహాత్మునికీ జయి' అనుమున్నుగాఁ గల్గుకేకలు మిన్ను ముట్టినవి. గాంధిని దారి విడిచి పెట్టఁ బోయివుండే కాంగ్రెస్సుగుంపు స్వస్థానాలు చేరినవి. గాంధిన్నీ లండనుకు వోడలోఁబయనం సాగించాఁడు. అతనిఁ గొనిపోవుచూవుండేవోడ తిన్నతిన్నగా ఇంగ్లండు చేరింది. గాంధి ఓడనుండి ఇంగ్లండులో దిగినాఁడు. దిగి చాల కాలం పోర్ట్సుమత్తులో వుండక పొగబండి ఎక్కి లండనువిక్టోరియాస్టేషనులో అడు గెట్టాఁడు. లండనులోవుండే కాంగ్రెస్సుపక్షపాతులొకకొందఱు ఆయన్ను మోటారులో ఎక్కించుకొంచూ దొరతనంవాళ్లాతనికి ఏర్పఱిచి వుండేబసలో ఆతణ్ణి దించారు.

మొ. వ్య. 'ఆమానుహాత్ముఁ డాడ ఎంతకాలం వుండినాఁడో.'

భీ. రె. 'ఎంతకాలం వుంటే నా కేమి? అతఁ డాడ చేశి వుండేకార్యస్వభావ మే నాకు కావల్సింది.'

మొ. వ్య. 'ఆలాగా? సరిసరి. దయచేసి చెప్పి ముగించండి. మమ్మల్నిశీఘ్రంగా మావూళ్లకు సాగనంపండి.'

భీ. రె. 'అదే నాపనిన్నీ కూడా. ఆమీగాంధిమహాత్ముఁడు లండనుచేరినలాగా, తక్కంగలరాజకీయకక్షాసభ్యు లనే నేతిబీఱకాయలగంప కూడా లండను చేరింది. సర్వరాజకీయకక్షాసమావేశం అయింది. నేతిబీఱకాయలగంపలో వుండే నేతిబీఱకాయలు తమనోటికి వచ్చినలాగా వుపన్యాసా లిచ్చినవి. గాంధిన్ని వొక్క రెండుమాట లని తనవుపన్యాసం ముగించాఁడు.'

మొ. వ్య. 'అవేవో ఆరెండుమూఁడువరాలమాటలు?'

భీ. రె. 'ఆవరాలమాట లతి మిక్కిలికుఱుచలైనవి. 'మాహిందూదేశస్థులకు స్వరాజ్యం అప్రధానం. అంటరానితనాన్ని లయింపఁ జేయడం ప్రధానం. దానికై కాంగ్రెస్సు పుట్టింది. స్వరాజ్యానికిగాను పుట్టలేదు. పుట్టి దాదాపు ఏబదేండ్లు కావస్తూ వుంది. ఆఏఁబదేండ్లనుంచిన్నీ తిలకుమహాశయుడున్నూ

గోష్ఠీ ప్రముఖులు కూడానున్నూ ఈలాంటి పుణ్య పురుషులంతా కాంగ్రెస్సుమూలాన అంటరానితనాన్ని తొలగించేదానికై అష్టకష్టాలు పడ్డారు. తిల్లక్కు మహాశయుఁడు దానికిగానే కారాగృహానికిఁ బోయినాఁడు. నేనొక్కణ్ణే కాదు దాన్ని మాయంచేయవలసిందనడం. కాంగ్రెస్సుకు అది ముఖ్యం అనే విషయాన్ని తిలక్కు దానికే చెఱకుపోయినాఁడనేదే స్థిరపఱుస్తూ వుంది. ముమ్మందుగా దాన్ని తొలఁగించండి. తొలఁగించి స్వరాజ్యం ఇయ్యండి. ఇయ్యక పోండి. దానితో కాంగ్రెస్సుకంతగా పనిలేదు."

అన విని ఆసమావేశాన్ని చేర్పఁబూటపడ్డపార్లమెంటుద్వయం అతనికేమిన్ని అప్పట్లో ప్రత్యుత్తరం పలుకలేదు. మౌనముద్ర ధరించింది. మీగాంధి మహాత్ముఁడావెనుక పార్లమెంటుద్వయంయొక్క మౌనం గ్రహించి క్రైస్తవమతబోధకులమొత్తంతో ఇట్లన్నాఁడు :—

'ఓ క్రైస్తవమతబోధకులారా! నా కాలిలో నాబాల్యదశలో 'బాల్యవివాహం ముఖ్యం. రజస్వలావివాహాలు కూడవు. అంటరానితనం మంచిది. అది లయించగూడదు.' అనేవిషయం నాహృదయంలో బాగుగా నాటుకో వుంఁడేది. హిందూదేశం వదలి పశ్చిమఖండాల్లో వాసం చేయడానికి ప్రారంభించినాను. క్రైస్తవమత బోధకులస్నేహం నాకబ్బింది. వాళ్ల క్రైస్తవమతోపదేశం విన్నాను. విని మననం చేశాను. చేశి ధ్యానం సల్పినాను. సల్పి ధారణ చేశినాను. క్రైస్తవమతాన్ని అవలంబించినాను. అంత నాచిత్తవీథిలో నాటుకొని వుండే 'బాల్యవివాహం, అంటరానితనం.' అనేరెండంశాలున్నూ లేచి పరారిచిత్తగించినవి. 'వాటిస్థానే రజస్వలా వివాహం చేయవలసింది. అంటరానితనం మాయంచేయవల్సింది.' అనేరెండువిషయాలు నాటుకొన్నవి. అప్పటినుంచి నేఁటిదాకా ఆరెంటిలో మొదటిదానికి సామాన్యంగాను, రెండవదానికి ముఖ్యంగాను, నాకుండే అర్థం, బుద్ధి, —సర్వం సమర్పిస్తూ వస్తూ వున్నాను. ఇదీ మీతో నేఁడు చెప్ప దలచుకొన్నవిషయం. దయవుంచండి. హిందూదేశంలో క్రైస్తవమతవ్యాప్తికిగాను మీవాళ్లగుంపుతోఁ గలిశి గాఢప్రయత్నం చేయకపోయినా, మావాళ్లతోఁ గలిశి పనిచేస్తాను. నావల్ల క్రైస్తవమతం చక్కఁగా వ్యాపిస్తుందనుకోండి. క్రైస్తవపాఠశాలల్లో చదివినబ్రాహ్మణబ్రువులు, పెక్కండ్రు వున్నారు. క్రైస్తవమతప్రకారం క్రైస్తవమతం స్వీకరించుకోక వున్నా, హృదయంలో క్రైస్తవులై వుండేవాళ్లనేకులు బ్రాహ్మణవేషంతో వాళ్లున్నారు. వాళ్లకు నేను అవతారపురుషుణ్ణి. వాళ్లకు దొరతనంలో మంచి పలుకుబడి వుంది. వాళ్లు సాహాయ్యం నాకన్నివిధాల చేస్తారు. దేవాలయప్రవేశం మామాలబిడ్డలకు కలిగిందంటే, అంటరానితనం జాఱుకొన్నట్టే. దేవాలయాలు మూతవడుతవి. క్రైస్తవమతవేషంతో వుండేబ్రాహ్మణులగుంపును శాసనసభలకుం బంపుతాను. వాటిసొత్తు అంతా మామాలబిడ్డలకబ్బేలాగా వాళ్లచేత శాసనాలు చేయిస్తాను. అంటరానితనం అంత మందుతుంది. అది పోయిందంటే క్రైస్తవమతవ్యాప్తి అయినట్టే అని నమ్మండి.' అన విని గాంధిమహాత్ముఁడు అపరక్రైస్తవుడంచూ అతనికి పొగిడింపులు వేశారు ఆక్రైస్తవమత బోధకులు. ఆవెనుక గాంధి లండను వదలి బొంబయి చేరాఁడు.

మీగాంధి బొంబయి చేరెనో లేదో దొరతనం అతణ్ణి చెఱలో పెట్టింది. స్వరాజ్యం సంపాదించడానికనే వ్యాజ్యం పురస్కరించుకొని గాంధిన్నీ అతనిసహచరులున్నూ, శాసనోల్లంఘనం చేయడానికి మొదలెట్టిందే దానికి కారణం. ఆడ కొంతకాలం వుంటూ వుండినాఁడు. 'వుండి అంటరానితనాన్ని తొలగించేదానికి మార్గం ఏది రా' అనిఅంటూ ఆలోచించాఁడు. ఆలోచించి ఆలోచించి 'అంటరానితనం పోతే నే కాని నేను వణ్ణం తినను.' అని ప్రాయోపవేశం చేయడానికి ఆరంభంచేశాఁడు. చేసిన వెనుక పదిపదునాలుగైదుదినాలకాలం చెల్లింది. చస్తాఁడేమో అనుభీతి ఆతనిసహచరులకు కలిగింది. కలిగీకలుగకముస్నే పరాసురాజ్యంనుండి వ్యోమయానంమూలంగా విచ్చిబావినీళ్లు గాజుబుడ్లల్లో బిరడాలు వేశి బిగించినవి చెఱలో గాంధిపండుకొన్నపడకమీద అతనినోటికందేలాగా పడ్డవి. బిరడాలు సళ్లుకొన్నవి. విచ్చిబావి నీళ్లు అమృతంగా గాంధికి అయినవి. సుందోదరుఁడైనాఁడు. అయినా చస్తాడనేవార్త దేశంఅంతా అల్లుకొన్నది. ఘోష పుట్టింది. అతనికిన్నీ దొరతనానికిన్నీ తిరుగ రాయబారాలు జరిగినవి. వాటిపర్యవసానం, 'స్వరాజ్యసంపాద్యానికై శాసనోల్లంఘనప్రచారం నిలపడం, దాన్నిముట్టుకోక వొక్క అంటరానితనాన్ని తొలగించడానికై దేశంలో విరివిగా ప్రచారంచేయడం' అనేదే. అంత గాంధి విడుదల. పొందినాఁడు. పొంది శాసనోల్లంఘనం ఆపేశాఁడు. ఇష్టం వున్నవ్యక్తులకు దాన్ని చేయ వచ్చునని అన్నాఁడు. అది వ్యక్తిగతమైందే. దానికి కాంగ్రెస్సు వూటపడదు అనిన్నీ గాంధి దాపఱికం లేక గట్టిగా చాటించాఁడు. ఆవెనుక శాసనోల్లంఘనం ఆగింది. స్వరాజ్యసంపాద్యం థేమ్సుగట్టు

మీఁద వుండే వైటుహాల్ గదుల్లో దాగింది. ఇఁక నేమి? అంటరానితనం మాయంచేయడానికి గాఢప్రయత్నం.

దానికిఁ బూర్వం గాంధి చెఱలో వుండేకాలంలో అంటరానితనం లయింపచేసే విషయంలో హైందవసంఘంలో వుండేజాతులు దాన్ని అంగీకరిస్తారా? లేదా? అనే అంశం తెలుసుకోవచ్చు నని దొరతనం గాంధి కనుజ్ఞ ఇచ్చింది. ఆలా ఇయ్యఁగా గాంధి వార్తాపత్రికలముఖాన ఈలా అన్నాఁడు:—‘‘ఆఫ్రికానుండి హిందూదేశానికి నేను వచ్చినాను; వచ్చి దేశంఅంతా తెగ తిరిగాను; ఆలా తిరగడంలో అంటరానితనాన్ని మాయం జేయవల్సిం దంచూ ఢంకా కొట్టి చాటిస్తూ వచ్చినాను. అట్లని కాంగ్రెస్సుచే తీర్పు చేయించినాను. అప్పుడంతా హైందవసంఘంలో వొక్కఁడుగూడా అదేమంచూ నన్ను గానీ కాంగ్రెస్సును గానీ ఆక్షేపించలేదు. సర్వకులస్థులున్నూ అంటరానితనం మాయం అయ్యేవిషయంలో మౌనం తాల్చి వుంటూ వుండిరి. అట్టి వాళ్ళ మౌనంవల్ల వాళ్లంతా దాని కిష్టపడ్డా రంచూ నమ్మినాను. అందువల్ల దేశంలో అంటరానితనం అడుగంటింది. ఇఁక మామాలబిడ్డలకు దేవాలయప్రవేశం కావలసి వుంది. అది అయిం దంటే స్వరాజ్యం వచ్చినట్లే అనేది నాభావం.’ అనఁగా విని హైందవసంఘం అంతా వొక్కపెట్టున లేచి ఆక్షేపించడానికి ప్రారంభించింది. బదులు చెప్పడానికి కాతని కూపి రాడ లేదు. ఆలోపల చెన్నపురిశాసనసభలో డాక్టర్‌సుబ్బరాయన్ అనుసభ్యుఁడు పంచములకు దేవాలయప్రవేశం కలిగించవలసిం దనేతీర్పు చేయ బూనినాఁడు. దానికి వైస్రాయి సమ్మతించ లేదు. ఇక్కడ అది కాక పోయింది. డిల్లీఅసెంబ్లిలో రంగయ్యరనుబ్రాహ్మణబ్రువుఁడు దేవాలయప్రవేశానికిన్నీ, అంటరానితనాన్ని తీసివేయడానికిన్నీ చిత్తుచట్టాలు తెచ్చాడు. గాంధవియ్యంకుఁడు డిల్లీ కప్పట్లో పోయి ఆడ వుండే అసెంబ్లీసభ్యులయొక్కయు, దొరతనంవారియొక్కయు, కాళ్ళమీఁద పడి ఏలాగైనా రంగయ్యరుచిత్తుబిల్లుకు తోడ్పడవలసిందిగా ప్రార్థించాడు. వాళ్ళగడ్డాలు పట్టుకొన్నాఁడు. అట్టిస్థితిలో గాంధి తనమాలబిడ్డల నుద్ధరించడాని కని దేశం అంతా దిమ్మతిరిగి తిరిగి లక్షలకొలఁదిరొక్కం ప్రోగు చేశాడు. అప్పు డాతఁడు చెన్నపురిలో నాలుగైదుదినా లుండినాఁడు. అక్కడ కళాశాలలందు చదువుచూ వుండే విద్యార్థు లంతా చదువుకై తమతల్లిదండ్రులు పంపినసొమ్ములోఁ *కొంతతీసి ఆతనికి సమర్పించి ‘ఓ గాంధి మహాత్ముఁడా! నీవు మాకు దేశికుఁడవు. గురుదక్షిణగా మా కున్నంతలో కొంత తమకు సమర్పించుకొన్నాం. దానికి మాకు హితోపదేశం చేయవలసింది.’ అని వేఁడిరి. ఆప్రకారం వేఁడఁగా గాంధి ఇట్లన్నాఁ డఁట—

‘డిల్లీకి పోయినపుడు నేను, ఆడ చదువుచూ వుండే విద్యార్థులు మీవలెనే నన్నడిగినారు. వాళ్ళ కప్పుడు చేసినహితోపదేశమే ఇప్పుడు సైతము చేస్తాను. వినండి. విని ఆలా ప్రవర్తించండి. ప్రవర్తించినా రంటే దేశానికి మహోపకారం చేసినోళ్ళవుతారు. అ దేం దంటే?’

‘విద్యార్థులారా! ఒకచేతితో చీపురకట్టలు తీసుకోండి. ఇంకొకచేతితో బొక్కెనలు తీసికోండి. చంకల్లో పారకకట్టలుగోవుకొంచూ చేటలు గైకొని మాలవాడలకు పోండి. పోయి మా మాలబిడ్డలఅమేధ్యం ఎత్తి వేయండి. ఎత్తేశి బొక్కెనల్లో వుండేనీళ్ళతో స్థలశుద్ధి చేయండి. ఇదే మీకు నాచేయుహితోపదేశం.’’

అనఁగా విని విద్యార్థులు గుక్క మిక్కనక ‘మంచివుపదేశమే! తలమోస్తాం. ఆవెనుక చేస్తాం!’ అంచూ స్వస్థలాలకు పోయినారో! లేదేని ‘మనం సమర్పించినదక్షిణకు మనకు చేశివుండేహితోపదేశం దొడ్డదే.’ అంచూ చెంపలు వాయించుకొన్నారో.

సనాతనధర్మపరులు నోరు లేనిపెద్దమ్మలు. మీగాంధి మహాత్ముఁ డేడనుండి బయలు వెడలినాఁడో ఆడనుండి వాళ్లు నల్లజెండాలు పట్టుకొంచూ ఆతఁ డుపన్యాసం చేశి వుండేస్థలాల్లో అప్పుడప్పుడే ఆతనివుపన్యాసాలను ఖండిస్తూ ఆతనివెంట నడిచిరి. గురువాయూరు సుప్రసిద్ధముగా వుండేశ్రీవైష్ణవక్షేత్రం. ఆడ గాంధిచేశిన సభలో వుపన్యాసంచేశాఁ డఁట! ఆతని కెదుట నే ఆతనివుపన్యాసాన్ని ఖండిస్తూ సభ చేశి వుండేసనాతనధర్మపరులపం ద్లూడ తన్నినా రఁట! ఆతని సహచరులు నెత్తురు వెల్లువలై పారిం దంట! మీగాంధిమహాత్ముడు తనసహచరులదుండగాన్ని చూస్తూ వుండినాఁ డఁట! కాని అ దేమంచూ ఆతఁ డాగుండగీండ్రను నడుగనూ లేదూ. వాళ్ళను చీవాట్లను పెట్టనూ లేదు. ఆతఁడు పునహాకుఁ బోయి వుండేకాలంలో గుష్టుఁ డెవఁడో

*(తల్లిదండ్రులకు తెలియక వాళ్లచదువుకై పంపిన ధనములో కొంతసొమ్ము గాంధి కిచ్చినది దొంగసొమ్ము కాదా? ఆదొంగసొమ్మేలాగా గాంధి గ్రహిస్తాఁడు?)

అతనిమీఁద బాంబు వేశాడఁట. 'అలా వేశి వుంటేవాఁడు సనాతనధర్మపరులమనుష్యుఁడై వుంటాఁడు. వాళ్ళే అతనిమీఁద బాంబు వేయించి వుంటా' రంచూ కాంగ్రెస్సునాయకు లంతా సభలు చేసి సనాతనధర్మపరులను నిందించారు. కాని ఆగాంధికానీ, అతనిశిష్యగణాల్లో వొక్కఁడైనా కానీ, బాంబు వేశినవాఁడు సనాతనధర్మపరుఁడా? మఱియు వాళ్ళకంటే భిన్నుఁడా' అని అన్వేషింపఁ బూనలేదు. దొరతనమున్నూ ఆవిషయమై ఎక్కువ అక్కఱ కలిగి వర్తించలేదు. మిన్న కుండింది. అప్పుడు సనాతనధర్మపరులు, 'గాంధిశిష్యులే అపని హంతకులకు డబ్బిచ్చి వాళ్ళచే గాంధికి ప్రాణాపాయం కలుగకుండా వుండేలాగున ఆబాంబును అతనిమీఁద వైపించి, ఆనిందను తమమీఁద మోపినా రఁట.' అని అభిప్రాయపడ్డా రఁట! వాస్తవం గాంధికే తెలుసు నఁట! మఱెవ్వరికిన్నీ తెలియ దఁట!

ఆప్రకారం గాంధి దేశం అంతా తిరిగి లక్షలకొలఁది రొక్కం కూర్చుకొని తనయిరవు చేరాడు. ఆవెనుక బొంబయిలో కాంగ్రెస్సు సమావేశం అయింది. అప్పుడాసమావేశంలో గాంధి "రాజకీయవ్యవహారాన్ని వదలుకొన్నాను. నాకు దానితో పనిలేదు. అంటరానితనం తొలగించడం నాకు ముఖ్యం. స్వరాజ్యసంపాద్యం మీకు విడిచేశాను. దాన్ని సంపాదించుకోండి. సంపాదించుకోక పొండి. నా కాప్రసక్తి వద్దు. ముమ్మాటికి వద్దు." అను భావము కలవుపన్యాసం చేశా డఁట. అప్పటినుంచి నేఁటిదాఁక అతఁడు రాజకీయవ్యవహారంలో జోక్యంకలిగించుకోక వర్తిస్తూ వుంటూ వున్నాఁడు. అలా వుంటూ వున్నా, కాంగ్రెస్సుకార్యనిర్వాహకవర్గం అంతా అతనిమనుష్యులే. కాంగ్రెస్సంతా అతఁడే. అతఁడే కాంగ్రెస్సు. దానికార్యనిర్వాహకవర్గం అతనితో సంప్రతించకోక ఏకార్యమున్నూ చేయడంలేదు. రాజకీయవ్యవహారం విడిచాననడం వట్టిబూటకం. ఆకారణంవల్ల కాంగ్రెస్సు అతనిపలుకును దాఁటకుండా అతనిచేతి కూతుబిడ్డలాగా వర్తిస్తూనే వుంది. అవునా కాదా?

ము. వ్య. 'అయి వుంటుం దేమో! రెడ్డిగారూ! గాంధిమహాత్ముఁడు ఇర్విన్‌తో రహస్యగోష్ఠి సలిపింది మొదలెట్టుకొంచూ రాజకీయవ్యవహారం విడిచేశే ఘట్టంవఱకూ ఆయన నడపినవ్యవహారం అంతా తామతిదీర్ఘోపన్యాసం చేశారు. కాని దానిసారం నాకంతగా బోధపడ్డది కాదు. కాస్త ముఖ్యములుగా వుండేవిషయాలు సంగ్రహించి చెప్పండి.'

రె. 'గాంధికి మీరు కుడిభుజం. అలా వుండేటప్పుడు ఆయన చేశి వుండేవ్యవహారంయొక్కసారం చెప్పమంచూ న న్నడుగుచూ వున్నారు. అది ఆశ్చర్యంగా వుంది నాకు. అయినా నాబుద్ధికి తోఁచినంత వఱకూ చెప్తా. వినండి.'

ము. వ్య. 'బుద్ధి బుద్ధి. చెప్పి బిన్నా ముగించండి.'

భీ. రె. 'మీగాంధి ఇర్విన్ ప్రభువుతో రహస్యగోష్ఠి సలపడానికి ముందు హిందూమహమ్మదీయులకు సఖ్యం చేయక లండనుకు పో నన్నవాఁడు వాళ్ళకు సఖ్యం చేశికాదా లండనుకు పోయి వుండవలె? అయితే అభిన్నమతస్థు లిద్దఱున్నూ, సఖ్యం చేయకుండా లండనుకు పోయి నాఁ డ దేల?'

ము. వ్య. 'లండనుకు ఏగే అవసరంవల్ల దాన్ని చేయకపోయి వుండవచ్చును.'

భీ. రె. 'తా నూహించింది వొకవేళ వాస్తవంగా నే వుంటుం దనుకొందాం. అడనుంచి ఈడకు వచ్చినా నక అయినా దాని కేల ప్రయత్నించలేదు?'

ము. వ్య. 'ఇట్టిపట్టులలో మాగాంధిమహాత్ముని చిత్తం తెలుసుకోడం మాబోంట్లకు కష్టం. మాబుద్ధి కందని విషయం అ దంతా.'

భీ. రె. ఇర్విన్ ప్రభువుతో మీమహాత్ముఁడు రహస్యగోష్ఠి సలిపినాఁడు. అలా సలుపఁగా దానిపర్యవసానం ఈలా తేలి వుండవచ్చును. నిశ్చయం అంచూ చెప్పడానికి నా కాధారం ఏమిన్నీ లే దంచూ ముందే పలికి వున్నాను. 'నే నింక చెప్పబొయ్యే దంతా నావూహ' అని అనుకోండి. హిందూమహమ్మదీయులకు సఖ్యం గాంధిమూలంగా (అనఁగా కాంగ్రెస్సుమూలంగా) జరగడానికి దొరతనం వొప్పుకోదు.'

ము. వ్య. 'ఎందు కని?'

భీ. రె. 'హిందూమహమ్మదీయులకు జగడం అయిం దనుకోండి. దొరతనం వాళ్ళిద్దఱున్నూ జరిగి వుండే కలహానికి కారణం విచారిస్తారు. విచారించి వాళ్లిద్దఱిలో దోషి అయి వుంటే వాళ్లను దండిస్తారు. అలా దండించే అధికారం దొరతనముది. కాంగ్రెసుకుగానీ గాంధికిగానీ ఆఅధికారాన్ని ఏలుబడి ఎప్పటికిన్ని చెందనీయదు; చెందనిస్తే దొరతనానికి ఈదేశాన్ని ఏలేఅధికారం కాంగ్రెస్సుకో గాంధికో బట్వాడా చేశినట్లవుతుంది. అదిన్ని కాక హిందూమహమ్మదీయులకు గాంధివల్లగానీ కాంగ్రెస్సువల్లగానీ సఖ్యం జరుగుతుం దనుకోండి. ఆవిషయంలో ఇద్దఱున్నూ జగడం ఎప్పటికిన్నీ వుండదు. స్థిరమై వుండేసఖ్యం కుదురుతుంది. అట్టిపట్టుల్లో హిందూమహమ్మదీయులొక్కటిగా చేరితే, బ్రిటిష్‌ప్రభుత్వానికే తలనొప్పి కలుగుతుంది. ఈకారణంవల్ల గాంధిమూలంగా

కానీ కాంగ్రెస్సుమూలంగా కానీ ఆ ఇద్దఱకున్నూ సఖ్యం జరగడానికి దొరతనం ఎప్పటికిన్నీ వొప్పుకోదు.'

మొ. వ్య. 'అలాగా? మామందబుద్ధుల కీభావం తట్టలేదు. ఆలా అట్టిసఖ్యానికి దొరతనం వొప్పుకోకపోతే, ఏలుబడి విధించేనిబంధనలకు గాంధిమహాత్ముఁడు వొప్పుకొంటాఁడా? వొప్పుకోఁడే.'

భీ. రా. 'ఒప్పుకోక ఏమి? దొరతనం విధించి వుంటే నియమా లన్నింటిని మీగాంధి వొప్పుకొన్నాఁడు.'

మొ. వ్య. 'ఏలాగా?'

భీ. రా. 'మీగాంధిమహాత్మునకు అంటరానితనాన్ని మాయం చేయడమున్నూ, ఆతనిమాలబిడ్డలకు దేవాలయప్రవేశం కలిగించడమున్నూ, ప్రధానవిషయాలు. ఆ రెంటినిన్నీ సాధించినాఁడా, స్వరాజ్యం వచ్చినట్లే ఆతనిభావం.'

మొ. వ్య. 'వుండవచ్చును. దానికే కాదా ఆతఁడు కాంగ్రెస్సును సాధనంగా వుపయోగించుకొంచూ వుండడం? ఆవిషయంలో ఆతని కేమాత్రం దాపరికం లేదే.'

భీ. రా. 'దానికే ఇర్విన్ప్రభువుతో ఆతఁడు రహస్యగోష్ఠి సల్పింది కూడాను?'

మొ. వ్య. 'దానికా? దానికా?'

భీ. రా. 'దానికే? దానికే? తొందరపడకండి.'

మొ. వ్య. 'వింటా. శీఘ్రంగా చెప్పి ముగించండి.'

భీ. రా. “అంటరానితనాన్ని తొలఁగించి మామాలబిడ్డలకు దేవాలయప్రవేశం కలిగించండి. ఈ రెండున్నూ, మీవల్ల కాఁ దగినమహాసంఘసంస్కారకార్యాలు. నే నన్ననో స్వరాజ్యోద్యమం చాలించుకొంటాను. అడినమాటను తప్పను. 'కాంగ్రెస్సు వొప్పుకొంటుందా' అని సందేహించవద్దు. కాంగ్రెస్సే నేను; నే నే కాంగ్రెస్సును. కాంగ్రెస్సుకు నేను సర్వాధికారిని. ఆ అధికారం పురస్కరించుకొంటూ కావలిస్తే అట్లంచూ మీకు వ్రాసి ఇస్తాను.” అనునదే రహస్యగోష్ఠియొక్క పర్యవసానం.'

మొ. వ్య. 'మౌనముద్ర ధరించును. నిట్టూర్పు విడుచును.'

భీ. రా. 'ఇర్విన్ప్రభువు గాంధి చెప్పినషరత్తుల కొప్పుకొన్నాఁడట. ఒప్పుకొని శాసనోల్లంఘనం ఏలా నిలిపివేస్తా వన్నాఁడఁట.' దానికా గాంధి, 'లండనుకు పోయి బొంబయిలో అడుగు పెట్టుతాను. అడుగు పెట్టి శాసనోల్లంఘనం ప్రారంభిస్తాను.' అని అనేటప్పటికి ఇర్విన్ప్రభువు 'స్వరాజ్యోద్యమం నిలిపివేస్తా నంటిరి. ఇదేంది శాసనోల్లంఘనం?' అని గాంధిని అడిగినాఁడఁట. దానికి గాంధి, 'బొంబయిలో అడుగుపెట్టినవెంట నే స్వరాజ్యోద్యమం నిలిపానంటే, బాగుండదు. జనులకు నాయం దుంటే నమ్మకం పోతుంది. శాసనోల్లంఘనం ప్రారంభం చేశేలాగున నేను నటిస్తాను. మీరు వెంట నే నన్ను చెఱలో పెట్టండి. కొంతకాలం నడుస్తుంది. నాతోడ పెక్కండ్రు శాసనోల్లంఘనం చేసి చెఱలకు పోతారు. దేశంలో తిరుగ క్షోభ కలుగుతుంది. దాన్ని అడచవలసిందిగా మితవాదకక్షకు నాయకులై వుంటే వాళ్ళుగాని, మఱెవ్వరైనా గాని ప్రయత్నిస్తారు. వాళ్ళప్రయత్నమునకు అనుకూలపడేలాగా, శాసనోల్లంఘనం నేను అప్పటికి నిలిపివేస్తాను. ఆయాయివ్యక్తులై వుంటే కాంగ్రెస్సుసభ్యులు శాసనోల్లంఘనం చేయవచ్చును. అయితే దానికి కాంగ్రెస్సు పూటపడదు. వ్యక్తిగతంగా వుంటే శాసనోల్లంఘనమవుతుంది. అలాగా అప్పటికి శాసనోల్లంఘనం నిలుపుతాను. తిరుగ దాన్ని లేపడానికి అవకాశం కలిగిందంటే, శాసనోల్లంఘనం చేస్తాను.' అని చెప్పుచూ వుండఁగా ఇర్విన్ప్రభువు, 'అదేం దండో, శాసనోల్లంఘనం నిలపడమున్నూ, వెంట నే తిరుగ దాన్ని లేపడమునా?' అని గాంధిని అడిగి వుంటాఁడఁట. దానికి గాంధి, 'స్వరాజ్యోద్యమం నిలపలేదు. తిరుగ దాన్ని ప్రారంభిస్తాను' అనిచెప్పడం జనులకు నాయందు నమ్మకం కలిగించేదానికే కాని మఱి దేనికిన్నీ కాదు. 'తిరుగ దాన్ని ప్రారంభిస్తానంచూ ఏలినవారితో అంటూ వున్నాను. వొక్కతడవ దాన్ని నిలిపినా నంటే, ఎప్పటికిన్నీ దాన్ని నిలిపి వేశినట్లే అని తాము దృఢంగా నమ్మండి. ఆవిషయంగూర్చి ఏలినవారికి సందేహించ పనిలేదు. నానోట అసత్యవచనం రాదు. సత్యవాదిని అని ఏలినవారికి నమ్మవలయును. ఒకవేళ అప్పుడప్పుడు స్వరాజ్యం సంపాదించేవిషయంలో ప్రజాబాహుళ్యానికి చెప్పి వుంటేమాటలప్రకారం నేను నడవకపోయినా ఏలినవారియెడ ఆప్రకారం నేను నడచుకోను. నడుచుకొంటే, హైందవసంఘంలో అపూర్వమై వుంటే మార్పు చేయడానికి చిక్కినఅవకాశం తప్పిపోతుంది. అంటరానితనాన్ని తొలఁగించడమున్నూ మామాలబిడ్డలకు దేవాలయప్రవేశం కలిగించడమున్నూ ఈరెం డంశాలే నాకు మిక్కిలిప్రధానములు. తక్కిందిస్వరాజ్యం గిరాజ్యం నాకప్రధానం.' అంచూ వుండఁగా, ఇర్విన్ప్రభువు, 'జనులకు తమయం దుంటే నమ్మకానికి వూనం కలుగుతుందేమో.'

అని అన్నాఁడఁట. దానికి గాంధి 'ఆదినుండీ నేఁటి దాక అంటరానితనం పోకుంటే స్వరాజ్యం రాదంటూ అనేకపర్యాయాలు వ్రాసినాను. వ్రాసిన దాన్ని వుపన్యాసం చేశాను. ఇంకా చేస్తూ వుంటాను. మీ కేమాత్రం సందేహంవద్దు.' అని అన్నాఁడఁట! అనఁగా ఇర్విన్ ప్రభువు, 'శాసనోల్లంఘనం నిలిపి వేస్తారు. ఆవెనుక ఏమి?' అని అడిగాఁడఁట. అందుకు గాంధి ఈలా అని అన్నాఁడంట:—'శాసనోల్లంఘనంవల్ల దేశంలో కలిగివుండే క్షోభను తగ్గించడానికి కొందఱు ప్రయత్నిస్తా రంటిని. దాని కనుకూలంగా వర్తిస్తా నంటిని. అంటరానితనం పోలేదు. అది అడుగంటేవఱకు అన్నం తినను.' అని అంటాను. నాచావుకు నాశిష్యులు వొప్పుకోరు. ఇంకా తక్కినకక్షులవాళ్ళున్నూ వొప్పుకోరు. మీకున్నూ నాకున్నూ రాజీ నడుప కొందఱుప్రముఖులు ప్రారంభిస్తారు. వెంటనే, శాసనోల్లంఘనం విషయమై ప్రచారంచేయ గూడదు. దాన్ని ఆపవలసింది. వొక్క అంటరానితనం తొలగే విషయంగూర్చియే మీరు ప్రచారం చేయవలసివుంటుంది. రాజకీయాంశంగూర్చి ప్రచారం చేయగూడదు.' అని ఖండితంగా మీరు చేయ బోయేవుత్తరువులో వ్రాయండి. వ్రాసి నన్ను మీరు విడుదలచేయండి. నేను శాసనోల్లంఘనం నిలిపివేస్తాను. నిలిపివేసి వొక్క "అంటరానితనం; దేవాలయప్రవేశం" ఈరెం డంశాలనే పట్టుకొంటూ నేను వూగులాడుతూ వుంటాను.' అని.

ము. వ్య. 'అ దంతా జరిగివుంటుందా, మీఆగడం కాక పోతే?'

గ. 'అ దంతారహస్యగోష్ఠిలో జరగక వుండిందంటే, తిరువాన్కూరురాజ్యంలో వుండే దేవాలయాల్లో అంత్యజులకు ప్రవేశించడానికి ఆరాజ్యంయొక్క మహారాజు వుత్తరువుచేసి వుండడు.' అనేది మా వూహ.

ము. వ్య. 'అ దేలా వూహిస్తారు?'

గ. 'ఇర్విన్ప్రభువుతో మీగాంధిమహాత్ముఁడు రహస్యగోష్ఠి జరిపినది మొదలు నేఁటిదాక ఆతఁడు చేసి వుండేవ్యవహారం యొక్క పర్యవసానాన్ని అంతా వొకదాన్నిగూడా విడువక ఒకదానితో వేఱొక దానిని లంకె వేసుకొంటూ మీ రాకళింతకు తెచ్చుకోండి. నేనున్నూ ఆరహస్యగోష్ఠిపర్యవసానం సాధ్యమైనంతవఱకున్నూ, నాకు జ్ఞాపకం వున్నంతవఱకున్నూ, పూసగ్రుచ్చినరీత్యా తమతో విన్నవించుకొన్నాను. తిరువాన్కూరు దేవాలయప్రవేశవిషయం గూడా ఆరహస్యగోష్ఠీపర్యవసానం అయి వుంటుందనేది నావూహ. ఏలాగంటే దయచేసి వినండి. ఆ రహస్యగోష్ఠిలో గాంధి తాను చేయబోయేకార్యక్రమం అంతా ఇర్విన్ప్రభువుతో వెడలగ్రక్కిన ప్రకారం సర్వం జరిపాడు. అలాగా జరుపగా ఆయేలినోఁడు 'గాంధి ఆడినమాట తప్ప లేదు. ఇక తనకు చేయవలసివుండేపని శేషించివుంది. దాన్ని చేసిందానివల్ల ఆర్థికవ్యాపారాల్లో దొరతనానికి నష్టం లేదు. మనదొరతనానికిన్నీ చేటు మూడదు. అది సిరస్థాయిగా వుంటుంది. దీనితో ఈ 'నాన్కోఆపరేషన్' ఆర్భాటం వుండదు.' అని యెంచి, దానికి కావలసి వుండేఏర్పాట్లు తనకు అనంతరంవచ్చే వైసురాయికి సూచించి పోయివుంటాడు. ఆతనివెనుక వచ్చినవైస్రాయి దానికి నేలనుపదను చేశాఁడు. తిరువాన్కూరుమహారాజాకు మహమ్మదీయుఁడు దివానుగా నుండునంతకాలం దేవాలయప్రవేశవిషయం గుప్తంగానే వుండింది. ఆమహారాజు ఇంగ్లండు మున్నగాఁ గలయైరోపాఖండములకుఁ బోయి నాఁడు. ఆడ హోంగవర్నమెంటులో వొకడుగా వుండేహిందూదేశప్రధానకార్యదర్శి 'ఓరాజా! నీవు నీరాజ్యమునకు పోయినతోడ్తో దేవాలయప్రవేశం అంత్యజులకు కలిగించవలసింది. అయితే తురకదివానుగా వుండేకాలంలో వద్దు. పాపాలభైరవుఁడు బ్రాహ్మణుఁడై వుండేదివాను వచ్చినతోడ్తో దాన్ని చేయుము.' అని ఆమహారాజా చెవిలో వూదివుంటాడు. అలాగా వూదడం ఆరాజాకు తొడబెల్లం అయి వుంటుంది. హిందూదేశంలో వుండేసామంతప్రభువుల్లో తిరువాన్కూరుమహారాజు మిక్కిలిప్రాచీనాచారపరాయణుడు. ఆతఁ డెన్న డింగ్లండునకు పోయినాడో, నాఁడే ఆతనిప్రాచీనపరాయణత్వం మట్టిలో గలిసింది. ఆరాజు స్వరాజ్యమునకు వచ్చాఁడు. ఆడ వుండేదేవాలయాలన్ని ఆతనివి. ఆతఁడింగ్లండుకు పోకముందాకా వెలల్లో ఇంగ్లండుకు పోయి వచ్చి వుండేహైందవులకు ప్రవేశం లేదు. ఆతఁడా రాజ్యమునకు ప్రభువు. ఇంగ్లండుకు పోయి వచ్చినాఁడు. వచ్చి దేవాలయాల్లో నాతఁడు ప్రవేశించాఁడు. అంత్యజులకు ప్రవేశం కలిగించాడనేవ్యాజాన్ని పురస్కరించుకొని ఆరాజును నాక్షేపిస్తూ వుండేప్రాచీనాచారపరాయణు లేల అప్పు డూరకుండిరి? దేవాలయము లాతనివి. ఇంగ్లండుకు ఆతఁడు పోయి వచ్చి వుండినా అం దాతనికి ప్రవేశం కద్దు. ఆక్షేపించడాని కారాజ్యంలో ఎవరికిన్నీ నోరు లేదు.

గాంధి కొన్నియేండ్లకు పూర్వం కన్యాకుమార్యగ్రంలో వుండే పరాశక్తిమూర్తిని దర్శింపనాడకు బోయివుండే కాలంలో కోరినాడు. అయితే సీమ కొతడు పోయి వచ్చినాడు. దానివల్ల కన్యాకుమారినిదర్శించ గూడదన్నారాడ నప్పుడుండే అర్చకులు. అన విని 'ఇంగ్లండుకు పోయి వచ్చిన గాంధికి దేవాలయప్రవేశం కలిగించినారు కొరా అర్చకు లీకన్యాకుమార్యగ్రంలో. 'అంత్యజుల కిందు ప్రవేశం కలిగిస్తాను. చూడు నా దెబ్బ.' అని అప్పడా గాంధి తనహృదయంలో చేశి వుండే సంకల్పాన్ని ఇర్విన్ దొరతో తా నొనర్చి వుండే రహస్యగోష్ఠి పర్యవసానంగా తేల్చినాడు. తురక దివాను వెళ్లాడు. పాపాల భైరవుడు బాపడు. అట్టి బాపడు దివానుగా అయినాడు. అయిన వెంటనే తిరువాన్కూరు రాజ్యంలో వుండే దేవాలయాల్లో అంత్యజులకు ప్రవేశం కల్గించాడా పాపాల భైరవుడు. ఇంగ్లండుకు పోయి వచ్చిన మహారాజు తన దేవాలయాల్లో ప్రవేశించిన వెనువెంటనే ఆడ వుండే మూర్తులందుండే దైవాంశం పరారి చిత్తగించింది. అప్పటినుండి నేటిదాకను, రేపున్నూ ఆదేవాలయాల్లో వుండే మూర్తులంతా అయిదువ లేని ముత్తయిదువలే అని అనుకోవోయి ఓయి గాంధిశిష్యుడా! ఇప్పడా అయిదువ లేని ముత్తయిదువలనే మీ గాంధిమహాత్ముడున్నూ, ఆతని మాలబిడ్డలున్నూ, దర్శనం చేసుకొంచూ వుంటారు. దీనికి సనాతనధర్మపరులుగా వుండే అస్మదాదులకు చింత సుంతేనియు లేదని గాంధి మున్నుగా గలసంఘసంస్కారులు తలఁపఁ బ్రార్థితులు.'

ం. వ్యా. 'బ్రిటిషు గవర్నమెంటు గాని ఇండియా గవర్నమెంటు గాని అంత్యజులకు దేవాలయప్రవేశం కలిగించవలసిందిగా తిరువాన్కూరు ప్రభువు నేల కోరెను?'

ర. 'తిరువాన్కూరు మహారాజు తన రాజ్యంలో వుండే దేవాలయాల్లో అంత్యజులకు ప్రవేశం కలిగించాడు. మహారాజుయొక్క అట్టి అధర్మకార్యాన్ని బ్రిటిషు ఇండియాలో ఆస్తికులుగా వుండే హైందవసంఘం హర్షిస్తుందా? తెగడుతుందా? అనే అంశం దీర్ఘాలోచన కల్గిన బ్రిటిషు గవర్నమెంటు తెలుసుకొంటుంది. తెలుసుకొని హర్షించేవాళ్ల సంఖ్య అధికంగా వుండంటే దేవాలయప్రవేశం మాలవాళ్లకు కలిగించడం; లేకుంటే మానేయడం.' అనే తీర్పు చేసుకొంటుంది. దీనికిగానే తిరువాన్కూరు మహారాజుచే ఇండియా దొరతనం ఆకార్యాన్ని చేయించి వుంటుందనేది నా వూహ.'

దానికి అనుకూలంగానే క్రొత్త రాజ్యాంగాన్ని కూడా పార్లమెంటుద్వయం కూర్చి వుంది. బాలికావివాహనిషేధ శాసనమున్నూ దానివంటి శాసనములున్నూ, శాసనసభల్లో ప్రవేశింప జేయడానికి ముందుగా వాట్ని ప్రవేశింప తలపెట్టిన సభ్యునకో సభ్యులకో వైసురాయిగారి అంగీకారం పొందవలసి వుండింది పూర్వం. క్రొత్త రాజ్యాంగపద్ధతి ప్రకారం అట్టి అనుమతి అనవసరం. శాసనసభల్లో ప్రవేశించే సభ్యున కెవనికైనా ఎట్టి చట్టం అయినా' వైసురాయి అనుమతి లేకుండా, ప్రవేశింప చేయవచ్చును. దానివల్లనే గాంధిన్ని, ఆతనిశిష్యులున్నూ, తమకు ఎక్కువ పలుకుబడి వుండేలాగా తమ్ము నే వరించుకోవలసిందిగా హైందవసంఘాన్ని కోరుచూ వున్నారు. దానికే రాజకీయవ్యవహారంలో ప్రవేశించడం లేదన్న సి. రాజాగోపాలాచారి యూనివర్సిటికి ప్రతినిధిగా అభ్యర్థి అయి నిలిచి వున్నాడు. ఆతడున్నూ తక్కుంగల కాంగ్రెస్సు నాయకులున్నూ శాసనసభాద్వయంలో చేరి చేరకముందే,

'అంటరానితనం మాయం చేయవల్సింది. పంచములకు దేవాలయప్రవేశం కలిగించవలసింది. ఈరెండున్నూ శాసనాలయిన వెంటనే, మఠాలున్ను వాటిసొత్తులున్నూ, దేవాలయములున్నూ వాటిసొత్తులున్నూ భూములు లేని పంచములకు అందజేయవలసింది.'

అనే తీర్పులు చేస్తారు. దానికే వాళ్ల గాఢప్రయత్నం.'

మొ. వ్యా. 'అంటరానితనాన్ని తీసేయడానికిన్నీ, దేవాలయప్రవేశం మాలవాళ్లకు కలిగించడానికిన్నీ సి. రాజగోపాలాచారి ప్రభృతులు శాసనసభల్లో చేరారనడం వొప్పుకోతగింది కాదు. స్వరాజ్యసంపాద్యానికే వాళ్లందు ప్రవేశిస్తారనడం సవ్యం?

భీ. ర. 'అంటరానితనాన్ని తీసివేయడానికిన్నీ, మాలవాళ్లకు దేవాలయప్రవేశం కలిగించడానికిన్నీ, గాంధి కాంగ్రెస్సుసభ్యులకు శాసనసభల్లో ప్రవేశించడానికి అనుజ్ఞ ఇచ్చి వున్నాడు. కాని స్వరాజ్యసంపాద్యానికే మాత్రం కాదు. ఇది నిక్కం. ముమ్మాటికి నిక్కం. 'శాసనసభల్లో ప్రవేశించి క్రొత్త రాజ్యాంగాన్ని తల చీల్చవేస్తాం; స్వరాజ్యం సంపాదిస్తాం; తెల్లోళ్లకి జీతాలు తగ్గిస్తాం. పన్నులు తీసివేస్తాం' అంచూ అమాయికులుగా వుండే ప్రజా

సమూహాన్ని మోసం చేయడానికి చెప్పుచూ వుంటున్నారు. శాసనసభలమూలాన స్వరాజ్యం రాదు. క్రొత్తరాజ్యాంగాన్ని తల చీల వేయలేరు. వీ శ్లేమైనా ఆసభల్లో తోక ఆడించారా, గవర్నరు శాసన సభలు మూశేస్తాఁడు. మూశేసి తానే రాజ్యభాగాన్ని నిరంకుశంగా పాలించుకొంటాఁడు. దానికి త్రోవ కలిగిస్తే కలిగించ వచ్చును ఈ కాంగ్రెస్సు సభ్యులు.

మొ. వ్య. 'భీమశంకరంరెడ్డిగారూ! ప్రొద్దు కొండలోఁబడి చాలరాత్రి అయింది. నేఁటికి సభ చాలింతాం. రేపు నేఁడు చేరిన వేళకే తిరుగ మన మీఁడ చేరుదాం.'

౨. రె. 'బుద్ధి బుద్ధి. ఆలాగే చేస్తాం'(అని సభాధ్యక్షుఁడై వుండు లక్షావులరామచంద్రారెడ్డి మోము గాంచెను. దాని కాతఁడు), 'రాత్రి చాలఁ బ్రొద్దెక్కింది. రేపు సభ చేయవచ్చును నేఁటిసభ చాలించాను.'(అన విని సభా సభ్యులు లేచి తమతమయిండ్లకరిగిరి. లక్షావులరామచంద్రారెడ్డి చాకలివానిఁ గాంచి, 'ఓకీనారిగా! (కాంగ్రెస్సునాయకులఁ జూపి) ఈ పెద్ద మనుష్యులఁ దోడ్కొనిపోయి వారికై విడిచి పెట్టియుండుమన మేడలో వదలుము. వదలి వారు భోజనం చేయుపురోహితు లయ్యవారియింటికిఁ బిలుచుకొని పొమ్ము. పోయి వారికి భోజనా లైనవెనుక నీ వంత వఱకక్కడ వుండి విడిదికి వారిఁదోడ్కొని చనుము. చని వారికిఁ బడక లెల్ల వేసి యింటికి నీవు పొమ్ము. (అని చెప్పఁగా మడివేలు ముందుగాను వానివెంట నాయకులును మున్నుగాఁగలవారును నడచి తమతమ యిరవుల కరిగిరి. నాఁడాతీరున సభ ఆపల్లియలో నడచెఁగదా!)

౧౯౩౬ సం॥ము డిసంబరుమాసాంతమున ఫేజపూరు సమావేశమైన దేశీయమహాజనసభఁ బురస్కరించుని సమస్తవస్తుప్రదర్శనశాల నెలకొల్పఁబడెను. ంధి దానిం దెఱచినాఁడు. అప్పు డాతఁడు చేసినయు ్యసమున ని ట్లనినవాఁడఁట :—

'ఖద్దరు చక్రఁగ వుత్పత్తి కాలేదు. కోటి ట్నాలు హిందూదేశంలో ఆడుచూ వుండ ౕను. అయితే అన్నిరాట్నా లాడలేదు. టరానితనం అడుగంట వలెను. కాని అది ౕను వుంది. ఆ రెం డంశములున్నూ నాకోరిక ప్పున సిద్ధి అయి వుండిం దంటే నేను చెప్పి శేలాగా స్వరాజ్యం వొక్కయేఁడాదికాలంలోపల వచ్చి వుండవచ్చును. అట్లని నేను చెప్పింది వాస్తవం. అస్పృశ్యత లయించ లేదు. ఖద్దరున్నూ వుత్పత్తి కాలేదు. ఇంక సంవత్సర కాలంలోపల స్వరాజ్యం ఏలా వస్తుంది? రాదు. స్వరాజ్యం రానిదానికి నే నేలాగా వుత్తరవాదినవుతాను? కాను.' అని.

పైనఁ జేర్కొనఁబడినవాక్యములందలిభావమే కలవాని నే గాంధి ఆవస్తుప్రదర్శనశాలఁ దెఱచుసందర్భమునఁ బల్కినాఁడని ఆతనిమతప్రచారానికై నెలకొని యుండు 'హిందు, డైలీఎక్స్‌ప్రెస్సు, ఆంధ్రపత్త్రిక, స్వదేశమిత్త్రిన్, ప్రజామిత్త్రి' అనుమున్నగాఁ గలదైనికపత్త్రికలందుఁ బ్రకటింపఁబడి యున్నవి. ఆప్రకారము గాంధి యుపన్యసించినవిషయ మాతనివంటినాయకునకుఁ జెప్పఁదగినదా? చెప్పి 'తా నేమాత్రము స్వరాజ్యము రావందులకు నుత్తరవాదిని కాను. తనకుఁ దోడ్పడక మిన్నకుండుజనులది' అని వారిపై నేరము మోపుట ఆతనివంటి నాయకునకుఁ దగునా? అని యీలాగున విమర్శింపఁబడును.

ఆ నేలగట్టుపల్లియయందే సముద్రతీరమున శ్రీలక్ష్మీనృసింహస్వామిదేవాలయము నెదుట నే పూర్వోక్తరీతి సభ నడచును. దానికిఁ బూర్వోదాహృతులైనభువనగిరి శేషాద్రిశాస్త్రి సభాధ్యక్షుఁడై సభాచర్య నడపును. లక్షావులరామచంద్రారెడ్డిప్రముఖు లెల్ల నటఁ బ్రోగై యుందురు. కొండలోఁ బడుటకు జాము ప్రొద్దుండును. దేశీయ మహాజనసభా నాయకులును, జస్టిస్ వర్గము వారును, ప్రజాపక్షమువారును నటఁ జేరి యుందురు. అయిన వారిలో నడుగఁబోవుప్రశ్నలకు బదులు చెప్పుటకు నియమితులై యుండువారి కే ప్రశ్నలకు బదులు చెప్పవలయు నని నియమ ముండును. తక్కినవారికి నోరెత్తిపలుక నధికారమ మాసభలో లేదు. లక్షావులరామచంద్రారెడ్డి ఆగ్రామమునఁ బెత్తనము చేయుగృహస్థుఁడు. అట్లగుటవలన నాతఁ డొనర్చినయేర్పాటది. దానివలన లేనిపోనివాగ్వాదాల కెడ ముండదు.

సభాధ్యక్షుఁడైనభువనగిరిశేషాద్రిశాస్త్రి ఇట్లనియె:—"సభ్యులారా! మహిళారత్నములారా! రాత్రి ప్రశ్నోత్తరా లేపట్టున నిలిపితిరో, ఆపట్టును నందుకొని భీమశంకరంరెడ్డియే కాంగ్రెస్సుసభ్యుల్లో మొదటివ్యక్తి నేప్రశ్న వేస్తాఁడు.(మొదటివ్యక్తిం గాంచి) 'దేవరా! తమకా రెడ్డి అడిగే ప్రశ్నలకు తమకు తోచే ప్రత్యుత్తరం దయ

వేశి చెప్పంచూ రండి.' (అని భీమశంకరా! కాంగ్రెస్సు
సభ్యుల్లో మొదటివ్యక్తినిఁ బ్రశ్న లడుగుము.''

శ. 'చిత్తం చిత్తం' (అని లేచి తనకు సద్విద్యను బోధించిన శేషాద్రిశాస్త్రిగారికి నమస్కరించి యటు వెనుక సభకు దండము లిడి యిట్లు ప్రశ్నింప సాగెను.) ''దేవరా! (అని మొదటివ్యక్తితో) 'గాంధి ఇర్విన్ ప్రభువుతో చేసివుండే రహస్యగోష్ఠీపర్యవసానం అంతా చెప్పి అయింది. దానివల్ల మనకూహించితీర్మానించుకోవలసి వుండేనిగ్గు:—(౧) అంటరానితనం తీసేయడానికి దొరతనం గాంధికి తోడ్పడవలసింది. గాంధి దానికిగాను స్వరాజ్యోద్యమాన్ని చాలించుకో వలసింది.' అనేదే కాదండీ నిగ్గు?'

వ్య. 'అయి వుండవచ్చును.'

శ. 'రాత్రి తమకు చెప్పి వుండే గాంధి చేసినవ్యవహారం అంతా ఆకళింతకు తెచ్చుకోండి. తెచ్చుకొని నిష్పక్షపాతబుద్ధితో దీర్ఘంగా ఆలోచించండి. అప్పటికిన్నీ మీ కాలోచన కుదరక పోయిం దంటే, మీ కాత్మారాము డనేవొకవస్తు వున్న దంటే, దాన్ని అడిగి తెలుసుకోండి. అప్పుడు మీ కంతాగోచరిస్తుంది.'

వ్య. 'మా కాత్మలే దనేదా మీ భావం?'

శ. 'మీవ్యక్తికి ఆత్మలే దని నేఁజెప్ప నొల్లను. మీ గాంధిమహాత్మునికి ఆత్మ ఏమాత్రం లే దంటూ ఢంకా కొట్టి చెప్తా.'

వ్య. 'ఏలాగా?'

శ. 'స్వరాజ్యం గడించేదానికిగ్గాను, వుద్యోగం చేశేవాళ్లను వుద్యోగాలనున్నూ, వక్కీలువృత్తిగా గల్గినవకీళ్ళను వకీళ్ళవృత్తులనున్నూ, విద్య నభ్యసిస్తూ వుంచున్నా లోకజ్ఞానశూన్యులుగా నుంచున్నా వుండేకుఱ్ఱవాళ్ళను చదువులనున్నూ, వదలుకోవలసిందంచూ వాళ్ళకు కాంగ్రెస్సుచే చెప్పించాడు. అవునా కాదా?'

వ్య. 'అవును. చెప్పించాఁడు.'

శ. 'కాంగ్రెస్సు ఆజ్ఞ చేశింది. దానికి వాళ్లు విధేయులైనారు. విధేయులై వుద్యోగాలు చేస్తూ వుండేవాళ్లు తమతమవుద్యోగాలనున్నూ, వక్కీలువృత్తివల్ల జీవనం చేస్తూ వుండేవాళ్ళు తమతమ వకీళ్ళవృత్తులనున్నూ, చదువుకొంచూ వుండేబాలురు తమ తమచదులనున్నూ, వెంటనే వదలుకొన్నారు. వదలుకొని దొరతనాని కెదు రొడ్డారు. అందువల్ల ఏలుబడికి కోపం వచ్చింది. ఆకోపంయొక్కపర్యవసానం వారికి కారాగృహవాసప్రాప్తి. మీ గాంధి కీడుగా రవంతైనా తక్కువ లేకుండా స్వరాజ్యం వస్తుం దనేగం పెడాశతో కడగండ్లన్నీ పడ్డారు. అవునా కాదా?'

మొ. వ్య. 'అవునండీ అవును. కా దంటా నా నేను?'

భీ. శ. 'ఇప్పు డేంచేశాఁడు?'

మొ. వ్య. 'ఇప్పు డేంచేశాడు! ఏమిన్నీ లే దే.'

భీ. శ. 'ఏమిన్నీ లేదా? ఇర్విన్ ప్రభువుతో మీ గాంధి చేశి వుండే రహస్యగోష్ఠీపర్యవసానం ఏంది?'

మొ. వ్య. 'ఏం దో! నాకేం తెలుసును.'

భీ. శ. 'ఇంతకు ముం దే కా దండీ చెప్పి వున్నాను. ఈలోపల మఱచారా? ఆత్మ గాంధికిన్నీ లేదు; మీకున్నూ లేదు. వుంటే ఏందో నాకేం తెలుసునా' అని అంటారా? చెప్పండి.'

మొ. వ్య. 'ఏమో గ్గంటిరి. అదా?'

భీ. శ. 'అనిగ్గే. అదే! అదే! ఇప్పుడైనా తమకు జ్ఞప్తికి వచ్చిందా?'

మొ. వ్య. 'వచ్చింది! వచ్చింది!'

భీ. శ. ఇర్విన్ ప్రభువుతో మీ గాంధి రహస్యగోష్ఠి సలిపేకాలంలో, స్వరాజ్యాన్ని గడించడానికిగాను తనతోపాటు సర్వం విడిచి, తా నెట్లా ఆడితే ఆలా ఆడుచున్నూ, 'అసహాయోద్యమప్రచారం స్వరాజ్యం వచ్చేదాక విడవడు' అని తన్ను నమ్మినసహచరులను తలఁచి వుంటాఁడా? తలఁచి వుండఁడు. తలచి వుండి వుంటే, ఆతనియొక్క ఇన్నర్‌వాయిస్సు (అనఁగా అంతరాత్మ) 'ఓ గాంధీ! స్వరాజ్యాన్ని సంపాదించే నిమిత్తం నీతోగూడ అసహాయోద్యమప్రచారం సాగించడానికి సర్వం విడిచి వచ్చినవాళ్ళనేకు లున్నారు. స్వరాజ్యం గడించేనిమిత్తం దారివేశావు. దారివేశి దానిమీఁద నిప్పురవలు వెదచల్లావు. వెదచల్లి వాటిమీఁద వాళ్ళను నడవ మన్నావు. వాళ్లు వాట్నిమీఁద నడిచారు. నీవున్నూ నడిచావు. ఆలా నిన్ను నమ్మి వచ్చి నవాళ్లను నట్టేటిలో ముంచి అంటరానితనాన్ని తీసివేశేదానికిగ్గాను ఇర్విన్ ప్రభువుతో రాజీ చేసుకోవడం నీవంటినాయకునకు తగదు. ఆలా చేయడం నమ్మకద్రోహం అవుతుంది. యమలోకం వొకటి వుం దంచూ నేను నీకు ఢంకా కొట్టి చెప్పుచున్నాను.' అని అంటరానితనాన్ని తొలగించేనిమిత్తం ప్రాయోపవేశం చేయ మన్నఇన్నర్‌వాయిస్సు (అనఁగా అంతరాత్మ) చెప్పి వుండదా? చెప్పి వుం దంటే దొరతనంతో రాజీ చేసుకొని వుంటాఁడా? అంటరానితనాన్ని తీశివేయడం లగ్గంచూ చెప్పడానికి అంతరాత్మ. (అనఁగా ఇన్నర్‌వాయిస్) వుండడమున్నూ, స్వరాజ్యోద్యమమునకు

తిలోదకాలు విడువు మంచూ చెప్పడానికి లేకపోవ డమున్నూ, చూస్తే, దీర్ఘంగా ఆలోచిస్తే, మీగాంధికి రవంతైనా అంతరాత్మ లేదని రూఢిగా మారు తీర్పు చేయవలసి వుంటుంది. అవునా? కాదా?'

ము. వ్య. 'వంచినతలను ఎత్తలేదు.'

౹. రె. 'ఓగాంధిశిష్యుఁడా! వినుము ఇంకా. స్వరాజ్యం సంపాదిస్తాను. దానికి డబ్బు కావలెనంటే కోటి రూపాయలు ప్రజలు గాంధివొడిలో గల్లల్లన పోశారు. పోశారా లేదా?'

ు. వ్య. 'పోశారండీ పోశారు. లేదని చెప్పగలనా?'

. రె. 'కల్లంగళ్లు మూశేయండి. కల్లు త్రాగవద్దు. తాటిచెట్లనున్నూ, ఈతచెట్లనున్నూ, కల్లు గీయడానికి విడవవద్దంటే, వాటియజమానులను, వాళ్లున్నూకల్లు గీయడాని కావృత్తులను విడవడం మానేశారు. అలా గే కల్లు త్రాగడం నిలిచింది. కల్లంగళ్లు మూత వడ్డవి. కల్లు త్రాగేవాళ్లకు లాభం. దొరతనానికి విప రీతనష్టం. దానికిగాను తనతోగూడ స్వరాజ్యసంపా ద్యానికై కష్టపడ్డవాళ్లిప్పుడు జీవనం లేక కష్టపడ డం చూచినా, విన్నా మీగాంధిమహాత్ముఁడు పైజ పూరులో అలా చెప్పి వుంటాఁడా? స్వరాజోద్యమాన్ని నిలిపి వుంటాఁడా?'

.. వ్య. '(మౌనముద్రధరించి) 'చాలు ననిపిస్తూ వుంది యీవోట్లను బిచ్చమెత్తడం. దీనికై ఎన్నోగ్రామాల కు వెళ్లాం. ఈకాంగ్రెస్సుసభ్యులను సామాన్యంగాను, వాళ్లలో ముఖ్యంగా గాంధిమహాత్ముణ్ణీ, ఈలాగా ఆక్షేపించి వుండేమగధీరుడు గగనకుసుమం.' (అని మనస్సులో ననుకొని మిన్నకుండును.)

రె. 'వుప్పు చేయండి అని అన్నాఁడు. వెంట నే వుప్పు చేశి కారాగృహాలకు బోయి వుండే వాళ్లకిప్పుడు ఆపూట గడవడం పెద్దయీగంగా వుంది.' అవునా కాదా? దయచేశి సెలవియ్యండి.'

. వ్య. 'అవు నవును.'

రె. 'లంకషైరువస్త్రాలను గొనవద్దనేదానికి మను ష్యులు లేకుంటే, ధనికులుగా వుండే గాంధిశిష్యు లు కొందఱు డబ్బిచ్చి కూలీలను ఆపని చేయడా నికి నియమించుకొన్నారు. అలా నియమించుకోగా ఆకూలీలు సీమబట్టల గొనవద్దనివాట్ని కొనడానికి వచ్చేస్త్రీపురుషులను అడ్డగించారు. దానివల్ల వాళ్లు పోలీసువాళ్లకిఱ్ఱదెబ్బలు తిన్నారు. తిని చెఱలో బడ్డారు. వాళ్లు విడుదల పొందినారు. కాంగ్రెసుకు చేరినోళ్లనే కారణంవల్ల వాళ్లకున్నూ తినడానికి బువ్వలేకుంది. ఆకూలీ లెవరో కారు; అసహాయో

ద్యమప్రచారంలో ఆదిలో చెఱలకుఁ బోయి వుండే కుఱ్ఱవాళ్లు. ''కాంగ్రెస్సుకుగాను చెఱలో బడ్డాం. తినడానికి వణ్ణం లేదు.' అంటూ, రైలు నిలిచేమకా ల్లోను, వీథుల్లోను, ట్రాంబళ్లు నిలిచేచోట్లల్లోను బిచ్చం ఎత్తేదంతా వాళ్ళే.

ము. వ్య. 'నన్ను విడిచేలాగా లేదే యీరెడ్డిసంసారి ప్రశ్నవేసేటీరు చూస్తే.' (అని మనమున ననుకొనుచు నుండును.)

భీ. రె. 'మొన్నమొన్ననే రాజ్యాన్ని వదలుకొన్న యె న్మిదోఎడ్వర్డు యువరాజుగా వుండేకాలంలో, హిందూదేశానికి వచ్చాడు. ఆయన్ను దర్శించడానికి పో గూడదని కాంగ్రెస్సుచే గాంధి చెప్పించాడు. చెన్న పురిలో ఆరాచబిడ్డను చూడఁబోఁబోవుచూ వుండేగొప్పగొప్పవుద్యోగస్థులమీఁద అమేధ్యం కలిపి పోశారఁట ఈమీగాంధిమహాత్మునిశిష్యులు.' అంగళ్లుమూశేయ మన్నారు. అంగళ్లు కొన్నిమూత వడ్డవి. ట్రాంబళ్లు నడపవద్దని వాట్ని నడిపేవాళ్లకు బోధించారు. అలాగా యువరాజు వచ్చినప్పుడు చెన్నపట్టణం, భరతుఁడు దశరథుఁడు చచ్చినానక మాతామహునిపురినుండి అయోధ్యకు వచ్చినాడు. అప్పుడాపట్టణమును వాల్మీకి వర్ణించి వుండేలాగా వుండింది. అప్పుడు వచ్చినయతఁడెవఁడు? హిందూ దేశాన్ని పాలిస్తూ వుండే పంచమజార్జిచక్రవర్తిపెద్ద కొడుకు. ఈదేశానికి చక్రవర్తిగ రాబోయేరాచ పట్టి. ఇంగ్లీషుజనులు తమరాజుఁ దమప్రాణమునకు తుల్యంగా భావిస్తారు. అట్టిఇంగ్లీషువాళ్లీదేశాన్ని పాలిస్తూ వున్నారు. వాళ్లకు ప్రాణపదంగా వుండే యువరాజు నవమానము గాంధి చేశినాఁడు. అప్పుడాయువరాజు నవమానం చేయడం. ఇప్పుడు అంట రానితనాన్ని తోశివేయించుకోడానికై ఇంగ్లీషు ప్రజలకాళ్లమీఁద మీగాంధి సాగిలపడడం. ఇదంతా మీగాంధికే తగి వుంది కాని యుక్తాయుక్తజ్ఞానికి దంతా తగదు. అవునా కాదా?'

ము. వ్య. 'మౌనము తాల్చును.'

భీ. రె. 'సైమన్‌కమిషన్ వచ్చింది. దాన్ని కాంగ్రె స్సుచే వెలివేయించాఁడు మీగాంధి. గోహతిలో నడిచి వుండేకాంగ్రెస్సుకు అధ్యక్షుడుగా వుండే బాపనసంసారి నల్లజెండాలను కొంచూ సైమన్‌కమి షనుకు సాక్ష్యం ఇయ్యవద్దంచూ చెన్నపురివీథుల్లో వూరేగాఁడు. అవునా కాదా? ఇప్పుడాతఁడు గాంధిని విడిచాడు. విడిచి గాంధి వెలివేశినబ్రిట్టిషు కోర్టు అయి వుండేహైకోర్టులో సెలసెలకు లక్షల

కొలదిరూపాయల నార్జిస్తూ వున్నాఁడు. అవునా కాదా?'

ం. వ్య. 'మౌనము తాల్చును.'

రె. 'ఈతీరున సకలవిధముల హిందూదేశస్థులు సామాన్యంగాను, హైందవులు ముఖ్యంగాను, స్వరాజ్య సంపాద్యానికై అర్థప్రాణాలను అర్పించి వుండడం గాంధికి తెలుసును. తెలిసీ 'నేను చెప్పినప్రకారం జనులు నాకు తోడ్పడ లేదు. దానివల్ల ఏడాదిలో రావలసి వుండినస్వరాజ్యం రాక వెనుకకు పోయి, థేమ్సునదీతీరంలో వుండేవైటుహాలులో దాగివుంది.' అని మీగాంధి పైజపూరులో చెప్పి వుండడం ధర్మమా? అది కృతఘ్నత కాదా? దయ చేశి చెప్పండి.'

. వ్య. 'మౌనమే భూషణం.'

రె. 'స్వరాజ్యం సంపాదించి మీ కిస్తాను. కోటిరూపాయ లియ్యండి' అని గాంధి అంటే హిందూదేశస్థులలో హైందవులే కోటిరూపాయ లిచ్చివుంటారు. అంతపెద్దరొక్కంయొక్క మొత్తాన్ని మీగాంధి ఏం చేశాఁడండీ? కోతిచేతిపూలదండగా ఆకోటిరూపాయలమొత్తం అయింది కాదండీ.'

. వ్య. 'అదేమ ట్లంచున్నారే. కోటిరూపాయలను తనకార్యమునకే వుపయోగించుకొన్నాఁడా ఆ గాంధిమహాత్ముఁడు?'

రె. తన కుపయోగించుకోక పోతే మఱెన్ని దేనికి దాన్ని వుపయోగించుకొని వుంటాఁడో దయచేసి చెప్పండి.'

. వ్య. 'జాతీయపాఠశాలలు స్థాపింపఁబడిన వఁట!'

రె. 'ఏ చోట? ఉపాధ్యాయులెవ్వరు? వారి యోగ్యతేమి?' అడ బోధింపఁడే విద్యాస్వభావం ఎట్టిది?

. వ్య. 'తప్సీలు నాకు తెలియదు. కాని ఏవో కొన్ని తావుల్లో జాతీయపాఠశాలలు స్థాపించారంట!'

రె. తిలకుస్వరాజ్యనిధిలో చాలరొక్కము గాంధియొక్కప్రతిష్ఠ ఖండాంతరాల్లో వ్యాప్తి చేయడానికై వ్యయము చేయఁబడిన దంట? వాస్తవమా, ఆ కింవదంతియా?'

. వ్య. 'నన్నీరెడ్డి వదిలేలాగ కనుపించకున్నట్లుంది. ఈతఁడు ప్రశ్నవేశేధోరణి చూస్తే (అని తనయున సెంచి ప్రకాశంగా) 'ఆవిషయం నాకంతగా తెలియు దండి.'

రె. 'తమకు తెలియ దంచూ చెప్తూ తున్నారు. అయితే మీపలుకులను నమ్మను. గాంధికి కుడిభుజంగా వుండేవాళ్లల్లో తామున్నూ వొక్కరు. ఆకారణం వల్ల తిలకుస్వరాజ్యనిధి వ్యయమై వుండేవిధం అంతా తమకు తెలిసి వుంటుం దనేది మానమ్మకం. అయితే తెలియ దని మీరు చెప్పడం మీకు పాపం. దానికిగాను పరలోకంలో యమునికి బదులు తమకు చెప్పవలసి వుంటుంది.'

మొ. వ్య. 'మీ రెంత అయినా మమ్మ నిందించండి; ఆనిధి వ్యయమై వుండేతీరు నాకు తెలియదు. ఆవెనుక?'

భీ. రె. 'మీకు తెలియ కుంటే, నేను చెప్తా వినుకోండి. గాంధికి కాంగ్రెసుఅధీనం కాక పూర్వం 'కాంగ్రెస్' అనుపత్రికను లండనులో వుండేకాంగ్రెస్సుపక్షంవాళ్లు ప్రచురిస్తూ వుండిరఁట! ఆవైనం తమకు తెలుసునా? లేదా?'

మొ. వ్య. 'తెలు...సును.'

భీ. రె. 'గాంధి ఆఫ్రికానుండి వచ్చినానక కాంగ్రెస్సును తనఆధీనం చేసుకొన్నాఁడు. చేసుకొని, లండనులో ప్రకటింపబడుతూ వుండినకాంగ్రెస్సపత్రికను నిలిపేశాడట! తెలుసునా?'

మొ. వ్య. 'నాగపూరులో నడిచి వుండేకాంగ్రెస్సునందో, దానికి వెనుకనే అయివుండేసమావేశమునందో అది నిలుపఁబడిన దని నాకు జ్ఞప్తి.'

భీ. రె. 'ఆవిషయమే తెలియ దంటిరే. ఇప్పుడేలాగా తమకీవిషయం జ్ఞప్తి వుంది?'

మొ. వ్య. తిలకుస్వరాజ్యనిధివ్యయం అయి వుండేవిషయం తెలియ దంటిని. కాని లండనులో వెలువడుతూ వుండినకాంగ్రెస్సు పత్రికాప్రచురణవిషయం తెలియ దని నేను చెప్పలేదు.'

భీ. రె. 'అలాగా? సరి. కాంగ్రెస్సుపత్రికను మీగాంధి ఎందుకు నిలిపాఁడో తెలుసునా తమకు?'

మొ. వ్య. 'దానివల్ల లాభం ఏమిన్నీ వుండ దని.'

భీ. రె. 'లాభం లేక ఏం? హిందూదేశాన్ని పాలించేది పార్లమెంటుద్యోగం. అందుండేసభ్యులందఱున్నూ ఇంగ్లండులో నే వున్నారు. ఇండియాలో వాళ్లు లేనే లేరు. వాళ్లకు కాంగ్రెస్సుయొక్కముఖ్యోద్దేశం అనవరతం తెలుపుతూ వుండడానికై ఆపత్రికను అప్పటివాళ్లు లండనులో ప్రకటించడానికి ప్రారంభించారు. దానివల్ల లాభమే కాని నష్టం లేదు. పార్లమెంటుద్యోగం ఎంతకాలం హిందూదేశంపై కట్టుపారుపత్తెం చేస్తూ వుంటుందో, అంతకాలం ఆ పత్రికాప్రచురణంవల్ల లాభమే కాని నష్టం వుండి వుండదు. గాంధి దాన్ని నిలిపి వేయడం మిక్కిలిఅవివేకం అని నాకు తోస్తూవుంది. అవునా కాదా?'

౧. వ్య. 'అయి వుండవచ్చునేమో!'

రె. 'దాన్ని నిలపడానికి కారణం తమకు తెలియదు. పోనిండు ఆమాటను. నేను చెప్తా వినండి. కాంగ్రెస్సుపత్త్రికను లండనులో ప్రకటించడం గాంధిమాని వేశాఁడు. మానివేశి తిలక్కు స్వరాజ్యనిధి పైకొన్ని ఖండాంతరాల్లో తనపేరు వ్యాపించడానికై వ్యయం చేశాఁడఁట! అవునా కాదా?'

౧. వ్య. 'ఏమోనండి? ఏలా వ్యాపించచేశాఁడు?'

రె. 'వార్తాపత్త్రికలు లేని రాజ్యభాగాలు లేవు. ఇంగ్లండులో ప్రకటితము లగుచూ వుండేపత్త్రికలను తమ్మునున్నూ, తమరాజకీయచర్యలనున్నూ, పొగడుచూవుండేదానికిన్నీ, తములోపాలను కప్పి పుచ్చేదానికిన్నీ, ఇంగ్లండుదొరతనాన్ని నడపుచూ వుండేప్రధానకర్తలు తమకు వచ్చేజీతంనుండి పైకం తీసి ఇస్తూ వుంటూరఁట! అలా ఇస్తూ వుండేపైకం తీసుకొంచూ ఆపత్త్రికలు ఆకర్తలను, వాళ్లచర్యలను, పొగడుచూ వాళ్లలోపాలను కప్పిపుచ్చుతూ వుంటూ వుంటవంట! తమ కావిషయం తెలుసునా?'

వ్య. 'తెలుసును.'

రె. 'అయితే సరి. అలాగే, గాంధన్నీ చేశాడట!'

వ్య. 'అదేం దండో! క్రొత్తదిగా వుందే మీరు తెల్పే విషయం.'

రె. 'మీకంతా క్రొత్తదిగానే వుంటూ వుంటుంది. ాత్త్వికమార్గాన రాజ్యం సంపాదించినవాళ్లీ పపంచంలో ఏచాయచూచినా, ఎప్పుడైనాసరే ేరు. 'హిందుదేశాన్ని పాలిస్తూ వుండేబ్రిటిషు ారతనాన్ని తోలేయడానికి గాంధి సాత్త్వికమార్గం ేశాఁడు. అదిక్రొత్తది. అపూర్వం. కాబట్టి అతఁడు పరక్రైస్తవుఁడు.' అనేభావం ఖండాంతరా ో వుండేక్రైస్తవమతబోధకులచిత్తాలలో కలిగించ ానికై గాంధి తిలక్కుస్వరాజ్యనిధిని హెరాళంగా ్యయం చేశి వుంటాఁడఁట! అలాగా అతఁ ాసొమ్మును చేయకుండినాఁడంటే, అతనిపేరు ండాంతరాల్లో వ్యాపించి వుండందు. డబ్బియ్యం న్ని ఆరాజ్యభాగాల్లో ప్రకటితము లగుచూ వుండే త్త్రిక లేమాత్రం గాంధిపేరును ప్రకటించి వుండ . అతనిపేరున్నూ ఏవరికిన్నీ ఆదేశాల్లో తెలిసి వుం దు. తెలిశి వుండడానికి కారణమున్నూ లేదు. ండాంతరాల్లో గాంధి అపరక్రైస్తవుఁడనిన్నీ, హాత్ముఁడనిన్నీ తిలకుస్వరాజ్యనిధిమూలంగా మీ ంతా వ్రాసి ఆడ ప్రకటింపఁబడుచూ వుండేపత్త్రి ల్లో ప్రకటించారఁట! ఆప్రకారం అతనిప్రతిష్ఠ ఖండాంతరాల్లో వ్యాపించిందంట! స్వరాజ్యసంపాద్యముకై లోకులు ...చ్చినతమకష్టార్జితద్రవ్యమును గాంధి తనపేరుప్రతిష్ఠలు ఖండాంతరాల్లో వ్యాపించడానికై వ్యయం చేశాఁడఁట! ఆధనం కోతిచేతి పూలదండ అయిందంట! ఈదేశంలో సర్వం స్వరాజ్యానికై అర్పించి వుండేబీదలకైనా వ్యయం చేసి వుంటే, అతణ్ణి నమ్మి కష్టపరంపరా లనుభవించినందులకు ఫలం అయినా కలిగి వుండి వుంటుంది. అలా చేశాడా మీగాంధి?'

మొ. వ్య. 'ఆవెనుక?'

భీ. రె. 'ఆవెనుక నేముంది? మీతో ప్రశ్న వైచినవిషయం అంతా సింహావలోకనం చేయవలసి వుంటుంది.' (అని సభాధ్యక్షుని మోము చూచును).

భు. శే. 'ఇంక సింహావలోకనం వలదు. కాంగ్రెస్సునాయకులలో మొదటివ్యక్తిని ప్రశ్నించి అయింది. మిక్కిలినేర్పుతో మన కావ్యక్తి ప్రత్యుత్తరాలు సెప్పి మన కుండేసందేహాలు తీర్చింది. దాని కాతనికి సభయొక్క కృతజ్ఞతాపూర్వకానేకవందనములు సేయఁబడుచున్నవి. ఇఁక రెండవవ్యక్తి మనకు ముఖ్యం. అతఁడే కాదా శాసనసభాద్వయంలో వొక్కదానిఁ బ్రవేశించడానికి యత్నం చేస్తూ వుంటున్నాఁడు. అతణ్ణి కొన్నిప్రశ్నలు వేయవలసి వుందేమో (అని లక్ష్మావులరామచంద్రారెడ్డిం జూచి) 'రామచంద్రా! రెండవవ్యక్తిఁ బ్రశ్నలడిగేవిషయం నీభావ మేమి?'

ల. రా. 'కొన్నిప్రశ్నలడుగఁ దలఁచి వున్నాను. సభ నా కనుజ్ఞ ఇచ్చిందంటే, నే నావ్యక్తిని అడుగఁ దలఁచి వుండేప్రశ్నలంతా అడుగుతాను.'

భు. శే. '(కాంగ్రెస్సునాయకులలో రెండవవ్యక్తింగని) 'దేవరా! మాశిష్యుఁడు రామచంద్రుఁడు తమ్ముఁ గొన్నిప్రశ్నలడుగ నెంచి వున్నాఁడు. అడిగినప్రశ్నలకు ప్రత్యుత్తరాలు చెప్పెదరా?'

రెం. వ్య. 'వీళ్లు మమ్మల్ని విడిచేజాడలు కన్పడవు. రోట్లో తలదూర్చాం. రోకటిపోటుకు భయపడవచ్చునా?' (అని మనమునఁ బ్రకాశముగా) 'సభాధ్యక్షా! అలాగే ప్రశ్నలకు బదులు చెప్తా.'

భు. శే. 'సరి' (అని సభను చూచి) 'రామచంద్రుఁడు కాంగ్రెస్సునాయకుల్లో రెండవసంసారిని కొన్నిప్రశ్నలడుగుతాఁడఁట. దానికి సభ సమ్మతించవలసిందిగా నాతఁడు కోరుచున్నాఁడు. దానివిషయమై సభయొక్క అభిప్రాయం ఏంది?' (అని అడుగఁగా నారిగాఁడనుమడివేలూకఁడు లేచి) 'యేలోన్నరా!

ఖజానాలో పైకం దొంగలు దొంగిలించుకొని పోతారనుకోండి. అలా దొంగిలించినదొంగలను కనిపెట్టి ఆపైకాన్ని దొరతనానికి అప్పచెప్పేదాఁక దొరతనంపోలీసువాళ్లను వూరకుండనీయదు. ఆహారంతిననియ్యదు. నిద్ర పోనియ్యదు. అట్టిదొంగతనం సామాన్యసంసారియింట్లో జరుగుతుం దనుకోండి. అట్టిపట్టులలో పోలీసువాళ్లు వుపేక్ష చేశా రంటే, ఏ మట్లా వుపేక్షచేశా రంచూ దొరతనం అంతగా అడగదు' దానివల్ల పోలీసువాళ్లు దొరతనానికి వుత్తరవాదులై వుంటున్నారు. ఇక అలాకాక పోలీసువాళ్లు జనులకే వుత్తరవాదులుగ వుండేలాగా, (ఇంగ్లండులో వుండేపోలీసుశాఖాపద్ధతిప్రకారము) చేయిస్తారా?'

రెం. వ్య. 'ఇది సాధ్యమా.'

ల. రా. 'శాసనసభల్లో సనాతనధర్మాన్ని సర్వవిధముల పోషిస్తా నంచూ వూచీకత్తు వ్రాసి ఇస్తారా?'

రెం. వ్య. 'అది నావల్ల కానిపని. కాంగ్రెస్సుటిక్కెటును ఆధారం చేసుకొంచూ శాసనసభాసభ్యత్వం పొందడానికి అపేక్షించి వగుణ్ణిగా నిలవఁబడి వుంటూ వున్నాను. సాంఘికమతవిషయైకధర్మాలను వుద్ధరించేమహాకార్యభారం నాతలపై మోపవద్దు. అఖిలఇండియా కాంగ్రెస్సుకమిటీకానీ, కాంగ్రెస్సువర్కింగ్ కమిటీగానీ, నిరంకుశంగా ప్రవర్తించే కాంగ్రెస్సు ఇప్పటిప్రసిడెంటుగానీ, కాంగ్రెస్సుటిక్కెటుతో శాసనసభల్లో ప్రవేశించేసభ్యు లంతా సనాతనధర్మాన్ని పోషించవలసిం దంచూ వొక్కతీర్పు చేశి వొక్కొక్కవరునకున్నూ పంపి ఆప్రకారం ప్రతిసభ్యునకు ప్రవర్తింపవలసింది విధి; అలా ప్రవర్తించనివాళ్లవిషయమై తగినచర్య తీసుకొంటాం' అంచూ వుత్తరువుచేశినా రంటే, సనాతనధర్మాన్ని పోషించేవాళ్లల్లో నేను మొదటివణ్ణి అని నమ్మండి.'

ల. రా. 'అయితే, సరి. ఇకఁ జాలు. ఇఁక పరాయి స్త్రీని ప్రశ్నలు వేయడం నాకు ధర్మంగాదు. నేను ఆస్త్రీని ప్రశ్న లడుగను.'

భు. శే. 'అదే అభిప్రాయం సభదికూడ.' (సభలో అవునవు నని శబ్దము వినఁబడును.)

భు. శే. 'కాంగ్రెస్సునాయకుల నడిగి తెలిసికోవలసిన సందేహాల నన్నింటిని అడిగినాం. సందేహాలు నివర్తి చేసుకొన్నాం. (జస్టిస్సువర్గాన్ని చూచి) 'ఏమండి నూకలపాటిసీతారామరెడ్డిగారూ! సనాతనధర్మాన్ని శాసనసభల్లో రక్షిస్తా మంచూ వూచీకత్తు వ్రాసి ఇస్తారా?'

నూ. సీ. 'మాపార్టిలో వ్యక్తిగతమై వుండేస్వాతంత్ర్యం ప్రతిసభ్యునకున్నూ వుంటూ వుంది. దానివల్ల తా మడిగినవూచీకత్తు వ్రాసి ఇయ్యడానికి నేను వొప్పుకొంటూ వున్నాను.'

భు. శే. 'వ్యక్తిగతంగా వుండేస్వాతంత్ర్యంవల్ల లాభం కలుగదు. మీకు సభ్యత్వం కలిగినవెంటనే, మీపార్టిముఖ్యులు వ్యక్తిగతంగా వుండేస్వాతంత్ర్యాన్ని పురస్కరించుకొని ధర్మాన్ని పోషించ గూడదు. సనాతనధర్మవిరుద్ధచట్టములు వేన వలసింది జస్టిస్ పార్టిసభ్యునకు విధి' అని తీర్పు చేస్తే ఏలా? తాము పార్టికి విధేయులై వుండఁబో రా? వుండనిచో మీపార్టిని వదలుకోవలసి వస్తుంది. అ దెట్లా? ఇట్టిసంకటముల కడము లేనితీరున మీపార్టియొక్క కార్యనిర్వాహకసభయొక్క అంగీకారం తెప్పించండి. ఆప్రకారం తెప్పించినా రంటే, 'మావోట్లన్నీ మీ వే' అని అనుకోండి. మాగ్రామస్థులసమక్షంలో చెప్పుతూ వున్నాను. వాళ్లందఱున్నూ తమతమవోట్లను మీకే ఇస్తారు.' అని.

నూ. సీ. '(వ్రాసి ఇస్తాను ఇయ్యను' అని చెప్పుటకు ధైర్యం లేదు దానివలన నీళ్ళు నములును. బదులు చెప్పలేక వూర కుండును.)

భు. శే. '(ప్రజాపక్షమువారిం గాంచి) 'ఏమండీ బొజ్జయ్యపంతులవారూ! శాసనసభల్లో సనాతనధర్మమును రక్షిస్తారా?'

బొజ్జ. మాప్రజాకక్షకు సృష్టికర్త వున్నాఁడు. ఆయన్ను అడగందిన్నీ వూచీకత్తు వ్రాసి ఇస్తా నంచనికానీ, ఇయ్య నంచనికానీ చెప్పజాలను.'

భు. శే. (యజ్ఞేశ్వరశర్మ అనునాతనిం గాంచి) ఓ.యజ్ఞేశ్వరశర్మా! నీకుఁ జెప్పవలసిందే మైనా వుందా?'

య. శ. 'లేక ఏమి?'

భు. శే. 'నీకుఁ జెప్పవలసివుండేవిషయం అతిసంగ్రహంగా వుండవలె. కానీ నీ వుపన్యాసం.'

య. శ. 'గాంధి ఇంగ్లీషుదొరతనాన్ని హిందూదేశాన్నుంచి తోలేయవలె ననేవుద్దేశంతో తిలకుస్వరాజ్యనిధికి పైకం వసూలు చేశాఁడు. ఆప్రకారం వసూలు చేయడంలో దానికి సామ్మపారంగా ఇచ్చి వుండేవాళ్ళు సనాతనధర్మపరులు. వాళ్ళల్లోను బ్రాహ్మణులున్నూ ముఖ్యంగా చేరి వుంటారు. వాళ్ళను (అనఁగా బాలికావివాహనిషేధశాసనాన్ని వద్దంచూ వుండే బ్రాహ్మణులను) శిక్షిస్తాం అంచూ చెప్పక, బ్రిటిషు దొరతనం అదుష్టశాసనం చేయడానికి తోడ్పడ్డది' అందువల్ల బ్రాహ్మణజాతి ధ్వంసం అయింది. ఈ

పాటిలాభం బ్రాహ్మణజాతికి వోంప్రథంలో డిల్లీ శాసనసభల్లో కాంగ్రెస్సుటిక్కెట్టుతో ప్రవేశించి వుండేకాంగ్రెస్సుస్వరాజ్యకక్షువల్ల అయిం దనేది నాభావమే కాక సనాతనధర్మపరుల దై వుంటూ వుం దని నానమ్మకం. బ్రాహ్మణజాతిధ్వంసం చేయడానికి దొరతనం ఏల పూటబడ్డ దనడానికి అడవికిఁ బయనము కట్టి వుండేశ్రీరాముఁడు తనవెంట వత్తు నంచూ దుఃఖిస్తూ వుండినసీతతో ఇట్లన్నాఁడు :-

* "విప్రియం న చ కర్తవ్యమ్
భరతస్య కదాచన
స హి రాజా ప్రభు శ్చైవ
దేశస్య చ కులస్య చ." ౧

'ఆరాధితా హి శీలేన
ప్రయత్నై శ్చోపసేవితాః
రాజాన స్సంప్రసీదంతి
ప్రకుప్యంతి విపర్యయే.' ౨

స్పృశ న్నివ గజో హన్తి
జిఘ్ర న్నివ భుజఙ్గమః
స్మయ న్నివ నృపో హన్తి
మానయన్నివ దుర్జనః. ౩

ఔరసా నపి పుత్రాన్హి
త్యజం త్యహితకారిణః
సమర్థా న్సంప్రగృహ్ణంతి
జనా నపి నరాధిపాః. (వాల్మీకి) ౪

వాల్మీకిమహర్షి చెప్పినప్రకారం బ్రిటిషుప్రభుత్వం చిఱునవ్వు నవ్వుచూ బ్రాహ్మణజాతిధ్వంసం చేయడానికే శాసనసభచే బాలికావివాహం చేయించింది. సనాతనధర్మపరులు ఆశాసనం వద్దంటూ,ఎన్నిసభలు చేయలేదు? దానికి తోడ్పడవద్దనడానికి వైస్రాయిపాలికి ఈ సనాతనధర్మపరులయొక్క నియోగము లెన్ని (Deputations) పోవ లేదు? సైమన్‌కమిషన్ వచ్చింది. దానితో సనాతనధర్మపరు లెంత మొర లిడలేదు? పరమపదించిన శ్రీమాన్ కె. కృష్ణమాచార్యులు లండనుకు పోయి హోరుతో ఎట్లెట్లో మొత్తుకోలేదు? ఫల మేమి? బాలికావివాహనిషేధశాసనం అయింది. అదే ఫలం. గాంధిలండనుకు పోయినాఁడు. అతఁడు కోరినప్రకారం పార్లమెంటు ద్వారా నడచుకోడానికి వొప్పుకొన్నది. దానికి ఫలంగా సంఘసంస్కారుల కనుకూలంగా వుండేలాగున క్రొత్త రాజ్యాంగం పార్లమెంటుద్వారా చేసింది. కారణం ఏమి? తిలక్కుస్వరాజ్యనిధికి సామాన్యముగా నోరులేని పెద్దమ్మలై వుండేసనాతనధర్మపరులైనహైందవులున్నూ ముఖ్యంగా బ్రాహ్మణులున్నూ, ధనం కుమ్మరించిందే కారణం. సి. రాజగోపాలాచార్యుఁడు రాజకీయ వ్యవహారాన్ని వదలుకొన్నవాఁడు తిరుగ అందుఁ బ్రవేశించిం దెందులకు? "అస్పృశ్యత తొలఁగించడానికిన్నీ, దేవాలయప్రవేశం కలిగించడానికిన్నీ." కావున శాసనసభా ద్వారంలో ప్రవేశించడానికి ప్రయత్నిస్తూ వుండే కాంగ్రెస్సుసభ్యులు పయోముఖవిషకుంభాలు. వాళ్ళను నమ్మవద్దు. శాసనసభల్లో కాంగ్రెస్సుసంఖ్య అధికంగా వున్నా, జస్టిస్‌వర్గంయొక్క సంఖ్య ఎక్కువగా వున్నా ప్రజాకక్షుసంఖ్య పెచ్చుగా వున్నా, సనాతనధర్మానికి తలనొప్పే. ఒకటికంటె వేఱొకటి వన్నెమించిం దనేలాగా కాంగ్రెస్సు ధర్మధ్వంసం చేయడంలో ముందు మిగుల్తుంది. జాగ్రత్త! జాగ్రత్త! ఈమూఁడుకక్షులలో ఏదైనా సరే సనాతనధర్మాన్ని రక్షిస్తానంచూ పూచీకత్తు వ్రాసి ఇచ్చేకక్షును వరించుకోవల్సింది.'

---

* భరతుఁ డీదేశమునకును మనకులమునకునుఁ బ్రభువు. అట్లగుటవలన నీ కతనికి విరోధమార్గమున వర్తించుకొనఁ గూడదు. ౧

భూపతులు తమకనుకూలప్రవర్తకులగుచును ప్రయత్నించి తమ్మనవరతము సేవించుచును, ఉన్నచో, సంతోషించెదరు. ఆప్రకారము కాక విపరీతముగ వర్తించెడిపక్షమున మిక్కిలికినుక వహించెదరు. ౨

పుడిమిఱేఁడు తమకు విరోధముసేయువారు, తమకు ధర్మపత్నులందు జన్మించి ధర్మపరులై యుండు నౌరసపుత్త్రులై యున్నను వారిఁ ద్యజించెదరు. చుట్టాలు కాకుండుజనులు సామాన్యులును, నేర్పరులును, అయి యున్నను, తమకు మేలు సేయువార లయ్యేడివారలగుదు రేని, వారలం జేరఁ దీసెదరు. ౩

గజము తనపాదములతోఁ దనశత్రువుఁ దాఁకుచున్నట్లే యుండి వానిఁ జంపును; పాములు తమకు హాని సేయువారిని మూచూచినట్లు నటించి, వారిని హతముసేయును; రాజు తమకుఁ గీడు గోయువారిని (దండించెదమని చెప్పకయుఁ గోపగించుకొనకయును) చిఱునగవు నగచుచు వారిం జంపును. దుర్జనుఁడు (తనకు హాని సేయుజనులను) గౌరవింపుచు వారిని హతముసేయును.

భు. శే. 'మాలవాళ్ళప్రతినిధి రాగడు కాంగ్రెస్సునాయకులతో సంభాషించ గోరి వున్నాఁడు. వాని కిఁక వాళ్ళతో సంభాషించ వచ్చును.' (అని రాగణ్ణి చూచి) 'రాగా! కాంగ్రెస్సువాళ్ళతో మాటలాడడానికి నీకు వంతు వచ్చి వుంది. మాటలాడుము, వాళ్ళతో.'

రా. '(దూరమున నిలవఁబడి) సామే! నాను యిన్నపం సేసుకో నేదంతా మా రెడ్డోరు (కాంగ్రెస్సుసభ్యులలో మొదటివ్యక్తిం జూపి) ఆపభువుల్ని ఆడిగేశే వుంటున్నారు. నాను సెప్పుకోవల్సిం దేమిన్నీ లేదు.'

భు. శే. 'అయితే సరి. ఇక నా అంత్యోపన్యాసం నిలవ వుంది. వోట్లకై వచ్చివుండేకక్షుల కంతా వుమ్మడి మాట లొకటిగొండే. మాకు ధర్మం ముఖ్యం. రాజ్యం ఏలడం దానికి వెనుకటిది. హిందూదేశాన్ని ఇంగ్లీషోళ్ళు ఏలినా? జర్మనివా ళ్ళేలినా? తురక లేలినా? ఎవ్వ రేలినా, మా కొక్కటే. 'ధర్మధ్వంసం చేశి దేశాన్ని పాలిస్తాం, అనేవాళ్ళు మాకు ప్రభువులు కారు. ధర్మం అంటే కక్షులన్నింటికిన్నీ తలనొప్పి. ధర్మాన్ని అనుష్ఠిస్తూ వుండేఅస్మదాదు లీదేశంలో వుండడానికి చోటు లేదు. సి. రాజగోపాలాచారి మొదలుగా గలకాంగ్రెసుసభ్యులు శాసనసభల్లో ప్రవేశించా రంటే, "రాజకీయాంశంతో సనాతన ధర్మాన్ని కలపడం వుచితం కాదు. దానికిన్నీ దీనికిన్నీ సంబంధం లేదు. సనాతనధర్మాన్ని తలచ వద్దు. రాజకీయాంశం ఆలోచించ తగింది. పేడా బెల్లం కలిపేలాగా ఆరెంటినీ కలపవద్దు. మాలోళ్ళదగ్గఱకు పొండి అని మేము నిర్బంధించం. నిర్బంధించడానికై శాసనం చేయము.' అని సి. రాజగోపాలాచారి అంచూ వుంటున్నాఁడు. అంటరానితనాన్ని మాయం చేయడానికి రంగయ్యా రను బ్రాహ్మణుఁడు డిల్లీశాసనసభలో చిత్తుచట్టం పెనబూని వుంటాఁడు రెండుమూడేండ్లకు పూర్వం. అప్పుడు ఈ సి. రాజగోపాలాచారే, మఱెన్ని ఎవ్వఁ డున్నా కాఁడు; గాంధికుమారునకు తనకుమార్తను ఇచ్చి పెండ్లి చేసినోఁడు, ఈ సి. రాజగోపాలాచారే, వ్యోమయానంలో తనఅబ్బసొమ్ము మునిగిపోయినలాగా డిల్లీకి పోయి, డిల్లీశాసనసభాసభ్యుల్లో వొకొక్కసభ్యుని కాళ్ళమీఁద పడి రంగయ్యారుకు తోడ్పడమంచూ, వేఁడుకొన్నాఁడు. వాళ్ళగడ్డాలను పట్టుకొన్నాఁడు. అట్టివాఁడు నేఁడు అంటరానితనాన్ని తోశివేయడానికి ప్రాచీనాచారపరాయణులై వుండేఅస్మదాదులను నిర్బంధించడానికై శాసనం చేయడానికై శాసనసభలను సాధనంగా వుపయోగించుకోనం చుంటున్నాఁడు. అతని ఈమాటలు నమ్మ దగిందా? రాజకీయాంశా లంట. ఇంగ్లీషు దొరతనానికి గులాం లనిపించుకొంటూ వుండేహిందూదేశస్థులకు రాజకీయాంశము లున్నవంచూ చెప్పకోడానికి నోరున్నదా ఈ సి. రాజగోపాలాచారికి? పరాసురాజ్యానికిన్నీ, గ్రేటు బ్రిటనుకున్నా రాజకీయాంశము లున్న వంటే, వొప్పుకోఁ దగిన మాట. ఇంగ్లీషు ప్రజలు మనకు పాలకులు. మనం పాలించబడేవాళ్ళం. వాళ్ళకు లోబడి వున్నాం. ఏమైనా మనంతోక, ఆడించితే, తలమీఁదవొకబాంబు. వీపుమీఁదనుఱిపెట్టే వొక్క గుండు. రొమ్ముకుముం దొక్క పిరంగి. ఏదిన్నీ లేకపోతే విషవాయువు. ఇటలీ అబ్బీసీనియాను ఏం చేశింది? విన్నారు గదా? కన్నారు గదా! సకలవిధాలదుర్బలులుగా వుండేహిందూదేశస్థులకున్నూ, అన్నివిధాల బలవంతులైనఇంగ్లీషుప్రజలకున్నూ సమానప్రతిపత్తి ఏవిధాన తలచినా లేదు. లేనే లేదు. రాజకీయములు ప్రధానం. ధర్మం అప్రధానం, అని సి. రాజగోపాలాచారి చెప్పడం ధర్మపరులను బేలు పుచ్చడానికే. అతఁడు తేనెపూసినకత్తి. అతఁడు చెప్పేమాటలకు బేలు పోయి కాంగ్రెస్సు నాయకులకు వోట్లియ్య వద్దు! వద్దు!! వద్దు!!!

రాక రాక మనగ్రామానికి వచ్చినకాంగ్రెస్సునాయకులకున్నూ జస్టిస్‌వర్గానికిన్నీ, ప్రజాకక్షకున్నూ మా గ్రామస్థులకుమారుగా కృతజ్ఞతాపూర్వకసహస్రవందనము లర్పిస్తూ వున్నాను. వోట్లియ్య లేదని ఏ కక్షకున్నూ అతృప్తి పడరాదు. 'ధర్మాన్ని రక్షిస్తాం' అంచూ పూచీకత్తు వ్రాసి ఇచ్చేకక్షకు హిందూదేశంలో వుండే సనాతనధర్మపరులబృందం అంతా వొక్కకుత్తుకతో తమతమ వోట్లియ్య వలసిందిగా ప్రార్థిస్తూ వున్నాను.

(అంత కాంగ్రెస్సునాయకులలో సమస్తకక్షులకు మారుగా సభకు గాను, సభాచర్యను చక్కఁగ నడిపినందులకు సభాధ్యక్షులకును, వందనము లర్పించె. అంత సభాధ్యక్షుఁడు సభాచర్య చాలును. ఎల్లవారికి స్వగృహములకుఁ బో వచ్చును.' అన విని ఎల్లజనులును నిష్క్రమింతురు.)

చెన్నపురి లిబర్టీ ముద్రాక్షరశాలయందు ముద్రింపఁబడియె—1937